విమల్ సూటింగ్‌లో
సరికొత్త శ్రేణికై
నేడే విచ్చేయండి మంగళ్‌దీప్‌కి.






మంగళ్‌దీప్

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

## ధర్మోరక్షతి రక్షితః

8—10—82 సంచికలోని మీ(మా) సచిత్ర వారపత్రికలోని "ఉత్తరాలు" చదివాక ఈ ఉత్తరం వ్రాయకుండా ఉండలేకపోతున్నాను.

మిత్రులు జి. డి. ఎస్. విజయకుమార్ గారు తన ఉత్తరములో లేవనెత్తించిన సమస్య అంత సులభంగా తీసి పారేయ దగ్గది కాదు. ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ గారి నవల— రిజర్వేషన్ విషయములో వచ్చిన తగాదాల, వాదనలకల్మషము లేని ప్రతిబింబము.

రిజర్వేషన్ వలన 70 శాతం మార్కులు వచ్చిన ఒక పేద బ్రాహ్మణునికి ఉద్యోగము రాక పోవడం, 50 శాతం మార్కులు వచ్చిన అండ దండలు ఉన్న హరిజనునికి ఉద్యోగము రావడములో ఎంతైనా విషాదము ఉంది. ఈ విషాదాన్ని ఎత్తి పొడవడంతో విజయకుమార్ గార్కి అంత ఆవేశము రావడం చాలా పొరపాటు. రచయిత కథలో మార్పు తెప్పించి ఆ ఉద్యోగము పేద బ్రాహ్మణునికి అయినట్లు చేసియుంటే విజయకుమార్ గారి ఆవేశానికి హద్దు ఉంటుందా అన్నది నా ప్రశ్న. రిజర్వేషన్ ద్వారా మొదలుకాని ఏ సమస్య లేదని గ్రహించి తన పొరపాటును గుర్తించగలరని నా మనవి.

టి. వసంత కృష్ణ (బైపల్లి)

* * *

22.10.82 ఆంధ్ర సచిత్ర వారపత్రికతో ముగింపు కొచ్చిన సీరియల్ "ధర్మో రక్షతి రక్షిత." సనాతన సాంప్రదాయాలకు, సామాజిక శ్రేయస్సుకూ జరిగే పోరాటానికి అద్దం పట్టింది. గౌతముడి ఆత్మార్పణతో ముగింపు రాణించింది. జీవితంలో తాను సాధించ దలుచుకున్నది లభించాక దానికి పరిపూర్ణత లభించినట్లే! ఆ లక్ష్య సాధనతో గౌతముడు ఒక సమిధగా మారి సనాతన కుల వ్యవస్థలోని లోటు పాట్లనూ, వాటిని అధిగమించి, బయటకు రావడంలోని ఆవశ్యకతని జన్మ నిచ్చిన తల్లి దండ్రులు దీక్షితులు, లలితాంబగార్లకువిష్ణవరూపేణాకాకుండా పశాస్త్రీయంగానే విశద పరిచాడు. ఈ 'యాగ పరిరక్షణలో' కొన్ని కట్టుబాట్లని గౌతముడు ఉల్లంఘించవలసి వచ్చినా నిండు మనసుతో అతని చర్యను చివరకు ఆమోదించారు వారు.

కథ—కథనం ఆదినుంచి ఆసక్తి దాయకంగా ఉన్నాయి.

వి. వి. సుబ్బారావు (ఖమ్మం)

* * *

"ధర్మం రక్షింపబడాలి" అన్న ప్రశంసనీయమైన సందేశం అందించిన 'ధర్మో రక్షిత రక్షితః' నవల మా కెంతో నచ్చింది. ముఖ్యంగా అసాధారణమైన గౌతముని పాత్ర చిత్రణ బాగున్నది. నవలకు చక్కని ముగింపు నిచ్చారు, రచయిత ఆకెళ్ళ వెంకట సూర్యనారాయణ. "దైవం", "ధర్మం", "మతం" అంటేనే వింతగా చూసే ప్రజలున్న ఈ తరుణంలో ఇటువంటి నవల వ్రాసిన రచయితకు, ప్రచురించిన మీకు ధన్యవాదాలు.

అవుల రమణారెడ్డి (జమ్మలమడుగు)




## నవ్వాగలేదు !

అక్కినేని నాగేశ్వరరావు, జయప్రద ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్రవారపత్రికలో (1)మధురం—మధురం— అధరం —మధురం, (2)మల్లెతీగ, (3) అల్లుడు ఆషాడమాసం కథలు బాగున్నాయి. ఈ కథలు చదువుతున్నంత సేపు నవ్వాగలేదు.

శ్రీ చాగంటి శంకరశాస్త్రి (యనమదుర్రు)

## లా ట రీ లు !

లాటరీలు జూదం కంటే ఏమి తీసిపోలేదని ఒకప్పుడు వీటిని నిషేధించారు. కాని లాభాలను దృష్టిలో వుంచుకొని మళ్ళీ మొదలుపెట్టారు. రూపాయికి టిక్కెట్టు కొని లక్షల రూపాయల కోసం ఎదురు చూసే మనస్తత్వం ప్రబలడం దేశానికి మంచిది కాదు. లక్షల మీద మోజు పెరిగే నిత్య జీవితంలో సోమరిపోతులుగా తయారు కావడానికి అవకాశం వుంది. అంతేకాదు, అదృష్టం మీద లాటరీ వేసి ఒక్క నంబరులో లక్ష రూపాయలు తప్పిపోయిందన్న వాడి మనోవేదన అంతులేనిది, ఒకడిని లక్షాధికారిగా చేసేందుకు ఇన్ని లక్షలమందిని బాధ పెడుతున్న ఈ లాటరీలను నిషేధిస్తే చాల మంచిది.

ఎం. డి. అస్లాం (ఇల్లందుకాలరిస్)

## విజ్ఞానదాయకం

శ్రీమతి లక్ష్మీరమణగారు ఇంగ్లండు, అమెరికా దేశాలలోని వివిధ విషయాలను గురించి చెప్పిన సమాధానాలు ఎంతో విజ్ఞానదాయకంగా వున్నవి.

షేక్ మీరాషరీఫ్ (పెరవలి)

## మ న వి

విద్యార్థిలోకం వ్యాసరచన పోటీలో ప్రత్యేక బహుమతులు పొందిన శ్రీ సత్యవోలు శ్రీనివాసరావు (విశాఖపట్నం), కుమారి డి. వి. ఎస్. ఎస్. ఎస్. లక్ష్మి తమ ప్రస్తుత చిరునామాలని తెలియపరుస్తూ ఫొటో, జీవిత వి వ రా ల ని వెంటనే పంప గోరుతున్నాము.

— సంపాదకుడు

## కవనశర్మగారికి థాంక్స్

"సంచార పరిశోధనాలయం" వంటి వ్రాసినందుకుకవనశర్మగారికిథాంక్స్. 8.10 సంచికలో మీ కథ చదివాక నామెదడే ఒక 'సం పరిశోధనాలయం'గా మారింది. కథలోని చ వాక్యాలను పరిశోధించాను. నలుపు తెలుపు కులాలున్నందున అమెరికాలో 'ఎంత గొడవ జ తున్నది'అన్నవాక్యాన్ని పరిశోధించగా—అబ్జర్వేష అమెరికాలో అసలు కులాలు లేవు. ఉన్నది ప్రాబ్లమ్. ఆ రేస్ ప్రాబ్లమ్ కూడా ఆఫ్రికావా లైన నీగ్రోలు అమెరికాకు వలస వచ్చినంద ఏర్పడినటువంటిది ఆ రేస్ ప్రాబ్లమ్‌తో మన కా ప్రాబ్లమ్‌ను పోలుస్తూ సిద్ధయ్య చేత కొన్ని బు లేని కూతలు కూయించారు. "ధర్మో రక్ష రక్షితం" రచయిత కేవలం హరిజనుల మన నొప్పించి నా చేత పెద్దాపురం చేంతాడంత ఉత్త (8 10 82లో) రాయించారు గానీ, మీరుఏకం ఎస్సీలనూ, బీసీలను కలిపి? నొప్పిస్తున్నారు. దీం నైనా ఇక తక్కిన 'రిజర్వేషన్ లిస్ట్' లో క్ మిత్రులు మేల్కొంటారు. నా పెద్దాపు చేంతాడంత ఉత్తరంలో నే చేసిన చిన్నపొరపాటు దిద్దుకోవటానికి కూడా మీరే అవకాశమిచ్చార ఈ పెద్ద కులపోళ్ళ కొందరు వీళ్ళను బట్టి వెన బడిన అన్ని కులాలనూ తిట్టేవారనన్న నీతి తేలి బి సీలమూ ఎస్సీలనూ వేరు చేస్తూ నేను పెద్ద పురం చాంతాడంత ఉత్తరంలో రాసినందుగ్గా చింతిస్తున్నాను. ఎస్సీలూ బీసీలూ అంత ఏకమై ఇక మీ సుపీరియారిటీ కాంప్లెక్సున ఎదుర్కొంటారు.

జి. డి. ఎస్. విజయకుమార్, (పత్తికొండ)

## స క్సె స్

విజయశాంతి ముఖచిత్రంతో వచ్చిన పత్రిక మనసును ఆహ్లాదపరిచింది. ఆ నాటి సంచికలో "సక్సెస్" కథ చాల దయార్ధ్రనీయంగా వున్నది.

బిరుదరాజు సతీష్‌కుమార్‌భట్ (కాజీపేట)

## అభినందనలు

రంగు రంగుల
కమనీయ చిత్రాలు
ముఖచిత్రానికి అలంకరణలు
ఎందరెందరో పాటకుల ఉత్తరాలు
కడుపుబ్బ నవ్వించే కార్టూనులు
భావుకతను కల్గిన కవితలు
వాస్తవతని కల్గిన కథలు
ఆసక్తిని కల్గించే సీరియల్స్
సందేహాలను తీర్చే ప్రశ్నావళి.
పొలక్షని డైరీలు, సినిమాలు
ఢిల్లీ లేఖలు, లోకం పోకడలు
ప్రతివారం పాటకుల్ని
మురిపించే పత్రిక
నీకు నా అభినందనలు.

ప్రియ (డోర్నకల్)

( 74 వ పేజీ చూడండి )

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభు పసాద్
సంపాదకుడు
[1938 1972]
శుక్రవారం 12 11-'82
దుందుభినామ సం. నిజాశ్వయుజ బ. ద్వాద
సంపుటము 75 సంచిక 11
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

*

ఆరు మాసాల చందా రు 42-90
పోస్ట్‌లో ఏడాది చందా రు 85-80
విడి ప్రతి వెల రు 1-50
ఆంధ్రపత్రిక కార్యాలయము
గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

ముఖచిత్రం :
నటి "వనిత"
(ఫొటో : ఎస్. ఆర్. డి. మూర్తి)



## * లోకంపోకడ — ఊమెన్ *



# సంగీతం - ఫూల్ వాలోన్ కీ సైర్




ఈ మధ్యనే ఢిల్లీలోని పత్రికలు ఒక బొమ్మని ప్రచురించాయి. ఇది కాంగ్రెసు (ఇందిర) పార్టీ కార్యాచరణ వర్గం యొక్క బొమ్మ. నాకు కాంగ్రెసు (ఇందిర) పార్టీ వారి మొహాలు కొన్ని తెలుసు (పోలీసు వారికీ దొంగలు మొహాలు కొన్ని అయినా తెలియాలి కదా ?) అయితే, ఈ బొమ్మలో ఒకరిని మాత్రమే నేను గుర్తుపట్టగలిగాను ఎవరిని ? ఇంకెవరిని, శ్రీమతి గాంధీనే ! తక్కిన అనామకుల మధ్య ఆమె కొట్టవచ్చినట్లు కనిపించారు మిగతావారు ఏ లోకం నుంచి వచ్చినా మనకి అనవసరం. వారిలో ఎవరికీ కాంగ్రెసు (ఇందిర) పార్టీ నాయకులుగా గుర్తింపులేదు. [ఈ రోజులలో బాంకులో ఎంత ధనం ఉంటే అంత గొప్ప వారను కుంటారుట. కాని, బొమ్మలో బాంకు ఎకవుంట్ల వివరాలు కనిపించవు ! ]

20 సంవత్సరాల క్రితం కాంగ్రెసు కార్యాచరణ సంఘం అంటే మాటలు కాదు అప్పటిలో ఒకటే కాంగ్రెసు ఉండేది. ఇప్పుడు కేంద్ర మంత్రివర్గమే అతిసాదా మనుషులతో నిండి ఉంటోంది. ఒకసారి నేను సి. డి. దేశ్‌ముఖ్‌ని చూడటానికి వెళ్ళాను. ఆయన అప్పటిలో నెహ్రూ మంత్రివర్గంలో ఆర్థిక శాఖని నిర్వహిస్తూ ఉండేవారు మనిషి అందగాడు. తన ఉద్యోగానికి సంబంధించిన విజ్ఞానం కావలిసినంత ఉంది ఇంగ్లీషు మాటలాడటం మొదలు పెట్టాడంటే 200-300 మాటల అనంతరం కూడా వాక్యనిర్మాణం కుంటుపడకుండా వాక్యాన్ని ముగించేవాడు. ఇంగ్లీషులో మొదలుపెట్టి మరాటీలోకి మారి సంస్కృతంతో ముగించేవాడు ఆయన ! ఇంతసేపూ దేనిని గురించి మాట్లాడేవాడనుకుంటున్నారు ? అంతా ప్రణాళికలని గురించే ! ఆయన జ్ఞానం, పాండిత్యం అటువంటివి.

ఇటీవలే ప్రణబ్ ముఖర్జీతో మాట్లాడే అవకాశం నాకు కలిగింది. ఆయన ఒకప్పుడు దేశ్‌ముఖ్ కూర్చున్న గదిలో కూర్చుని ఉన్నాడు. కుర్చీ కూడా అదేనేమో ! కాని. పోలిక అంత మాత్రమే ముఖర్జీని మంత్రి అనటం కన్నా శ్రీమతి గాంధీ ప్రభుత్వాన్ని సమర్థించటమే పని కలవాడు అనటం సమంజసంగా ఉంటుంది. అనుభవం కల ఒక మంత్రి ఉన్నాడంటే ఆయన కేవలం లెక్కలు వేసేవాడు కాలేదు; ఒక ప్రభుత్వం యొక్క ప్రతినిధి కదా ? ఆ ప్రభుత్వం యొక్క తత్వాన్ని ఆయన ప్రకాశింప చెయ్యాలి కదా ? ప్రతి ప్రభుత్వం యొక్క ఆలోచనా సరళికీ తాత్త్వికమయిన ఒక పునాది ఉంటుంది. దీని వలననే ఆ ప్రభుత్వానికి ఒక గుణం ఏదో ఉన్నట్లు అనిపిస్తుంది. నెహ్రూ ప్రభుత్వానికి ఇది ఉండేది, లాల్‌బహదూర్ శాస్త్రి ప్రభుత్వానికీ ఉండేది. కొంత దాకా జనతా ప్రభుత్వానికీ ఈ తాత్విక గుణం ఉండేది – ఉండటం చేతనే ఆ ప్రభుత్వం యొక్క పంచవర్ష ప్రణాళికలలో దాని ప్రభావం కనిపించింది. హాలీవుడ్ నుంచి "కౌబాయి" సినిమాలంటూ వస్తాయి. వీటిలో కౌబాయి అని పిలువబడే గొడ్లకాపరులు గుర్రపుస్వారీలో తమ నైపుణ్యాన్ని ప్రకటిస్తూ ఉంటారు. గుర్రాల నేత ఏమిటేమిటో తమాషాలు చెయిస్తూ ఉంటారు శ్రీమతి గాంధీ ప్రభుత్వంలో వీరు అశ్వాల వంటివారు. వారికి ప్రభుత్వాన్ని నడిపే అధికారంలేదు ఆ అధికారం ఆమెదీ, ఆమె ప్రియ పుత్రుడిదీను వీరు చెయ్యగలిగిందెల్లా దస్త్రాలని కదపటమే, దస్త్రాలు మామూలు వసు పులేమీ కావు. శ్రీమతి గాంధీ వాటిని జాగ్రత్తగా చూసుకుంటూంటారు అందుకనే అవి అలాగ మాయమవుతూ ఉంటాయి. నేను ముఖర్జీతో గడిపిన గంటలో ఆయన అంకెలమీద అంకెలు వల్లించాడు. ఆయన మాటలలో స్మరించుకొనతగినది ఒక్కటీ నాకు వినపడలేదు స్వావలంబనం విషయములో ప్రభుత్వం ఏమి చెయ్యాలనుకుంటోంది ? సాంకేతిక విజ్ఞానం మాటఏమిటి? అభివృద్ధికి సంబంధించిన ఆలోచనలు ఎలాగ ఉన్నాయి ? ఏటి ప్రసక్తి నాకేమీ వినపడలేదు. శ్రీమతి గాంధీ మంత్రులు ఒకరకం గుమాస్తాలు. ఇప్పటికే విపరీతంగా పెరిగిపోయి ఉన్న పాలనా యంత్రాంగానికి వారొక అనుబంధం వంటివారు.

కేంద్రంలో కానివ్వండి, రాష్ట్రాలలో కానివ్వండి - మంత్రులుగా చెలామణి అయ్యేవారంత అసమర్థులింకెక్కడయినా కనపడతారా ? వీరేకదా చాలావరకు కాంగ్రెసు (ఇందిర) కార్యాచరణ సంఘం సభ్యులు ? బాబాసాహెబ్ భోన్సలే అవమానింప బడినంతగా మహారాష్ట్రలో ఇంకెవరయినా అవమానింపబడు తారా ? "నేను నా ప్రభుత్వంలో ఎల్.డి సి.గా పనిచెయ్యటానికి కూడా పనికిరాను !" అని ఆయనే ఎన్నిసారులు అనలేదు? [ఆయన అంచనా సరయినదే అంటారు ఆయన తోటి మంత్రులు ] ఆయనని ఢిల్లీకి పిలుస్తారు అయిదు నిముషాల ఇంటర్వ్యూకోసం అయిదు రోజులు కాచుకుని కూర్చుంటాడు పాపం అక్కడ ఆయన. చివరికి దొరికే ఆ ఇంటర్‌వ్యూ ఎవరితో ? శ్రీమతి గాంధీ నమ్మిన బంటులలో ఒకరితో. ఇంటర్‌వ్యూ అయిపోగానే ఆయన రాజధానిని వదలి వెళ్ళిపోవాలి. ఇప్పుడు ఆయన మంత్రివర్గంలో సగం మంది అసమ్మతి వాదులు. మిగతా సగం మంది ఇవాళవచ్చి - రేపు వెళ్ళిపోయే రకం. "నా సామాను ఎప్పుడూ సర్దే ఉంటుంది." అని భోన్సలే అంటూనే ఉన్నారుట.

కాంగ్రెసు (ఇందిర) పార్టీకి ఒక సంస్థకి ఉండ తగిన గుణాలు ఉన్నాయా ? కాంగ్రెసు (ఇందిర) పార్టీ సంస్థ నిర్మాణం ఏమిటి ? పార్టీకి చాలా డబ్బుఉంది (ట), కాని సభ్యులు ఎవరు ? అరుణ్ నెహ్రూ లాంటి వారు చేసేది ఈ ధనాన్ని కాపాడటమే కాని వాళ్ళకి వేరే పని ఏమిటి ? కాంగ్రెసు (ఇందిర) స్వరూపం వేదాంతుల మాయ వంటిది. ఉందో తెలీదు, లేదో తెలీదు మాయ, నిర్వాణం ఒకదాని కొకటి దగ్గరగా ఉంటాయి. శ్రీమతి గాంధీ నిర్వాణానికి చేరువగా ఉన్నారను కోవచ్చునా ? అనుకోవలిసిందే ఎందుకంటే, నిర్వాణ గుణంలేనిదే ఇంత దేశాన్ని ఎవరు మాత్రం ఏలగలరు ? ఇక్కడ అంతా త్యాగమే కదా ? అన్నీ వాటంతట అవే నడుస్తాయి కదా ?

ఇవన్నీ మాటలేకదా ! నిజానికి ఈ దేశంలో ఎంత త్యాగం ఉంది ? అన్ని వాటంతట అవే నడుస్తున్నాయా ఏమిటి ? రైలుబళ్లు వేళకి రావు, వెళ్లవు ఉత్తరాలు గమ్యస్థానాలు చేరుకోవు విద్యుత్ కేంద్రాలు పనిచెయ్యవు. బస్‌లు నడవవు మురికి కాలువలు వెల్లువలలా పారుతాయి. ఆసుపత్రుల నిండా మరణావస్థలో ఉన్న రోగులు ...

ఈ మధ్యనే ఢిల్లీలో నలుగురుని చంపారు. బొంబాయిలో ఇద్దరిని చంపారు. ఇంకొక అరడజను చోటులలో అరడజను మందిని చంపారు వార్తాపత్రికలో పోలీసువారు తుపాకులు గురిపెట్టి కాల్చే బొమ్మలు పడ్డాయి. బస్‌లని తగలపెట్టే దృశ్యాల బొమ్మలూ పడ్డాయి. [తగల పెట్టటం ఎక్కడో తెలుసా? పార్లమెంటు పక్కనే ! ] అప్పుడు శ్రీమతి గాంధీ ఎక్కడ ఉన్నారు ? ఆమె ప్రియ పుత్రుడు ఎక్కడ ఉన్నారు ? అబ్బాయిగారు ఫయిర్ ఇంజన్‌ల కోసం వెతుకుతూ ఉండిపోయారేమో ! లేదా పోలీసు వారిని మందలిస్తూ ఉండిపోయారేమో ! ఈ యువ సంగతి సరే అసలు ప్రధాన మంత్రి ఎక్కడ ఉన్నారు ? మెహరౌలీలో ఉన్నారు అక్కడ ఏమి చేస్తూ ఉండిపోయారు ? ఫూల్ వాలోన్‌కీ సైర్ వంటి వేడుకలని పునరుద్ధరణ చేయిస్తూ ఉండిపోయారు నిర్వాణం ఎన్నో రకాలు. నీరో చక్రవర్తికి సంగీతం, శ్రీమతి గాంధీకి పువ్వులు. ఎవరి అభిరుచి వారిది !

# డబ్బుకోసం

భమిడి వెంకటేశ్వర్లు



వెంకటావుకు అర్జంటుగా మూడొందలు కావాలి. జీతం తీసుకొని పదిరోజులయింది. అప్పుడే ఏ అవసరం కల్గిందో? జీతానికి, చేయబోయే ఖర్చులకు సంబంధం లేని అదనపు ఖర్చులొచ్చాయి వెంకటావుకు.

ప్రతీనెలా పదో తేదీనుంచే వెంకట్రావుకు కోపం, చిరాకు కలుగుతుంటాయి అప్పట్నుంచీ జీతాల రోజు కోసం ఎదురు చూస్తాడు.

పదిహేనేళ్ళ నుంచి వుద్యోగం చేసే వెంకట్రావుకు పదకొండేళ్ళ క్రితమే పెళ్ళయి, యిప్పుడు ఇదరు పిలల తండ్రి అయ్యాడు.

మంచో, చెడో వెంకట్రావు ఇంటిస్థలం కొన్నాడు. స్థలం వుంది కాబట్టి యిల్లు కట్టాలి. కట్టాలంటే డబ్బుకావాలి. ఆ డబ్బు ఆఫీసులో అప్పురూపంలో లభిస్తుంది. అయితే ఆఫీసు వాళ్ళిచ్చే అప్పుతో యిల్లు అవదు. అందుకోసం మరికొంత అప్పు చేయాలి.

ఇలు కట్టేందుకు ఆఫీసు వాళ్ళు పాతి! వేలు అప్పు ఇస్తే మరో పాతికవేల ప్రా: డెంటు ఫండు నుంచి, కోపరేటివ్ బాంక నుంచి, స్నేహితుల దగ్గర లెచ్చి యిల్లు పూర్తిచేసాడు వెంకటావు స్నేహితులకు తప్ప, మిగిలిన బాకీలు తన చేతితో తీర్చక్కరేదు అతను. ఆఫీసు వాళ్ళే అన్ని బాకీలు వసూలు చేస్తూ, మిగిలిన జీతం చేతిలో పెడ్తారు కాబట్టి వెంకట్రావుకు అప్పు తీసుకోవట్టే వుండేది.

పోతే ఆఫీసులో "ఇల్లు పూర్తయినట్లు సర్టిఫికేట్" యివ్వని కారణంగా, జీతంలోంచి వందరూపాయలు కోసేసి, మిగిలిన జీతం యిచ్చేసరికి, పూర్తికాని పనులు వెంటనే చేయించేడు. అందుకు ప్రావిడెంటు ఫండు, బాంకు నుంచి తీరిన అప్పును పునరుద్ధరించక తప్పలేదు అతనికి కొన్నాళ్ళు ఆఫీసులో యిచ్చిన మెమోలకు ఏవో కారణాలు చెపుతూ మరి కొంత గడువు కోరాడు వెంకటావు. ఏలాగయితేనేం, యీ కారణంగానైన యిల్లు పూర్తిచేసినందుకు హాయిగావుంది అతనికి.

వెంకటావుకు యిప్పుడు జీతం నుంచి కోతలుపోగా చేతికొచ్చేది రెండువందల డబ్బై అయిదు మాత్రమే! అయితే మరో అంత "ఇంటి అద్దె" రావడంతో సంసారాన్ని అలీ

కష్టం మీద నడుపుతున్నాడతను. ఈ పెరుగుతున్న ధరల్లో, లతను ఎలా సంసారం సాగిస్తున్నాడో?

తన స్వంత యింట్లో వుంటూ అయిదు వందల ఏభై రూపాయలతో పాలవాడ్ని, రేషను షాపు, కిరాణా, స్కూలుఫీజులు మొదలైన అన్ని రకాల ఖర్చులు చేయాలి. అయితే వెంకటావు, తనకన్న తక్కువ ఆదాయం వచ్చే వాళ్ళు ఎలా బతుకుతున్నారో అని ఆలోచిస్తుంటాడు

ప్రతినెలా ఏభై అరవై రూపాయలు చిల్లర వడ్డీలు కట్టేందుకు అప్పు చేస్తుంటాడు అయితే పాత బాకీలు తీర్చేందుకు కొత్తగా అప్పులు చేయడం వెంకట్రావుకు అలవాటయింది.

వెంకట్రావు చేసే మంచి పని— అందరి బాకీలు తీర్చి, నెలసామాన్లు తెచ్చి యింట్లో పడేసి తన బాధ్యత తీరిపోయిందను కొంటాడు అతని భార్య తెలివిగా, జాగ్రత్తగా సంసారం చేస్తుంది కనుక, వెంకట్రావుకు యిబ్బందేమీ వుండదు.

కాని ఆనెలలో వెంకట్రావుకు అర్జంటుగా మూడొందలు అవసరమొచ్చింది. మునిసిపాలిటీ 'టాక్సు' గుమస్తాకు 'లంచం' తాలూకు ఆఖరివాయిదాలో వందరూపాయలు యివ్వాలి; స్కూళ్ళు తెరిచారు కాబట్టి పిల్లలకు ఫీజులు, పుస్తకాలు, బూట్సు, నోట్సులు, యూనిఫాం కోసం, పంపులకోసం 'ప్లంబరు'కు కొంచెం 'ముడుపు' యివ్వాలి రాబోయే నెలలో భార్య పుట్టినరోజుకు చీరకొనాలి. మూడొందలతో యివన్నీ గట్టెక్కకపోయినా, ఆ మాత్రం వుంటే ధైర్యంగా వుంటుందని వెంకట్రావు అభిప్రాయం.

“అయితే మళ్ళీ ప్రావిడెంటు ఫండు నుంచో బాంకు నుంచో అప్పు అడగండి” అతని భార్య వుచిత సలహా యిచ్చింది.

“ఆ మాత్రం నాకు తెలీదా?... ఇంతవరకు తీసుకున్న అప్పుతీరకుండా మళ్ళీ మనకు అవసరమని అప్పు యిస్తారనుకున్నావా?... నాలుగు నెలలయితేగాని ఒక్క రూపాయి కూడా యివ్వరు” అన్నాడు వెంకట్రావు.

“పోనీ మీ నాన్నగార్ని అడగండి. ఏంత సేపూ ఆ చిన్న కొడుక్కు వేలుపెట్టి యిల్లు కట్టిస్తున్నారుగాని, మీకేమీ యివ్వక్కర్లేదా” మామగారి మీద కోపాన్ని ఆ విధంగా ప్రదర్శించింది వెంకట్రావు భార్య.

“సర్లే. ఇప్పటికే మన దగ్గరేదో వుందని, యింట్లో పనులు చేయిస్తున్నామని అను కొంటున్నారు. ఇప్పుడెళ్ళి డబ్బడిగితే నమ్ముతారా? పైగా యిదివరకు తెచ్చిన రెండొందలు గుర్తు చేస్తే...” అన్నాడు వెంకట్రావు.

వెంకట్రావు భార్యకి సినిమా చూపించి ఆర్నెల్లు అయింది తనకు నాలుగు జతల బట్టలున్నా ఎలా గో బండి నడుపుతున్నాడు ఏం చేస్తాడు పాపం?

ఆఫీసుకు టైము అవగానే, ఆ సంభాషణ అంతటితో ముగిసింది.

వెంకట్రావుకు ఎవర్నైనా డబ్బు అడగాలంటే బాధగా వుంటుంది. ఇవ్వలేక కాదు అనుకొన్న టైముకు యివ్వలేకపోతానేమో అని. ఆ టైముకు యివ్వకపోతే, మళ్ళీ ఏ ముఖం పెట్టుకొని తిరువాత అడగాలం? అందుకని మరొకరి దగ్గర అప్పుచేసి, పాత బాకీ తీరుస్తాడు

సైకిలు తీయబోతుంటే తనలాగే భారంగా కదిలింది గాలిలేక సైకిలు టైర్లు భూదేవిని శరణు వేడినట్టున్నాయి. అప్పుడు గాని వెంకట్రావుకు గుర్తురాలేదు— టైర్లు, ట్యూబులకోసం మరో ఏభై రూపాయలు ఖర్చు కలపలేదని.

“ఎందుకండీ ఆ సైకిలుతో అవస్థ? హాయిగా అమ్మేసి స్కూటరు కొనకూడదా?” అంది అతని భార్య.

ఆఫీసులో స్కూటరు అడ్వాన్సు ఇక్కడే మిగిలిందని అతని భార్యకు తెలుసు ఏదో అందరిలాగే వెనకాల కూర్చుని హాయిగా వెళ్ళచ్చు అనుకొంటుందిగాని, పెట్రోలు ధర రోజు రోజుకు పెరుగుతుందని, ఏదో రిపేర కోసం ఎక్కువగా ఖర్చు పెట్టాలని మాత్రం యింకా ఆమెకు తెలియదు కాబోలు!

తన సైకిలుకు అయ్యే ఖర్చును బడ్జెటో ప్రావిజను లేక రెండు నెల్లుంచి పంచరు వేయించి కాలక్షేపం చేస్తున్నాడు ఆఫీసుకు వెళ్ళాలంటే సైకిలు ముఖ్యం. లేదా బస్సు. అంటే బస్సు కోసం మరో పాతికరూపాయలు ఖర్చన్నమాట.... ...

ఇంట్లో కేవలం పదిరూపాయలున్నాయి ఇంకా యిరవై రోజులు గడవాలి పది రూపాయల నోటు మారిస్తే ఖర్చు అయిపోతుందని అర్ధరూపాయి విడిగావుంటే జేబులో వేసుకొని ఆఫీసుకు బయలుదేరాడు వెంకట్రావు.

అతను రోడ్డుమీద భారంగా నడుస్తున్నాడు. ఛీ... ఛీ... వెదవ బతుకు... ఇంతకన్నా చావటం మేలు... ఎందుకొచ్చిన ఇల్లు. ఎవరి కోసం.. అప్పుచేసి యిల్లు కట్టకపోతే. చాలీచాలని జీతంతో సంసారం గడవక యిన్ని యిబ్బందులా... ఎన్నాళ్ళిలా... ఏవో ఆలోచనలతో విసురుగా నడుస్తున్నాడు వెంకట్రావు

ఆఫీసు చేరే సరికి పదిన్నర అయింది. అటెండెన్సు రిజిస్టరు ఆఫీసరు రూములోకి వెళ్ళిపోయింది ఆలస్యంగా వచ్చినందుకు ఆఫీసరు నేత తిట్లు తప్పదు— అనుకొంటూనే ఆఫీసరు రూములోకి వెళ్ళి అటెండెన్సు రిజిస్టర్లో సంతకం చేసి బయటపడ్డాడు వెంకట్రావు

ఆఫీసరు ఏ 'మూడ్లో' వున్నాడో, వెంకట్రావుకు అక్షింతలు పడలేదు. ఈ రోజుకు బతికి పోయాననుకొన్నాడు

కుర్చీలో చతికిల బడ్డాడు. చేసేందుకు బోలెడు పనుంది కాని నేగుబుద్ధి కావటం లేదు నేరవేరవలసిన ఖర్చులు చాలావున్నాయి. కానీ డబ్బులేదు ఎలాగ? ఎవర్ని అడగాలి? ఎలా తీర్చాలి?... ఆలోచిస్తు కూర్చున్నాడు వెంకట్రావు.

మామూలుగా తను అప్పు తీసుకొనే వాళ్ళని గురించి తలుచుకొన్నాడు “అయినా యివాళ యింకా పదోతారీకు అప్పుడే అప్పా? ఏమనుకొంటారో?”, అన్న ఆలోచన కలిగిందని అడగలేకపోయాడు. అవసరం అటువంటిది ఏం చేస్తాడు?

“పోనీ రాజ్యలక్ష్మిని అడిగితే!.. ఎటూ ఆమెకు అంతగా ఖర్చు వుండదు... ఛ... ఛ... ఆమెనా ఎలా అడగాలి? పోనీ ప్రయత్నం చేస్తే సరి ,

రాజ్యలక్ష్మి వేరే సెక్షనో వుంటుంది. ఆర్నెల్లు క్రితమే తనకి పరిచయం. ఏదో భర్తతో పాటు, అప్పుడప్పుడు అతనికూడా ఏ శుక్రవారం నాడో, వెంకట్రావును చూసి నప్పుడో కోరిక కలిగినప్పుడే, గుడికి తీసుకొంది నాలుగైదు సార్లు. బహుశా ఆఫీసుకు దగ్గరలోనే యిల్లు వుండటంతో ఏ లంచ్ టైములోనో వెంకట్రావును యింటికి ఆహ్వానించి, అతనికి భోజనం అందించి, తను తృప్తి పడేది. అంత మాత్రం చేత ఆమెను డబ్బు అడగ

డమా ? రాజ్యలక్ష్మి అప్పుడప్పుడు అందించే యీ సుఖానికి తానేం చేయగలిగేడు ? ఆమె ముచ్చటపడి కొనుక్కొన్న చీరలో కొంత కరువు భత్యం బకాయిల్లోంచి యిచ్చాండతే ! ఆ చీరలోనే తను సుఖం అందించింది వెంకట్రావుకు డబ్బు అడగాలని లేదు

ఒంటిగంట అయేసరికి వెంకట్రావు ఓ రౌండు కొట్టొచ్చాడు సుధాకర్, గౌతమ్, రామారావు – ఎవరూ యివ్వలేదు వాళ్ళకే కష్టంగా వుందని, యీసారికి యేమీ అనుకోవద్దనీ చెప్పారు పోతే మల్లయ్య, విశ్వనాధం మిగిలారు వాళ్ళు మాత్రం తనని ఆదుకుంటారా?

"అలా వున్నారేం ?" రాజ్యలక్ష్మి అడిగింది

ఆ ప్రశ్నకు వెంకట్రావు వులిక్కిపడ్డాడు మనసుకు వూరట కలిగింది వెంటనే యీ లోకంలోకి వచ్చాడతను

"అబ్బే ఏంలేదు మామూలుగానే వున్నానే !" తడబడుతూ సమాధానం యిచ్చాడు వెంకట్రావు

"లేదులెండి మీరు దేనికోసమో 'వర్రీ' అవుతున్నారు"

ఏం సమాధానం చెప్పాలో తెలియలేదు కాని మనస్సు మాత్రం "ఫరవాలేదు అడుగు" అని ముందుకు తోస్తోంది "అవకాశం విని యోగించుకో" అని మరో చోట్నుంచి వినబడుతోంది కడుపులో ఆకలి నడిచి వచ్చినందుకు కాళ్ళు లాగుతున్నాయి క్యాంటీను కెళ్ళేందుకు ఓపిక ఎల్లాగో తెచ్చుకొన్నా, కౌంటర్లో టోకెన్ను తీసుకోవాలంటే జేబులో అర్ధరూపాయి ఎలా సరిపోతుంది ?

తనకు కావలసిన మూడొందలు మరోసారి గుర్తొచ్చాయి రాజ్యలక్ష్మి దగ్గరకెళ్ళాడు వెంకట్రావు

"మీరు టిఫిన్ కెళ్ళరా ? నేను టిఫిను తేలేదు పోనీ మా యింటి కెడదాంరండి" అంది రాజ్యలక్ష్మి

కాసేపు ఆమాటలకు తన్ను తాను మరిచిపోయాడు వెంకట్రావు లంచ్ టైములో రాజ్యలక్ష్మితో ఆ గంటసేపూ ఖర్చులు, కష్టాలు మరిచిపోవచ్చు ఆమెతో వెడితే యిద్దరికీ ఆకలి తీరుతుంది ఆహ్వానాన్ని మన్నించాడు వెంకట్రావు

వెంకటావు రాజ్యలక్ష్మిని అనుసరించాడు. ఇద్దరూ రెండున్నరకి తిరిగొచ్చారు.

# డబ్బుకోసం

"ఏం వెంకట్రావ్ అల్లావున్నావే ?" అని ప్రశ్నించాడు, అతనితో పనిచేసే మధుసూదన్

మధుకు ఏ లోటూ లేదు భార్య కూడా వుద్యోగం చేస్తోంది పైగా తండ్రి అప్పుడప్పుడు డబ్బు పంపిస్తుంటాడు అయినా మధు ఎప్పుడూ అప్పుచేస్తూనే వుంటాడు ఏం చేస్తున్నాడో అర్థం కాదు మరి !

"ఏముంది ? నీకున్న అవసరమే నాకూ వచ్చింది అర్జంటుగా మూడొందలు కావాలి ఏమైనా సర్దగలవా ? సుధాకర్, గౌతమ్, రామారావుల్ని అడిగొచ్చేను లాభం లేకపోయింది పోతే మల్లయ్య, విశ్వనాధం మిగిలారు అడగాలా వద్దా అని ఆలోచిస్తున్నాను" అన్నాడు వెంకట్రావు

వాళ్ళ ద్వారానే వెంకట్రావు మధుకు అప్పుడప్పుడు అప్పు యిప్పిస్తాడు

## వక్రత్వం

వలుగాకుల మూకకు
కోకిలగానం ఒక అపశ్రుతి !
దివాంధాల కళ్ళకు
గాఢాంధకారమే ఒక దివ్యజ్యోతి !

– దిలావర

"చూడు వెంకటావ్ ఇటువంటి బాధలు మరిచిపోడానికే 'మందు' పుచ్చుకోవాలి ఈ రోజు సాయంత్రం మనం 'ఈగిల్ బారు' కెళ్ళాలి ఎందుకో తెలుసా ? ఆ రోజు, మా అబ్బాయి పుట్టినందుకు నీకు పార్టీ యివ్వలేదు ఈ రోజు నీకు యిస్తాను సరేనా ?" అన్నాడు మధు

వెంకట్రావుకు 'మందు' అలవాటులేదు మధు యిప్పిస్తానంటున్నాడు కాబట్టి, రుచి చూద్దామనుకొని 'సరే' అన్నాడు అతను

వెంకట్రావు మల్లయ్య, విశ్వనాథాల్ని కూడా డబ్బు అడిగొచ్చేడు లేదన్నారువాళ్ళు డబ్బు లేకపోతే బతకడం ఎంత కష్టమో తెలిసింది వెంకట్రావుకు కాని తన అవసరాలు ఎలా వాయిదా పడతాయి ?

సాయంత్రం మధుతో 'ఈగిల్ బారు' కెళ్ళాడు వెంకట్రావు ఆ సీసాల పేర్లు అతనికి తెలియవు కాబట్టి, మధు బేరర్‌తో ఏదో చెప్పాడు తీసుకురమ్మని

బేరర్ రెండు 'కింగ్ ఫిషర్' బీరు బాటిళ్ళు తెచ్చి రెండు గ్లాసుల్లో పోసి వెళ్ళాడు చిప్సు, మిక్చర్ ఆర్డరిచ్చాడు మధు బీరు ఎలా తాగాలో మధు సూచనలిచ్చాడు వెంకటావ్‌కు

వెంకటావు సగం గ్లాసు తాగేసరికి, మధు మరో బీరు బాటిలుకు ఆర్డరిచ్చాడు కబుర్లు చెప్తూ బీరు తాగుతున్నారు వాళ్ళు

"నాగరిక ప్రపంచంలో 'మందు వగైరా' అలవాటు లేకపోతే ఎందుకూ పనికిరాడు. ఏమంటావ్ ?" అన్నాడు మధు

" "

వెంకటావుకు బీరు నెమ్మదిగా గొంతుకి దిగుతుంటే, సెలైన్ బాటిల్లోంచి సెలైను గొట్టం ద్వారా శరీరంలోకి ఎక్కుతున్నట్టుగా అనిపించింది

అప్పుడే వెంకటావు ఎదురుగా ఫుల్ సూట్‌లో వున్న వ్యక్తి వచ్చి కూర్చొన్నాడు బేరరుకు ఏదో ఆర్డరిచ్చాడు బేరరు ఏవో బాటిల్సు, ఐసు, ఆనియనుపీస్‌లు, మటన్ బిరియానీ తెచ్చాడు అవన్నీ టేబుల్ సగం ఆక్రమించాయి వీటి పేర్లు మధు ద్వారా వెంకట్రావు తెల్సుకొన్నాడు

గ్లాసులో బీరు అయేసరికి, వెంకట్రావుకు మూడొందలసంగతి గుర్తొచ్చింది బాటిల్లో మిగిలిన బీరును మధు గ్లాసులో పోసాడు

అప్పటికి వాళ్ళొచ్చి గంటన్నర దాటింది ఎదురుగా కూర్చున్న వ్యక్తి అన్నీ ఖాళీ చేసేసేడు అతను పూర్తిగా 'డౌను' అయ్యాడు బిల్ పెట్టేసి బేరరు వెళ్ళాడు అతను టేబిల్ పై వాలిపోయాడు

ఆత్రుతగా అతని బిల్ చూసాడు వెంకటావు "ఇంతింత డబ్బు మందుకోసం ఎలా ఖర్చుపెడతారో ? ఆ డబ్బు తనలాంటి వాళ్ళకిస్తే పుణ్యం పురుషార్థం కలుగుతాయి కదా !" అనుకున్నాడు వెంకట్రావు

సూట్‌వాలా పర్సులోంచి రెండు వంద రూపాయల నోట్లు తీసి సాసర్లో పెట్టాడు బేరరు బిల్లు తీసికెళ్ళి, మిగిలిన డబ్బు తెచ్చి సాసర్లో పెట్టడం సూట్‌వాలా గమనించనే లేదు వెంకట్రావు అతన్ని మొదట్నుంచీ గమనిస్తూనే వున్నాడు

మరో పావుగంట తర్వాత సూట్‌వాలా సాసర్లో వున్న డబ్బు లెక్కపెట్టుకోకుండానే జేబులో పెట్టుకొని సోంపు నోట్లో వేసుకొని వెళ్ళిపోయేడు.

వెంకట్రావు బారులో అందరి ముఖాలకేసి చూస్తూ మధ్య మధ్య మూడొందల విషయం జ్ఞాపకానికి రావడంతో రెండో గ్లాసులో బీరు తాగేసరికి, మధు నాలుగు బాటిల్సు ఖాళీ చేయటం ఆశ్చర్యమనిపించ లేదు. మధు మరో బీరు, మటన్ బిరియానీకి ఆర్డరిచ్చాడు

ఒక బీరు బాటిల్ తాగేసరికే వెంకట్రావుకు కళ్ళు బరువుగానూ, చూపు మసకగ్గానూ తోచింది మధు అయిదో బాటిలుతో మటన్ బిరియానీ సునాయాసంగా లాగిస్తున్నాడు అయితే మధు ముఖంలో మత్తును వెంకట్రావు గమనించకపోలేదు

సూట్‌వాలా తనతో తెచ్చిన బ్రీఫ్ కేసు తీసికెళ్ళలేదని వెంకట్రావు చూశాడు తాగిన మైకంలో, మత్తులో వాడా ఎడిగ వెళ్ళిపోయాడు అరగంట అయినా బ్రీఫ్ కేసు కోసం రాలేదు బేరరు కూడా చూడలేదు

"ఆ బ్రీఫ్ కేసులో ఏముందో? దాన్ని ఎవరు తీసుకొంటారు? బారు యజమాని సూట్‌వాలాకు అందజేస్తాడా? పోనీ తనదే అనుకొని ఎందుకు తీసుకుపోరాదు? సూట్‌వాలా రీవిని బట్టి అందులో డబ్బు

## డబ్బు కోసం

వుండేవుంటుంది? పాపం ఎంత బాధ పడతాడో?" వెంకట్రావు ఒళ్ళు చూశాడు తొమ్మిది అవస్తోంది

మధు మత్తుగా వున్నాడు తను యిప్పుడా బ్రీఫ్ కేసు తీసుకుపోయినా మధు తెలుసుకోలేడు

బేరర్ బిల్ తెచ్చాడు మధు వంద రూపాయల నోటు సాసర్లో వుంచాడు మిగిలిన డబ్బు బేరర్ తెచ్చాడు మధు జేబులో పెట్టుకొని బయటకు నడిచాడు

వెంకట్రావు బ్రీఫ్ కేసుతో మధు వెనకాల నడిచాడు రోడ్డుమీదకు రాగానే ఎదురుగా వున్న ఆటోలో యింటికెళ్ళిపోయాడు మధు

"అమ్మయ్య! మధు బ్రీఫ్ కేసు గమనించ లేదు" అనుకొన్నాడు వెంకట్రావు

"తను ఎలా వెళ్ళాలి? బస్సులో వెళ్ళేందుకు అర్ధరూపాయి సరిపోతుంది మరి రేపు సంగతేమిటి? పోనీ నడిచి వెడితే ఈ బ్రీఫ్ కేసుతో చీకట్లో నడుస్తుంటే ఎవరైనా తన్ని అది కాస్తా లాక్కుపోతే?"

సూట్‌వాలా రీవిని బట్టి బారులో ఖర్చు చేసినదాన్ని బట్టి అతను బాగా డబ్బున్నవాడయుంటాడు బ్రీఫ్ కేసులో తప్పకుండా డబ్బువుండే వుంటుంది తాగిన మైకంలో బ్రీఫ్ కేసు తీసికెళ్ళడం మరచిపోయాడు, పాపం!

ఇల్లు చేరగానే వెంకట్రావు బ్రీఫ్ కేసు తెరిచాడు అతని కళ్ళు చెదిరాయి కళ్ళు చీకట్లు కమ్మాయి కాళ్ళు చేతులు వణికాయి లోపల ఏవో కాగితాలు, నూరు రూపాయల కట్ట ఒకటి ఆ కట్టలో ఎన్ని వున్నాయో? వెంకట్రావు వెంటనే భార్యని పిలిచాడు

వెంకట్రావు జరిగిన విషయం చెప్పాడు భార్యకు

భర్త బారుకెళ్ళి తాగివచ్చినందుకు ఏమీ అనకపోవటానికి కారణం తనతో తెచ్చిన బ్రీఫ్ కేసులో డబ్బు అని గ్రహించాడు వెంకట్రావు

వెంకట్రావు నోట్లు లెక్కపెడితే అరవై రెండు వున్నాయి అంటే ఆరువేల రెండు వందలు బ్రీఫ్ కేసులో వున్న కాగితాలద్వారా సూట్‌వాలా పెద్ద వ్యాపారస్తుడని తెలిసింది

"పోనీ లెండి మన కష్టాలు, అప్పులు

ఆ డబ్బుతో తీరిపోతాయి దేవుడు మనల్ని రుణించడు అందుకే ఎప్పుడూ బారు ళ్ళని మిమ్మల్ని, ఆ మధు బారుకు తీస్కె ళ్ళాడు సూట్‌వాలా బ్రీఫ్‌కేసు మరిచిపోయాడు అది మీకంట పడటం, తెలివిగా మీరు దాన్ని తీసుకురావటం, యిందులో యింత డబ్బుండటం " వెంకట్రావు భార్య ఏకరువు పెడుతోంది

ఆ డబ్బు చూడగానే వెంకట్రావుభార్యలో ఏవో కోరికలు, ఆశలు వూపిరిపోసుకున్నాయి

"ఒకసారి మనం పదిరూపాయలు పోయినందుకే ఎంత బాధపడ్డాం! అటువంటిది యింత డబ్బు పోయినందుకు ఆయన యెంత బాధపడతాడో, ఆలోచించావా నువ్వు?" అన్నాడు వెంకట్రావు

"ఛీ ఏమ్మాటలండీ అవి! శుభమాని డబ్బుదొరికితే అవన్నీ ఎందుకు జ్ఞాపకం చేసుకొంటారు? మంచి మాటలు నోటికి రావా ఏమిటి?"

"మన డబ్బు పోతే మనం ఎంత బాధపడతామో ఇతరులు కూడా అలాగే బాధపడతారు కదా!"

"సర్లేండి అందరూ మీలాగే యింత నీతిగానూ, నిజాయితీగానూ వుంటే యీ దేశం యిలా ఎందుకు తగలడుతుంది?"

"ఈ బ్రీఫ్‌కేసు నేను సూట్‌వాలాకు తిరిగి యిచ్చేస్తాను మనకెందుకు? ఎంతమంది నోళ్ళుకొట్టి సంపాదించేడో అవన్నీ మనకనవసరం మనది కానిది మనకొద్దు" వెంకట్రావు తేల్చి చెప్పేసాడు తన వుద్దేశాన్ని

వెంకట్రావు భార్య ఏదో డబ్బు చూడగానే అలా అన్నది కాని, ఆమెక్కూడా యితరుల డబ్బుమీద ఆశలేదు మనకుండాలి కాని, ఎవరో పోగొట్టుకున్న డబ్బుమీద ఆశలు పెంచుకొంటే అది ఎప్పటికైనా మరో విధంగా పోతుందని అతని భార్యకు తెలుసు

ఆ రాత్రి వెంకట్రావుకు నిదపట్టలేదు. తనక్కావలసిన మూడొందల గురించి ఓ నిశ్చయ అభిప్రాయానికొచ్చాడు- అది భార్య గొలుసు బాంకులో పెట్టి డబ్బు తెచ్చుకోవటమే! అంతకన్నా మరోదారి అతనికి కనబడలేదు భారంగా తెల్లారింది

బ్రీఫ్‌కేసులో దొరికిన అడ్రస్ పకారం వెంకట్రావు సూట్‌వాలా యింటికి బయులుదేరాడు

వెంకట్రావు సూట్‌వాలా ఇల్లు తేలిగ్గానే తెలుసుకొన్నాడు బ్రీఫ్‌కేసుని అతనికి ఇచ్చేసాడు కాని బ్రీఫ్‌కేసు విషయం సూట్‌వాలాకు జ్ఞాపకమే లేదు ఆఫీసులోనే తను దానిని వదిలినట్లుగా భావిస్తున్నాడతను

బ్రీఫ్‌కేసు తెరచి చూసాడు, వెంకట్రావు కోరినట్లుగానే!

అందులో తను పెట్టిన కాగితాలు డబ్బు మిగిలినవి అన్నీ యధాస్థానంలోనే వున్నాయి అతని నిజాయితీకి మెచ్చుకొని, అయిదు వంద రూపాయి నోట్లు వెంకట్రావు చేతిలో పెట్టబోయాడు సూట్‌వాలా

"ఆ బహుమతి తను తీసుకోవాలా వద్దా? తీసుకొంటే అవసరం తీర్చుకోవచ్చు లేకపోతే డబ్బుకోసం మరోసారి పయత్నించవలసి వుంటుంది ఏం చేయ్యాలి?" ఆలోచనలో పడ్డాడు వెంకట్రావు

"తన నిజాయితీకి సూట్‌వాలా అయిదు వందలకు వెలకట్టేడన్న మాట! అతని వస్తువు అతనికేఅందించటంలో నిజాయితీ ఏముంది? అందుకు ఓ రేటు వుంటుందా?"

"వద్దుసార్! మీ బ్రీఫ్‌కేసు మీకు ఇచ్చానన్న తృప్తి, సంతోషం నాకు చాలు! దయచేసి వెలకట్టకండి! వస్తాను" అంటూ వెంకట్రావు సూట్‌వాలాతో కరచాలనం చేసి బయటకు నడిచాడు.

మర్నాడు వెంకట్రావు ఆఫీసుకు బయులుదేరాడు

"భార్య గొలుసు బ్యాంకులో పెట్టి, డబ్బు తెచ్చుకోవడమా? లేక ప్రావిడెంటు ఫండు నుంచి అప్పుతీసుకోవటమా? ప్రత్యేక కారణాలు ప్రావిడెంటుఫండు దరఖాస్తులో వివరంగా తెలుపుతూ, అధికారితో మొర పెట్టుకొంటే, డబ్బు శాంక్షను చేసారు" మొదటి ఆలోచన కంటే, రెండవదే బాగా వుందనిపించింది తనకు తెలియకుండానే, కావలసిన దానికంటే మరో మూడువందలు అదనంగా కోరాడు!

బిల్లు సెక్షనుకెళ్ళి, అప్లికేషను యిచ్చి సాధ్యమైనంత త్వరలో పరిశీలించి, ఎకౌంట్సు సెక్షనుకు పంపమని క్లార్కుని అర్థించాడు

ఆ రోజు సాయంత్రం రోజూకంటే పెందలాడే ఇల్లు చేరాడు వెంకట్రావు రోజూలాగ భార్య గుమ్మంలో కనబడలేదు కాలింగు బెల్ కొట్టాడు, తలుపులు తెరుచుకొనే వున్నప్పటికీ! పిల్లలు రోడ్డుమీద ఆడుకొంటు న్నట్లు చూసాడతను

తను వచ్చి పదినిముషాలయింది . అంతవరకు శ్రీమతి నోరు విప్పనేలేదు కాఫీ ఇచ్చే ప్రయత్నం కూడా చేయటంలేదే? ఏమయింది?

అయిదారుసార్లయినా "ఏమయింది" అని అడిగివుంటాడు.



# డబ్బు కోసం

"ఏమండి! మన రోజులు బాగా లేదండి! ఈ రోజు ఎదురింటి లక్ష్మి గారితో కలసి "దొంగరాముడు" సినిమాకు మార్నింగు షోకు వెళ్ళానండి రమ్మనమని బలవంతం చేస్తే! హడావిడిలో పెరటో పెట్టిన బాయిలరు లోపల పెట్టడం మరిచి పోయాము సినిమా చూస్తుంటే మధ్యలో జ్ఞాపకం వచ్చిందండి, బాయిలరు విషయం తీరా సినిమా అయ్యేక ఇంటికొచ్చి చూస్తే బాయిలరు కనబడలేదండీ! వెధవలు ఎవరు తీసుకుపోయారో ?" ఆ పైన చెప్పలేక ఏడవసాగిందామె

'కరువులో అధికమాసమో ? లేకమూలిగే నక్కమీద తాటిపండు పడటమో ?'— అతనికి తెలియలేదు

* * *

మర్నాడు ఆఫీసులో పోయిన బాయిలరు గురించి స్నేహితులతో చెప్పాడు వెంకట్రావు. పోలీసు రిపోర్టు యివ్వటం వలన, పోలీసు స్టేషను చుట్టూ తిరగటం... కాలయాపనా తప్ప ఫలితం వుండదని; అదృష్టం బాగుండి దొరికితే విన్నేళ్ళకో... ఏ స్థితిలోనో అని... చెప్పారు అనుభవజ్ఞులు.

రిపోర్టు యిచ్చే ఆలోచన విరమించుకోక తప్పలేదతనికి!

ఓ స్నేహితుడు చెప్పాడు, "రామకృష్ణా పురంలో సెకండ్‌హాండ్ బజారులో, ఏ వస్తువైనా మిగిలిన ప్రాంతాల్లోకంటే చవకగా లభిస్తాయని... అక్కడ ప్రయత్నించమని.,

అదృష్టం బాగుండి తక్కువ ధరలో బాయిలరు లభిస్తే, కొనేందుకు డబ్బేది ?

ప్రావిడెంటు ఫండు డబ్బు వారంరోజులకు గాని రాదు... అంతవరకు వేచివుండటం తన కిష్టంలేదు... 'శుభస్య శీఘ్రం' అన్నారు. ఎవరి దగ్గరా, అప్పు మొన్నటి వరకూ పుట్ట లేదు... ఇప్పుడు బాయిలరు కొనేందుకు కూడా డబ్బుకావాలి! ఈ పరిస్థితుల్లో రాజ్యలక్ష్మి తప్ప మరెవరూ వెంకట్రావు దృష్టిలో కనబడలేదు.

చివరకు ఆమెనే అడిగేందుకు నిశ్చయించు కొన్నాడతను.

జరిగింది రాజ్యలక్ష్మికి చెప్తూ, "... మీరు ఏమి అనుకోకపోతే, అర్జంటుగా ఆరు వందలు సర్దాలి! వారం రోజుల్లో ప్రావిడెంటు ఫండు డబ్బురాగానే ఇచ్చేస్తాను" బలవంతం మీద అడగక తప్పలేదు

"ఇప్పుడే కావాలా లంచ్ తర్వాత ఇవ్వచ్చునా ?" అందామె

"ఇప్పుడే కావాలి వెళ్ళాగా రామకృష్ణా పురం వెళ్ళాలని!"

"అయితే ఇంటికి వెళ్ళిం పదండి" అంటూ రాజ్యలక్ష్మి ముందుగా ఇంటికి దారి తీసింది ఆ నవ్వులో అర్థం అవగతం తెలిసినా, దానిని కార్యరూపంలో పెట్టే స్థితిలో వెంకట్రావు లేడు

ఆమె వెనుకే నడిచాడు అతను

* * *

ఆ ఫ్యాక్టరీలో స్టెయిన్‌లెస్‌స్టీలు, ఇత్తడి, రాగి వస్తువులు, పాత్రల తయారీలో పాటు, పాత సామానులకు మెరుగు పెడుతుంటారు మరో వైపు పాత సామానులు కూడా అమ్ముతుంటారు.

తనకు కావలసింది పాతదే! కొత్తది కొనేందుకు డబ్బు వున్నా ఇంత దూరం రాన వసరం లేదని అతనికి తెలుసు!

పాతసామానులు స్టీలు... ఇత్తడి...రాగివి వేరువేరుగా చక్కగా వుంచారు. వెంకట్రావు దృష్టి రాగి బాయిలర్లు పెట్టబడిన వైపు మళ్ళింది. గిరాకిరాగానే యజమాని తన గది నుంచి బయటకు వచ్చాడు.

వెంకట్రావు ఒక బాయిలరు తీసి పరి శీలిస్తున్నాడు. అది అచ్చం తన బాయిలరుగా కనబడటంతో మరింత పరీక్షగా చూడ సాగాడు... బాయిలరు మూత లోపలిభాగాన. క్రిందిభాగానా వ్రాయబడ్డ పేరు కొట్టి వేయబడి వుంది...

గిరాకీ ఇష్టపడి కొనుక్కుంటే సరి! లేక పోతే దానికి మెరుగుపెట్టి, కొత్తసామానులు విభాగానికి తరలించి అమ్మేస్తారు.

మరింత పరీక్షగా చూసేసరికి, అది తన పేరే అని తెలుసుకున్నాడు తను... తన పక్క నిలబడ్డ వ్యక్తి వైపు తలెత్తి చూసాడు... యజమాని... బ్రీఫ్‌కేసు తీసుకొన్న సూట్‌వాలా! ప్రక్కనే నిలబడి వస్తువులు చూపిస్తున్న సేల్స్‌మన్.. తమ కాలనీలో రోడ్ల మీద కాగితాలు... ఇనుప ముక్కలు ఏరుకొనే వాడుగా గుర్తించే సరికి, వెంకట్రావు గుండె ఒక్కసారి 'పట్టాలు తప్పిన రైలు'లా ఆగినట్టు అని పించింది...

# పాపాయికి పుట్టుకతోనే మీరిచ్చిన కానుక-3 నెలలకు సరిపడే ఐరన్



## 3 నెలలు నిండాక, కేవలం పాలే అతడికి కావలసిన ఐరన్‌ను సమకూర్చలేవు

అతడికి ఇవ్వండి

# ఫారెక్స్

పుష్కలంగా ఐరన్ గలది

“తల్లి నుండి పెద్ద ఐరన్ నిల్వతో సహా పుడతాడు పాపాయి. అయితే పుట్టిన తర్వాత ఈ నిల్వ క్రమేపీ తరిగిపోతుంది. పాలు మంచి ఆహారమే అయినప్పటికీ, ఐరన్ లేనందువల్ల అది సంపూర్ణ ఆహారం కాదు. అందుకే పాపాయికి ఐరన్ గల ఆహారాలు కావాలి”

డాక్టర్ సుభాష్ సి. ఆర్య: “ఇన్‌ఫెంట్ అండ్ చైల్డ్ కేర్ ఫర్ ది ఇండియన్ మదర్”

అందుచేత, పాపాయికి 3 నెలలు నిండగానే ఐరన్‌ను ఇచ్చే ఘన ఆహారం ప్రారంభించండి. ఐరన్ అతడి రక్తానికి, అతడి వ్యాధి నిరోధక శక్తికి, అతడి శరీర ఆరోగ్యానికి, అతడి పెరుగుదలకూ, వికాసానికీ అతి ముఖ్యం.

**డాక్టర్లు ఫారెక్స్ ఎందుకు సిఫార్సు చేస్తారు?**

మన ఆహారాలు ప్రారంభించడం కోసం, ప్రత్యేకంగా తయారుచేయబడిన ఆహారం ఫారెక్స్ మీ పాపాయి సున్నితమైన జీర్ణ శక్తికి అనువుగా వుండేటట్లు ముందే పచనం చేయబడింది. ఫారెక్స్‌లో ఉన్నాయి— సత్వర పెరుగుదలకు ప్రొటీన్లు, శక్తికోసం కార్బొహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు; దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం కాల్షియం, ఫాస్ఫరస్, విటమిన్లు. పాపాయికి ఫారెక్స్ ఇస్తే, ఘన ఆహార రూపంలో అతడికి హెచ్చు కాలరీలు లభిస్తాయి. అందుచేత పాలు తాగడం తగ్గుతుంది, నమలడం నేర్చుకుంటాడు కూడా. అన్నిటికంటే ముఖ్యంగా, పాపాయి శరీర ఆరోగ్యం, పెరుగుదలకోసం అత్యవసరమైన ఐరన్ పుష్కలంగా కలిగివుంది ఫారెక్స్






## డాక్టర్లు సిఫార్సు చేస్తారు ఫారెక్స్

## సత్వరమైన, సంపూర్ణమైన పెరుగుదల కోసం పాపాయికి ఆవశ్యవంతమైన ఘన ఆహారం

CASGLF-30-244 Tel

## ఎస్ ఎస్ ఆర్ — విశాఖపట్నం

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె నన్ను ప్రేమించింది రోజూ స్కూలుకు వెళ్లే టప్పుడు కలుసుకుంటున్నాము

ఇకనేం, స్కూలెగగొట్టడం, పొలం గట్లంట పరుగెత్తి పాటలు పాడటం, వర్షం రావడం— పాకలో తలదాచుకోవడం కథ మామూలే!

## టి ఎస్ — కంకిపాడు

నాకు సూటిగా చక్కగా చెప్పే మీ ప్రశ్నావళి ఎంతో యిష్టం నా సమస్య మీ ముందుంచాలని నేను లేనప్పుడు నా గురించి ఇరుగుపొరుగులతో అసభ్యంగా మాట్లాడుతారు బయట తలెత్తు కోవాలంటే సిగ్గుగా ఉంది ఆ తల్లిదండ్రుల స్వభావం తెలిసీ వాళ్లనే వెనకేసుకు వచ్చి నన్ను తూల నాడుతారు

తప్పేదు కన్నవారు కదా! కాని మీరెందుకు సిగ్గుతో తలవంచుకోడం? మీరలా బాధపడుతున్న కొద్దీ వారికి మహదానందంగా ఉంటుంది మీరు ధైర్యంగా ఎదుర్కోవడమే మీరు పడి ఉండే రకం అని అలిస్తే పాతాళానికి తొక్కుతారు తిరగ బడే రకం అని గ్రహిస్తే మర్యాద యిచ్చి పుచ్చు కోవడం ప్రారంభిస్తారు అదే మానవ సహజం, బలహీనత కూడా

## కె ఎస్ ఆర్ — గునుపల్లి

నేను ఒక అమ్మాయిని ప్రేమించాను ఆమె నన్ను ప్రేమించింది కాని ఆమె అన్నయ్య ఈ విషయం తెలియడంవల్ల ఆమె చాలా భయపడి పోతూంది కలుసుకోవడం లేదు ఆమెకు ధైర్యం చెప్తామన్నా అన్నగారి కంట పడతానేమోనని భయంగా ఉంది మీ సలహా?

అన్నగారికి మీ పూర్వీకులు అటు తిరిగి దండం పెట్టండి దొంగతనంగా ప్రేమ వ్యవహారాలు సాగించే వాళ్లంటే నాకు అసహ్యం




## ఎమ్ ఎన్ ఎస్ — సికిందరాబాదు

త్వరలో ఖ్యాతి గడించే రచయిత కావాలంటే చిట్కాలేమైనా చెప్పండి

చిట్కాలు నేర్చుకునేకంటే—అసలు వృత్తి నేర్చుకోవడం సులభం స్వామీ రాస్తూంటే అదే కావచ్చు రచయిత మంచి రోజు చూసి ప్రారంభించండి

## సిహెచ్ బిహెచ్ — గర్నకుర్తి

మా ప్రశ్నలకు మీ సమాధానాలు ఎంత బాగున్నాయంటే నేను బయటపెట్టలేని భావాలు చక్కగా అక్కడ పొందుపరుస్తున్నారా అన్నట్టుంటాయి మీరు ఎంతవరకు చదువుకొన్నారు?

చాలా థాంక్స్ భీమయ్యగారు నేను ఎంత చదువుకున్నానంటే— ఇంత అభిమానం చూపించారు? శ్రీశ్రీ పాటలోలాగా ఇప్పుడిప్పుడే చదువుతున్నా తెరచి జీవిత పుస్తకం

కొందరు హోదా ఆస్తి అంతస్తుకి ప్రాధాన్యం ఇచ్చి అమ్మాయి ఎలావున్నా పట్టించుకోరెందుకు?

పెళ్లయ్యాక పెళ్ళాం ఎలాగ పడి ఉంటుంది పాశ్చర్స్ గ్రీన్ వేటాడవచ్చునని ధైర్యం

## వి వి ఆర్ — విజయవాడ

నాకు ప్రేమ మీద నమ్మకంలేదు నాకు మనసు ఉందంటారా? నా వయసు 18 సం లు

నీకు వయస్సే లేదు!!




## జి వి ఎం ఆర్ — ఒంగోలు

ఒక వ్యక్తి ఇద్దర్ని సమానంగా ప్రేమిస్తున్నాడు వాళ్లూ అతన్ని ప్రేమిస్తున్నారు ఇప్పుడతను ఎవరితో జీవితం పంచుకోవాలి?

ఏం ఇద్దరినీ పోషించేంత సంపాదన లేదా? ఎటూ తేల్చుకోలేకపోతే— సోదిఅడిగి తేల్చుకుంటే సరి (లేకపోతే ఇదేంటి? పిచ్చి సమస్యలు వూహించుకొని— సతమతమయిపోవడం?)

## డి ఎస్ ఎస్ — దహిఖత్కార్

పెళ్లికాక ముందు ఎన్నో ప్రమాణాలు చేసిన మగవాడు పెళ్లి అయిన తర్వాత ఎందుకు మారిపోతాడు?

పెళ్లయ్యాక ఇంకెందుకు ప్రమాణాలు? డబ్బు బిగిశాక బలి పశువు ఎక్కడికి పోతుంది?

## పి యి ఎమ్ — కాశీబుగ

కొంతమంది యువకులు కట్నం లేకుండా కూడ దనుకుంటారు అయితే ఆడపిల్లల వాళ్లు ఏదో శారీరకంగా నో, ఇంకేదో కారణం వూహించుకోవడం అందుకే కట్నం తీసుకోడం లేదు అనుకుంటారు

అదంతా మీ వూహాగానం

## ఎస్ వి ఆర్ — బినవంక

మనదేశంలో అన్నీ పెరిగాయి గానీ మరి పెరగనిదేది?

ఆడదాని విలువ!

## జె ఎల్ ఎస్ — కొత్తగూడెం

వరకట్నం అది కట్నే ఎట్టుగా మన సంఘానికది గొడ్డలి పెట్టు పెట్టారంటారు కాని అందుకు ముందుకొచ్చేవారిని హేళన చేసే వారినేమనాలి?

ఏనుగు సాగుతుంటే కుక్కలు మొరుగుతాయి ఆగి తిరిగి మొరగాలా? ఆలోచించండి వరకట్నం సమాజానికి కాదు గొడ్డలి పెట్టు వ్యక్తిత్వం గల యువకుల భవి జీవితాలకి

## కె ఆర్ కె — పెనమంట

అక్కయ్యగారూ' మీరు ప్రశ్నావళి లప్ప ధలు సీరియల్సు రాయడం లేదేం? కారణం

రాయ బుద్ధి కావడం లేదు పాతివాళ్లు రాశాక కాస్త ఆలోచించడానికి వ్యవధి తీసుకుంటున్నా అంతే!

## ఉమ — కాశిబుగ్గ

మీరిచ్చే సమాధానాలు వూహించే ఇస్తారా? లేకపోతే ఏదయినా పుస్తకం చూసి ఇస్తారా?

మీ ప్రశ్నలే పుస్తకంలోంచి చూసి రాస్తున్నారు?

## వి పి ఆర్ — నూజివీడు

కులాల పేరిట కాలేజి సీట్లు, మతాల పేరిట ఉద్యోగాలు ఎందుకిస్తారు?

ఇది దరిద్ర గొట్టు దేశం కాబట్టి ఈ దేశపు జనాభాలోంచి అర్హులను ఎన్నిక చేయడానికి మామూలు ప్రమాణాలు సరిపోవు సరిపోతే అయినవాళ్లు పైకి రారు అందుకే వడ్డించేవాడు మనవాడు అయ్యేలా చూసుకుంటే చాలు— ఇంకే గొడవా ఉండదు

# ఘాటక్షుని డైరి

## పేరంటే పిచ్చి !

డెన్మార్క్‌లో ఎల్సా జట్టే అనే వో అందాల భరిణెకు 'నిల్స్' అనే పేరంటే పిచ్చి ప్రేమట చివరికి ఎంత అసహ్యంగా వున్న నిల్స్ అని పేరున్న వాడినే తాను పెళ్ళాడతానని కూడా వో శపథం పట్టుకూర్చుందట వుట్టి నిల్స్ అనే పేరు వాడు దొరకనందువల్ల వయస్సవుతూ వచ్చిందట చివరికో అర్భకుని పేరు నిల్స్ అని తెలుసుకుని ఎగిరి గంతేసి 'వో ప్రియా, రావా, ఆహా, అని అతనితో ప్రేమకలాపాలు సాగించి, స్థిమిత పడేసరి కతని పూర్తి పేరు కిండర్ నిల్స్ అని తేలి ముత్యంగా మూడోసారెగిరిగంతేసి, ఛా నీ పేరులో కిండరుందా పో నా ముఖం జూడకు, నీ ముఖం జూపకు అని అతగాణ్ణి తరిమేసి మళ్ళి నిల్స్‌కోసం వెతుకుళ్ళాటారంభించింది ఆ అర్భకుడు చచ్చిన వాడి పెళ్ళికి వచ్చిందే కట్నం అని సరిపుచ్చుకుని ఉండుంటాడు—

## ఆచూకీ తెలియని హత్య !

పా
అనే ప్ర
ఏళ్ల
పక్కి
వదిలా
పూల
వారి
మా
అనే
ఆ
కు
పో
పి
మీ
ప్ర
చ
వా
రని
రిపోర్
వెతికి
ఫోర
పిల్లాడి
విషయ

## కోడళ్ళ అగచాట్లు !

పవిత్ర భారద్దేశంలో ఆడపిల్లల గతి దిన దిన అర్ధాన్నంగా తయారవుతున్నదని, కట్నం తెలేదనో, తెచ్చింది చాల్లేదనో కోడలుగా వచ్చిన ఆడపిల్లను కాల్చుకు తినడమేగాక, తన్నులతో, వాతలతో హింసించడమే గాక, నిలువునా కిరసనాయిల్పోస కాల్చి చంపుతున్నారని, ఈ మానవరూప రాక్షసులను శిక్షించేనాథుడెవడూ అగుపించడంలేదనీ పార్లమెంటు మెంబర్లయిన ప్రమిలా దండావతే, సుశీలా గోపాలన్, విమలా ఫరూఖి, వినాదాలుచేస్తూ ఢిల్లీ రాజవీధులలో తోటి మహిళలతోచేరి పెద్ద వూరేగింపుగా తిరిగారట లోక్‌సభ స్పీకరుకు యీ విషయం మీదో వినతి పత్రం సమర్పించారట వీధుల్లో జనం ఇలాటి వాటికి విరగబడి చూసినా ఇంట్లో భాగోతం మామూలు మామూలే !

## భయం వల్ల గడబిడ !

తమిళనాడు ప్రభుత్వం ఏటికి కొన్ని కోట్లు ఖర్చుకు వెనుకాడకుండా స్కూలుకు వెళ్తున్న పదేళ్లలోపు పిల్లలకు మధ్యాహ్నం భోజన సదు 16 వ తేదీన వేలం పుదుకుడి అనే వూర్లోని హిందూ హైస్కూలులో పెట్టిన మధ్యాహ్న ఉచిత భోజనం చేసిన పిల్లలలో వో పిల్లాడు తన కంచంలోని ఆహారంలో వో చచ్చిన బల్లి వున్నదని చూపాడట దాంతో ఎందుకయినా మంచిదని ఆహారం తిన్నదెబ్బయి రెండుమంది పిల్లలనూ ఆసుపత్రిలో చేర్పించిందట ప్రభుత్వం అక్కడచింతపండూ, ఉప్పు కలిపిన నీళ్ళు పట్టారట ఎవరికి ఏమీహాని కలుగలేదని, ఇదంతా ఎక్కడో చచ్చిన బల్లి శవాన్ని చూడడంవల్ల కలిగిన భయమేననీ, యీ వంటలు వండిన వంటవాడు, పనివారు కూడా తిన్నారనీ, వాళ్లను ఆసుపత్రికూడా పంపలేదనీ, వాళ్ళు పిడుగురాళ్ళలా ఉన్నారనీ, యీ భోజన పథకం మళ్ళీ నిరాటకంగా సాగుతోందనీ జిల్లా కలెక్టరన్నారట

## బ్రతుకు జీవుడా !

వియన్నా వెల్ హెల్మినా ఆసుపత్రిలో తన కాలు చికిత్సకోసం వెళ్లిన 52 ఏళ్ల జవనోవిచ్ అనే యుగొస్లేవియా వ్యక్తిని పట్టుకుని, మత్తుమందిచ్చి పొరపాటున మరో పేషెంటనుకుని, అతనికి చేయాల్సిన హార్ట్ ఆపరేషను సక్సెస్‌ఫుల్‌గా చేసేశారట డాక్టరు ఆనక నర్సొకామె వాటీజ్యావర్నేమ్ అనడిగి హడలిపోయిందట అసలు హార్టు పేషెంటాతడుకాడనీ, ఆ ఆపరేషను చేసినందు వల్ల యీతడు, చేయనందువల్ల ఆతడూ కుయ్యో మొర్రోమంటున్నారనీ గ్రహించిన డాక్టరు తన నాలిక తీరిగ్గా కరుచుకోవచ్చానక అనాపనలా పెటి మళ్ళీ యీ జవనో [illegible]






బులుసు వేంకటరమణయ్య

# సరియైన మిత్రుడు

సరియైన మిత్రుడెవ్వరో సమయం వచ్చినప్పుడుగాని తెలియదు ప్రాణాలమీదకి వచ్చిన పరిస్థితి వచ్చినప్పుడు సహాయం కోరగా "ఈ చిక్కులో ప్రవేశిస్తే నాకూ ఆపద కలిగేటట్లున్నది, ఆత్మరక్షణ ముఖ్యంకదా! నేను సాయపడలే"నని తప్పుకునే వారు మిత్రులుకారు "నేను ముందునిలిచి సాయం చెయ్యలేను ఎవరయినా ముందుకు వచ్చి నీకు సాయపడితే వారి వెనక నేను ఉంటాను" అని చెప్పే వారు కూడా యదార్థమైన మిత్రులు కారు వారిలో నటనమాత్రమే కానవస్తుంది "మరేం భయంలేదు నీకు తప్పక సహాయం చేస్తాను దానివల్ల ఎలాటి కష్టం వచ్చినా, నీతోపాటు నేనూ అనుభవిస్తాను నీ సుఖమే నా సుఖం నీ కష్టమే నా కష్టం" అని ధైర్యం చెప్పి సహాయం చేసిన వాడే నిజమైన మిత్రుడు అట్టి మిత్రుణ్ణే విశ్వసించాలి ఇది లౌకిక విషయం

పారలౌకిక దృష్టితో చూస్తే అక్కడ కూడా యధార్థమైన మిత్రుడు ఒక్కడే దొరుకుతాడు మనుష్యుని జీవిత కాలంతా అతనిని అంటిపెట్టుకొని ఎందరో బంధువులు మిత్రులు ఉంటారు సిరిసంపదలు, వస్తు వాహనాలు- అతనికి ఎంతో సంతృప్తిని, ఆనందాన్ని కలిగించేవి ఉంటాయి అయినా— అతడు మరణించినప్పుడు అవేవీ అతనితోపాటు రావు అతని యెడ ఎంతో అభిమానం, ప్రేమ ఉన్న బంధు,మిత్రులు అతని కళేబరం వెంట శ్మశానం వరకూ మాత్రం వస్తారు అక్కడ నుండి వెనుదిరిగి పోతారు కాని లోకాంతరానికి రారు శరీరం నశించినా ఆత్మను విడవకుండా వచ్చేది అతడు చేసుకొన్న సుకృతం మాత్రమే! అదే అతనికి పర లోకంలో సుఖాన్ని కలిగిస్తుంది ఈ మిత్రుని వలెనే ఒక శత్రువు కూడా వెంటపడవచ్చు చేసుకొన్న పాపమే ఆ శత్రువు అది ఎన్నో కష్టాలు కలిగిస్తుంది మనం యీ జన్మలో పాపాన్ని దరి చేరనియ్యకుండా వుంటే పర లోకంలో దాని బాధ తప్పుతుంది పరలోక బాధలను తప్పించుకోవాలంటే పాపాలకు దూరంగా ఉండడమే మార్గం సుఖాలను అనుభవించాలంటే పుణ్యం సంపాదించాలి మానవుని యెడల సరియైన మైత్రిని చూపేది సుకృతం మాత్రమే! ★

## (గత సంచిక తరువాయి)

మాస్టారు క్లాసు నుండి బయటికి పోగానే విద్యార్థులంతా ఒక దగ్గిర గుంపుగా చేరి— గొడవ గొడవగా అరుస్తూ అందరూ మాట్లాడుతుంటారు ఎవ్వరి మాట ఎవ్వరు వింటున్నారో తెలియదు రవిచంద్ర వెళ్ళిపోగానే— విశాలమైన ఆ ఆఫీసు గదిలో, అంతా అల్లరిగా వుంది ఆఫీసంతా సాహిత్య బల్లచుట్టూ మూగివున్నారు తలొక సలహా యిస్తున్నారు

సిగరెట్ తర్వాత సిగరెట్ తాగుతూ మధ్య మధ్య పొడి దగ్గు దగ్గుతున్న రాజారాం గారితో

"ఎలా పని ప్రారంభించాలో పెద్దలు, అనుభవజ్ఞులు మీరు చెప్పండి" అంది

"అలా అడిగావ్ బాగుంది ముందు ప్రముఖ రచయితల జాబితా తయారు చెయ్యండి చాలామటుకు ప్రముఖ—ప్రఖ్యాత—వర్ధమాన రచయిత్రులు చాలా వరకు మన భాగ్యనగరంలోనే వున్నారు వాళ్ళతో టైం ఫిక్స్ చేసుకుని వెళ్ళి ఇంటర్వ్యూ వగైరాలు చేసుకురండి ఇక్కడే సంవత్సరానికి కావలసిన మేటర్ దొరుకుతుంది తర్వాత తీరిగ్గా వూర్లమీద పడవచ్చు లేదా — మీకు కావలసిన ప్రశ్నలులో ఇక్కడనుంచి ఇంటర్వ్యూ చేయవచ్చు — మీకు కావలసిన ప్రశ్నలు వ్రాసి, వారి బయోడేటా— కలర్ ఫొటో పంపమనండి — లేదా " అని ఇంకో సలహా ఇవ్వబోతుంటే,

'రవిచంద్రగారి తిక్క కుదర్చాలన్నా, డబ్బు ఖర్చు చేయాలన్నా — వాళ్ళ దగ్గరకే వెతుక్కుంటూ పోవాలి ' అన్న ఆలోచన వచ్చిన సాహిత్య,

"బాస్ ఎక్కడ వుంటే లక్కడికి వెళ్ళమన్నారు ఈ అవకాశాన్ని వుపయోగించుకుని వూర్లన్ని తిరిగి వస్తాం ఓకే కమలా ! కమాన్" అంటూ కమలను పిలుచుకుని వెళ్ళిపోతుంటే అందరూ ఒకరి ముఖాలు వొకరు చూసుకున్నారు గోపి ఏదో జ్ఞాపకం వచ్చినట్లు వారి వెనక పరుగులాంటి నడకతో వెళ్ళి కలుసుకున్నాడు

"పెద్దవాడ్ని, అనుభవం వున్నవాడ్ని, పైగా మగవాడ్ని — మీతో తీసుకువెళ్ళటం ధర్మం" అంటూ వారి ప్రక్కన నడిచాడు గోపి

"హైదరాబాదులో ఎవరెక్కడున్నారో నాకు తెలుసు మన వెంట ఫొటోగ్రాఫర్‌ని తీసుకువెళ్ళితే బాగుంటుంది "

"ముందు కడుపులో ఏదైనా చల్లగా పడితే ఇంగా బాగుంటుంది" అని కమల అంది

"అలా అన్నారు మరీ బాగుంది "

ముగ్గురూ కలిసి దగ్గర్లో వున్న సరోవర్‌లో దూరారు లంచ్ టైం రద్దీగా వుంది స్థలం కోసం చూస్తూ ముందుకు వెళ్ళాడు గోపి అక్కడ లీలావతి రాఘవయ్యగార్ని చూసి—

"నమస్కారం" అన్నాడు

జ్యోతి మద్రాసులో వున్నప్పుడు అక్కడ కొంత కాలం పనిచేసి హైదరాబాదుకు వచ్చాడు ఇక్కడ నైట్ కాలేజీలో బి ఎల్ చేద్దామని

"బాగున్నావా గోపి" అని ఆప్యాయంగ పలుకరించి, ప్రక్కన వున్న ఆమెను చూపిస్తూ—




"వీరెవ్వరో చెప్పుకో చూద్దాం! చిట్టారెడ్డిగారు" అంటూ గోపికి పరిచయం చేసింది

గోపికి ఎగిరి గంతులు వేద్దామనిపించింది నమస్కారాలు జరిగాక— వారి దగ్గర ఇంకా రెండు కుర్చీలు ఖాళీగా వున్నాయి

"ఇంకా ఎవ్వరైనా వస్తున్నారా" గోపి మాటలకు లీలావతిగారు నవ్వుతూ—

"ఒక జాతి పక్షులు ఒక దగ్గిర చేరుతాయి కదా—సీతాదేవి, కె వి కృష్ణకుమారిగార్లు వస్తారు వారికోసం వెయిట్ చేస్తున్నాం "

"చిట్టారెడ్డిగారు — మీరు ఎక్కడ వుంటున్నారు "

"కర్నూల్" చిరునవ్వుతో చెప్పింది

"ఇక్కడ వుంటారా కొన్ని రోజులు క్షమించాలి ఇంటర్వ్యూ యిస్తారా !"

"ఇక్కడా ! !"

మరెక్కడ యిస్తారో అడగాలనుకుంటుండగా,

"అక్కడ ఎవ్వరో మిమ్మల్ని మింగేసేలా చూస్తున్నారు " అంటూ లీలావతిగారు చెప్పారు

"వాళ్ళ పనిమీదనే వచ్చాను" అంటూ నవ్వేశాడు గోపి

"ఇక్కడ పని అయ్యాక ఐదు గంటల వరకు మరేమి పనిలేదు " అని లీలావతిగారు చెప్పారు

చిట్టారెడ్డిగారు వాళ్ళు ఎక్కడ వుంటున్నారో చెప్పి — ఆ గెస్ట్‌హౌస్‌కి వస్తే — కాసేపు కబుర్లు చెప్పుకోవచ్చు అని చెప్పింది

థాంక్స్ చెప్పి — వారి దగ్గర సెలవు తీసుకుని పోతూ,

"ఈ రోజు మీరు నా అతిథులు " గోపి మాటను మధ్యలోనే తుంచేస్తూ లీలావతిగారు,

"అదెలా కుదురుతుంది కావాలంటే మరో రోజు ఇవ్వండి డిన్నరు "

"థాంక్స్ ! వస్తాను, మీ వెనకాలే వస్తాం" అంటూ సంబరంగా సాహిత్యవాళ్ల దగ్గిరకువెళ్ళాడు

అటు వెళ్ళిన గోపి శాశ్వతంగ అక్కడే వుండిపోతాడనిపించి— వారే సీట్లు చూచుకుని కూర్చుని వారికి కావలసిన వాటిని ఆర్డర్ ఇచ్చుకున్నారు వచ్చి పక్క కుర్చీలో కూర్చున్న గోపితో వాళ్ళు మాట్లాడలేదు

తను చిట్టారెడ్డిగారితో ఇంటర్వ్యూ ఫిక్స్ చేసుకు వచ్చిన విధం చెప్పగానే— కోపం మరచి దగ్గరకు జరిగారు

"ఇక్కడే వున్న వాళ్ళతో ఈ రోజు కాకపోతే రేపు, లేదా ఎల్లుండి అవకాశం ఎదురొచ్చినట్లు వచ్చింది పై వూరు నుంచి వచ్చారు ముందు వారితో ప్రారంభిద్దాం " ఎదురుగ వున్న వాళ్ళవైపు అటు ఇటు చూశాడు

"ఓకే" అన్నారు ఇద్దరూ

సరోవర్‌లో సర్వర్ సర్వ్ చేసేలోపల ప్రశ్నల పత్రం తయారు చేశాడు

"అక్కడికి వెళ్ళి తడుముకోకుండా ముందే ఆలోచించుకోవటం బుద్ధిమంతుల లక్షణం చిట్టారెడ్డి నవలలు ఏవైనా చదివారా మీరేమి అడగాలని అనుకుంటున్నారు " అని వారు వెలిబుచ్చిన లభిప్రాయాల కనుగుణంగా ప్రశ్నలు తయారుచేసి, పాకెట్ నోట్‌బుక్ తిరిగి చొక్కా జేబులో పెట్టేసుకున్నాడు గోపి

* * *

గోపి అన్నట్టుగానే వాళ్ళ వెనుకనే నందనం అపార్ట్‌మెంట్స్‌లో వున్న ఓ యింటికి వెళ్ళారు

"రండి — రండి చెప్పినట్లుగా వచ్చారు" అంటూ ఆహ్వానించింది రచయిత్రి చిట్టారెడ్డి

గోపి సాహిత్యను, కమలను పరిచయం చేశాడు విశాలమైన డ్రాయింగ్ రూం — పెద్ద గదులు — సోఫాలు — వున్న ఆ ఇంటిని చూసి —

"మీ ఇల్లు చాలా బాగుందండి" అని కమల అంది, సంభాషణ ప్రారంభించాలన్న వుద్దేశంతో

చిట్టారెడ్డి నవ్వుతూ అంది —

"ఇది మా ఇల్లు కాదండి — రాయలసీమ పేపర్ మిల్స్ వారి గెస్ట్‌హౌస్ మా శ్రీవారు అక్కడ ఛీఫ్ ఫారెస్ట్ ఆఫీసర్‌గా వున్నారు "

"మీరు రచనలు చేయాలన్న అభిలాష ఎప్పుడు ఎలా మొదలైంది" కుతూహలంగ సాహిత్య ప్రశ్నించింది

"అప్పుడే ఇంటర్వ్యూ ప్రారంభించారన్నమాట" లీలావతిగారు నవ్వారు "మీ పని కానీయండి " అన్నట్లుగా తన బాగ్‌లోంచి నవల తీసుకుని చదువుకుంటూ వారి సంభాషణ వింటూన్నప్పుడు అప్పుడప్పుడు అటు చూస్తున్నారు

సాహిత్య అడిగినదానికి చిట్టారెడ్డి —

"ఒకరోజు 'ప్రభ' చదువుతుంటే ఎందుకో నాకూ కధ రాయాలనిపించింది చాటుగా ఎవ్వరూ చూడకుండా కధ వ్రాసి 'ప్రభ'కే పంపాను అదె మొదటి కధ 'తీరిన సమస్య' ఆ కధ ప్రచురణకు స్వీకరించినట్లు తెలిపిన ఉత్తరం చూసి శ్రీవారు లక్ష్మిపతిగారు చాలా సంబరపడ్డారు ఆ

**జరిగిన కథ — 2** రవిచంద్ర 'రచన' వార మాస పత్రికలో మేనేజింగ్ ఎడిటర్‌గా పనిచేస్తుంటాడు అతను ప్రముఖ రచయిత కూడా ఫారిన్‌లో ఎం బి ఎ చేసివచ్చినా అతనికున్న సాహిత్యాభిమానంతో ఈ పని చేస్తుంటాడు అతను సాహిత్య ఇచ్చిన కవరులోని సారాంశం చదివి ఆశ్చర్యపోతాడు తనకు పి ఎ గా చేరిన సాహిత్య టెంప్టేషన్ నుండి తప్పించుకోడానికి, రచయితల యింటర్వ్యూ చేయడానికి ఆమెను పంపాలనుకుంటాడు రవిచంద్ర



రోజు మావారి సంతోషం చూచి నిజంగా నాకు ఆశ్చర్యమేసింది అప్పటి నుండి కథలు వ్రాయడం ప్రారంభించాను పత్రికలవారినుండి నాకు ప్రోత్సాహం లభించింది అలా మొదలైన నా రచన సాగుతూనే వుంది నా రచనలు పాఠకుల ఆదరణ పొందడం నా అదృష్టం ''

''అయితే మీ శ్రీవారి సంతోషం కోసం రచనలు చేస్తున్నానంటారు'' సాహిత్య ప్రశ్నకు లీలావతిగారు నవ్వబోయి ఆ నవ్వు దాచుకున్నారు, కళ్ళు క్రిందకి వాల్చి

రచయిత్రి ఇబ్బందిగా చూచినా వెంటనే తేరుకుని—

''శ్రీవారి సంతోషం కోసమే నేను కథలు వ్రాస్తాను అని ఒకసారి నా పరిచయంలో చెప్పాను ఆ మాటలు చాలా విమర్శకు దారి తీసాయి. నాకు ఇన్స్పిరేషన్ మావారే మీరు నవ్వినా సరే— వున్న మాట అది ఏ రచన చేయటానికి ఆధారమైన వాటిల్లో ఇన్స్పిరేషన్ మొదటిది ''

''రచనలో మీ అనుభవాలు చెప్పండి'' గోపి ప్రశ్నించాడు

'అనుభవాలా? ఏం చెప్పాలి' అన్నట్లు చూశారు రచయిత్రి తర్వాత జ్ఞాపకం తెచ్చుకుంటున్నట్లుగా మెల్లిగా చెప్పసాగారు

''చిన్నప్పుడు చేతికి ఏ పుస్తకం దొరికినా చదివేదాన్ని పాఠాలు కంటే నవల్సు ఎక్కువగా చదివేదాన్ని అందుకే యిప్పుడు వ్రాయగల్గుతున్నా ననుకొంటాను నవలంటే ఎన్నో విషయాలు వుంటాయి ప్రేమ—సెక్స్ వుంటుంది నా పుస్తకాలు యిప్పుడుకూడ మా నాన్నదాక వెళ్ళనివ్వను పొరపాటున 'ఉదాత్తచరిత్ర'లనుకుంటాను చూశారు ఎంతో బాధగా 'ఎందుకురా మనకీ కథలు' అన్నారు పెళ్ళికి ముందు రచనలు చేసివుంటే నా రచన సాగేదేనా? అని అనుకుంటాను ఇప్పుడు ఏ పుస్తకం చదివినా — ఎలాటి కథ వ్రాసినా శ్రీవారు అడ్డు చెప్పరు ఈ సంగతి ఎందుకు చెప్పతున్నానంటే ఇదీ ఒక అనుభవమేగా

మావారు ఫారెస్ట్ ఆఫీసరు అడవుల్లో తిరుగుతుంటారు వారివెంట వెళ్ళినప్పుడు మా చిన్ని ఎర్రటి పూలు పట్టుకొచ్చింది అవెంతో ఆకర్షణీయంగా వున్నాయి అందంగా వున్న ఆ పూల వేరు విషపూరితమైనవని వాటిగురించి వివరంగ మావారు చిన్నికి వివరించి చెపుతుంటే విన్నాను

అడవిగుండా ఎప్పుడు వెళ్ళినా ఆ పూలు నన్ను అమితంగా ఆకర్షించేవి నన్నే చూస్తూ నవ్వుతూ పలకరిస్తున్నట్లుగా ఉండేది ఆ పూలు గ్లోరియోసా సుపర్బా గురించి 'పాము పగ' నవలలో వ్రాశాను సినిమాలో చూసినట్లు ఒక స్త్రీ పదిమంది రౌడీలతో డిష్యుం— డిష్యుం చేయగలదా! ఒక దెబ్బకూడా తగలకుండా బయట పడగలదా? నిజంగా ఒక అబల పగ తీర్చుకోవాలంటే ఏం చేస్తుంది? ఆ ప్రశ్న నన్ను వేధించేది ఆ ప్రశ్నకు సమాధానమే 'పాము—పగ' నవల

మాకు తెలిసిన అమ్మాయి ఒక గొప్పింటి అబ్బాయి ప్రేమించుకున్నారు ఆ అబ్బాయి ఈ అమ్మాయిని పెళ్ళి చేసుకుంటానని పట్టుపట్టాడు దాని ఫలితంగా అమ్మాయి శవం బావిలో తేలింది ఆ శవానికి కళ్ళు లేవు ఏ పని చేస్తున్నా ఆ అమ్మాయి పదే పదే గుర్తుకు వచ్చేది ఆ సంఘటనాధారంగ ''పాపమా? శాపమా?'' అన్న నవల వ్రాశాను చిత్రంగా ఆ నవల వ్రాసిన తర్వాత నా ఆలోచనలోకి ఆ అమ్మాయి రానేలేదు ''

''మీ రచనలు కల్పనలా! వాస్తవాలా!''

''ఇందాక చెప్పాను కదా! కొన్ని ప్రేరణతో, మరి కొన్ని వాస్తవ సంఘటనలతో, మరికొంత కల్పనతో నా నవలలు మలచబడతాయి కథలు చాలా వరకు వాస్తవ సంఘటనలు, సమస్యలు తీసుకుని వ్రాసినవే!''

''మీ రచనలు మీ శ్రీవారు చేస్తారని ఒక వదంతి?''

''ఎందుకో చాలమంది నేను వ్రాస్తున్నానంటే







నమ్మరు ముఖంమీదే అనేస్తారు వ్రాసేది మీరు కాదని" చిట్టారెడ్డి నవ్వింది

లీలావతిగారు నవ్వుతూ "మీరు పరిచయం కాకముందు మేము అలాగే అనుకున్నాం" అన్నారు

"నేను రచయిత్రి వుండవలసిన రీతిలో లేనా? ఆర్భాటంగ లేనేమో! 'పట్టుమని పది మాటలు మాట్లాడతావు అన్ని కథలు ఎలా రాస్తున్నావ్' అని మా అక్క అంటుంది

నేను ఎప్పుడయినా ఏ విషయం కోసమైనా పుస్తకాలు సేకరించి తీసుకువెళ్లుతుంటే 'మాకు తెలిసిపోయిందిలే అందులో యింత, ఇందులో యింత చూసి కథ రాసేస్తారులే' అంటూ అడిగినవాళ్ళు వున్నారు వారి అమాయకత్వానికి ఆశ్చర్య మేస్తుంది"

"పోనీ మీ రచనలకు లక్ష్మీపతిగారి ప్రోత్సాహమే కాకుండా సహాయం వుండదా?"

"నేను ఏమి వ్రాస్తున్నానో వారికి తెలియదు వారి పనిలో వారికి తీరిక వుంటేగా — అచ్చులో వచ్చిన తర్వాతనే వారు చదువుతారు కొత్త ప్రదేశాలకు తీసుకువెళ్తారు నేను బద్ధకించి పోలేక పోతే 'నీవు రావాలి — చూడాలి — తర్వాత నన్నడిగితే చెప్పను' అంటూ ఇష్టంగ తీసుకువెళ్తారు అంతవరకే వారి హెల్ప్"

"రచయిత్రుల రచనల గురించి చాలామందికి చిన్నచూపు మీరేమంటారు"

"చిన్నచూపు ఇదివరకు వుండేదేమో కాని యిప్పుడు ఆ మాట అంతగా వినపడటం లేదు కొంతమంది రచయిత్రుల రచనలు కఠినంగా విమర్శిస్తుంటారు ఆ ఆ వ్రాతల్లో ఏముందీ చెత్త — వాస్తవానికి దూరంగా వున్నాయి సినిమా కోసం వ్రాసినట్లుంది అంటారు

కాని నాకు వికారంగా చెత్తగా అనిపించదు ప్రతి మనిషిలో ఏదో ఒక ఆకర్షణ వున్నట్లు ప్రతి రచనలో ఏదో తపన, ఏదో వ్రాయాలని వుబలాటం కనుపిస్తుంది అవకాశాలు వుండి, బయట ప్రపంచాన్ని చూసి, చదివి వ్రాయగల సమయం తీరిక వుంటే రచయిత్రులు ఇంకా ఇంకా బాగా వ్రాయగలరు స్త్రీ ఏపని చేయలేదో చెప్పండి"

## రా గా గ్ని

'ఇక్కడ అందరూ స్త్రీలే ఏమన్నా అన్నా తన మాట నెగ్గదు' అని గోపికి తెలుసు

"మీ రచనలపై ఏవైనా విమర్శలను ఎదుర్కొన్నారా?" అని అడిగాడు

"నా రచనలు ఇంతవరకు ఎవ్వరూ ప్రత్యక్షంగ పరోక్షంగ విమర్శించగ వినలేదు కాని ఒకసారి ఓ సోదరి— మీ నవలల్లో సెక్సు ఎక్కువగా వుంటుందని అన్నారు సెక్సు వుందా? ఎక్కువగా వుందా? ఏ నవలలో చదివారో చెప్పగలరా? అని అడిగాను నిజానికి ఆ సోదరి నా నవలలు చదవలేదు, 'ఎవ్వరో అన్నారు' అని చెప్పింది కొంతమంది రచనలు చదవకుండానే విమర్శిస్తారు"

"మీ నవలల్లో హీరోయిన్ చాలా అందంగా వుంటుంది" సాహిత్య అడిగింది

"ఆ మాట కూడా విన్నాను మీరు అందంగా వున్నారు ఈసారి నా నవలలో హీరోయిన్ మీలాగ వుంటుంది" అని నవ్వారు రచయిత్రి.

"ప్రేమకు ప్రాధాన్యం వుంటుంది" కమల మెల్లిగా అంది చూడకూడదు అనుకుంటూనే గోపి వైపు చూసింది

### మ న వి

'రాగాగ్ని' నవలలోని పాత్రలు కేవలం కల్పితం. ఎవరిని వుద్దేశించి వ్రాసినది కాదు. కథ కోసం వూహాగా అల్లుకున్న పత్రికా సంస్థ 'రచన.' వ్యక్తిగతంగా ఏ ఒక్కరి గురించి రాసినది కాదు — అని హామీ యిస్తున్నాను

ఇట్లు,
చిట్టారెడ్డి సూర్యకుమారి

"సాహిత్య, కమలలో సాహిత్య అందంగా వుంది కూర్చున్న తీరు — మాట్లాడే విధం కట్టుకున్న బట్టల తీరు చూస్తుంటే డబ్బున్నవాళ్ళుగా వున్నారు వీళ్లిద్దరిలో ఓ అమ్మాయిని ఎన్నుకోమంటే — గోపి ఎవ్వరిని ఎన్నుకుంటాడు సహజంగ సాహిత్యనే కోరుకుంటాడు కాని కమల గోపి వైపు చూపులు విసిరే విధం చూస్తుంటే అతనంటే యిష్టమైనట్లుంది" అని చిట్టారెడ్డి అనుకుని కమల వైపు చూస్తూ —

"ప్రేమకు ప్రాధాన్యం అంటారా? ప్రేమ ఎన్నిసార్లు విన్నా, ఎంత చదివినా, చెప్పినా విసుగు కలిగించని సబ్జక్టు ఏ కాలంనాటిదైనా చెల్లిపోతుంది నా కథలో ప్రేమకే ప్రాధాన్యం వున్నా, ఇంకా ఎన్నో విషయాలు—సమస్యలు—పరిష్కారాలు వుంటాయి"

"మీ రచనలపై పాశ్చాత్య రచనల ప్రభావం వుందంటారా?"

"పది సంవత్సరాల క్రితం నేనొక కథ వ్రాశాను ఆమధ్య నా ఆరోగ్యం ఏమి బాగుండేది కాదు నేను చనిపోయినా, మధురస్మృతులగానే మావారికి గుర్తుగా వుండాలని అనుకునేదాన్ని ఆలోచనలోనే ఆ ఆలోచనలతోనే ఓ కథ వ్రాశాను అదే సమయంలో 'లవ్ స్టోరీ' అనే నవల వచ్చింది నా కథకు చాలా దగ్గరగా వుంది అయితే ఆ రచయిత నా కథను కాపీ కొట్టాడని అనలేము కాని నేను ఆ కథను మనస్సులో వుంచుకుని వ్రాశామంటారు కాపీ అంటారు

సాధారణంగా రచయితల ఆలోచనలు, ఒకే మాదిరి వుంటాయి నేను ఒక థీమ్ ఎన్నుకుని కథ వ్రాద్దామనుకుంటుండగానే అలాంటి కథనే మరో రచయిత(త్రి) వ్రాసేసి వుంటారు అలాగే కథకు కొత్త పేరు యింతకుముందు పెట్టని పేరు పెట్టాలని నిశ్చయించుకుంటే సరిగ్గా ఆ పేరున కథ రావడం చూస్తే ఆశ్చర్యం వేస్తుంది అందుకే అనుకున్నవి త్వరగా రాయాలనుకుంటాను కథగా వ్రాద్దామనుకొన్నవి — కొన్ని సంఘటనలు సినిమాలో చూసి 'ఇలాగే నేను వ్రాయాలనుకొన్నాను' అని మావారితో చెప్పుతుంటాను

అలాగే సంభాషణలు — ఆలోచనాధోరణి చాలా ఇంగ్లీష్ నవలల్లో చూశాను ఆ సంభాషణ

300 గ్రాములు రూ. 3-40 (స్థానిక పన్నులు అదనం)

మీకు మీరుగా గమనించండి!

# ఇతర డిటర్జెంట్ ఉతికే బిళ్ళ లకన్నా బరువు రెండు రెట్లు ఎక్కువ. ధర కేవలం కొద్ది పైసలు ఎక్కువ!

# టోటల్

## నీలి డిటర్జెంట్ ఉతికే బార్







ఉతుకుటకు
చేతికనువుగా
ఐదు భాగాలు.

## మొదటి "నిజమైన" డిటర్జెంట్ బార్!

టోటల్ - ఉతికే బార్ రీతిలో ఉన్నది.
మరియు అధికమైన శుభ్రపరిచే నీలి
డిటర్జెంట్ శక్తి ఉన్నది
మరి ఇంకేమి? పొదుపుగ
ఉతికేందుకుగాను ఇది ఐదు చేతికనువైన
భాగాలు కలిగివుంది

## కేవలం కొద్దిపైసల హెచ్చుకే రెండు రెట్లు బరువు!

ఒక నిర్దిష్టమయిన డిటర్జెంట్ కేక్ 125 గ్రాముల బరువు
కలదానికి మీరు ఎంత ఖర్చుపెడుతున్నారు?
250 గ్రాముల "టోటల్" ధర కేవలం రూ 2 67
(300 గ్రాములకి రూ 3 40) అదీను మామూలు డిటర్జెంట్ కేక్‌లకన్న
రెండు రెట్లు బరువు ఎక్కువ కేవలం కొద్ది పైసల హెచ్చుకే!

**ఆంధ్రప్రదేశ్, బీహార్ మరియు తమిళనాడులలో దొరుకును.**

---

కర్ణాటక సోప్స్ అండ్ డిటర్జెంట్స్ లిమిటెడ్ బెంగుళూరు వారి ఒక నాణ్యమయిన ఉత్పాదన
మార్కెట్ చేయువారు మైసూరు సేల్స్ ఇంటర్నేషనల్ లిమిటెడ్, బెంగుళూరు-560 052

MCA-TDB-51TEL R

## విద్యార్థి లోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

నేను అయిదవ తరగతి చదువుచున్నాను మాది ఇంగ్లీషు మీడియం స్కూలు, మా ఊళ్ళో సరైన తెలుగు మీడియం స్కూలు లేనందు వలన, మా నాన్నగారు నన్ను ఇంగ్లీషు మీడియం స్కూల్లో చేర్పించారు ఈ రకము స్కూళ్ళ ఫీజులు చాలా ఎక్కువ దుస్తులు, నెక్‌టై, సాక్సు, బూట్లు వగైరా ఖరీదు గలవి విద్యార్థులు వేసుకురావాలి సామాన్యులకు యిది అంతా భరించలేని బరువు

సామాన్యంగా ఇలాంటి స్కూళ్ళలో పిల్లలు భోజనము చేయటానికి తగిన వసతి సౌకర్యములు లేవు, చెట్లక్రింద పిల్లలు భోజనం చేయవలసి వస్తోంది చెట్లపైనున్న పక్షులు పిల్లలమీద, పిల్లల టిఫిన్ క్యారియర్‌లోను రెట్ట పడటము మామూలు ఈ బెడదతోపాటు మరొక పెద్ద బెడద కుక్కలనుంచి మరీ చిన్నపిల్లల టిఫిన్ క్యారియర్లలో చొరబడి అవి తింటూవుంటాయి

ఉపాధ్యాయులు చీటికి మాటికి పిల్లలను చాలా తీవ్రంగా తిడతారు ఎక్కువగా కొడతారు ఇలాంటి అన్ని లోపాలను తొలగించి మంచి తెలుగు మీడియం స్కూలును ప్రభుత్వం స్థాపించి నడిపితే విద్యార్థులకు చాలా సహాయ పడినవారవుతారు వారి కుటుంబ ఖర్చు తగ్గించినవారవుతారు అప్పుడు చదువుమీద ధ్యాస తగ్గదు విద్యార్థులకు చదువుకోటానికి తగిన సౌకర్యములు చూపనప్పుడు, విద్యార్థులకు ఆసక్తి కలుగచేయనప్పుడు వారిలో అభివృద్ధి రాదు రేపటికి మంచి పౌరులుగా కాలేరు

ఉత్తమమైన అభివృద్ధి కోరి టీచర్లు వుంటేనేకాని విద్యార్థుల ప్రవర్తన, విద్యార్థులకు తగిన ఆదర్శము కలుగవు ఉత్తమ ఆశయాలు కలిగిన టీచర్లు విద్యార్థి లోకాన్ని సృష్టించి దేశసేవకు వారిని అందించగలరు దేశాన్ని నడిపించగల విద్యార్థులను టీచర్ల ద్వారా మన దేశం చూడగలదని ఆశించుచున్నది *

### రచయిత్రి పరిచయం



"నా వయస్సు 10 సంవత్సరములు. గన్నవరంలోని సెయింట్ జాన్స్ స్కూల్లో 5వ తరగతి చదువుచున్నాను అమ్మ, నాన్న గన్నవరం కాలేజీలో ఉపాధ్యాయులు ఆటల్లోను, డిబేట్స్‌లోను, మోనోయాక్షన్ లోను పాల్గొనడం, బహుమతులు పొందడం నా అభిరుచులు"

— జి. కవిత

ఆ పుస్తకాల్లో చదివినప్పుడు నేను అక్కడిది వ్రాశానని అనుకుంటారు ఎందుకంటే మన రచయిత్రుల ప్రతిభపై చిన్న చూపు

'భూమి చీల్చుకుని నన్ను మింగేస్తే బాగుండును' అన్న భావం ఎక్స్‌ప్రెషన్ మనకు సీత నుండి వచ్చింది అదే ఎక్స్‌ప్రెషన్ కొన్ని ఇంగ్లీషు నవలల్లోను వుంది అదే ఎక్స్‌ప్రెషన్ వీరికెలా వచ్చింది ? మన పుస్తకాల నుంచి వాళ్ళు సంగ్రహించారని అనుకోలేము ఇంగ్లీషు నవలలు ప్రపంచమంతా చదువుతారు మన తెలుగు పుస్తకాలు ఆంధ్రకే పరిమితము

ఇలాగే ఒక్కొక్కప్పుడు ఫలానావారి కథ ఆ

రా గా గ్రి

కథ లాగుంది అని ఫిర్యాదు వచ్చినప్పుడు ఆ రచయిత కుర్రో మర్రో మంటూ "ఆ కథ సంగతి నాకు తెలియదు నేను చదవలేదు ఇది నా అనుభవం" అని జవాబు చెప్పుకోడం మనం చూస్తూనే వుంటాము"

"మీ రచనలు ఘాటుగా మగవారు వ్రాసినట్లు వుంటాయని చెప్పుకోవడం విన్నాను" గోపి

"నేను అనుకున్నది ఫ్రీగా వ్రాస్తాను అందుకే 'మగవాడి రచన' అంటారు ఇలా వ్రాస్తే ఏమనుకుంటారో ! అన్న తలంపు వస్తుంటుంది వాస్తవంగా వుండాలంటారు—కాని వాస్తవం భరించలేరు ఏ మానవతీ ఇలా చేయదు—అని విమర్శిస్తారు వారికి తెలిసినంత వరకే రైటు అంటారు"

"మీ అభిమాన రచయితలు ఎవ్వరు ?"

"ఒక రచయిత, లేదా రచయిత్రి అభిమానం అని ప్రత్యేకంగా చెప్పలేము ఏదైనా కథ చదివినప్పుడు బాగుంటే బాగుంది అనుకుంటా నాకు రచయితలందరూ ఇష్టులే వారిని చూడకపోయిన, పరిచయం లేకపోయినా వాళ్లందరూ మా వాళ్ళే అన్నభావన వుంది ఒక్కొక్కరి రచన కొన్నిరోజులు కనపడకపోతే 'ఏమిటి ! ఈ మధ్య వాళ్ళ (వారి రచనలు) రాలేదే' అని అనుకుంటూ వుంటాను పరిచయం లేకపోయినా కౌశల్యాదేవిగారి భర్త పోయారని విన్నప్పుడు ఎవ్వరో ఆత్మీయులు పోయినట్లే నేను, మావారు బాధపడ్డాము

ఇకపోతే విశ్వంగారి 'మాణిక్యవీణ' అంటే ఇష్టం వారి శైలి, భాష నా కెంతో ఇష్టం అలా నేను వ్రాయగలిగితే ఎంత బాగుండును ! అనుకుంటాను పురాణంగారి ముచ్చట్లు బాగుంటాయి మాలతి చందూర్‌గారి ఇంగ్లీషు నవలల పరిచయం నన్నెంతగానో ఆకర్షిస్తాయి ఎంత పెద్ద నవలైనా రెండు మూడు పేజీలలో నవలగా చెప్పగల ప్రతిభావంతురాలు

కొత్త 'ఆంధ్ర సచిత్రవార పత్రిక' వస్తే రామలక్ష్మి గారి ప్రశ్నావళి ముందు చదువుతాను అలాగే కె వి కృష్ణకుమారి 'మహిళ' జవాబులు మధురంగా, ఎంత ఆత్మీయంగా, ఎదుటివారిని సేదతీర్చినట్లుగా వుంటాయి మగవారి గుండెల్లో సూటిగా గుచ్చుకుని, వారిని తికమకపెట్టి వుడుక్కునేలా చేసే రంగనాయకమ్మగారి రచనలు మరచిపోలేము మెత్తగా సాగిపోయే యద్దనపూడి రచనలు — సీతాదేవిగారి వాస్తవ గాథలు, మాదిరెడ్డి కుటుంబ గాథలు, ఆనందరామంగారి కథలూ బాగుంటాయి ఇలా చెప్పుకుంటూ పోతే ప్రతి రచయిత, రచయిత్రిలో ఏదో ఒక ప్రత్యేకత గోచరిస్తుంది "

"మీ రచనల వలన మీరేదైనా సాధిద్దామని అనుకుంటున్నారా ?"

"అలాటి ఆశలేమి లేవు మీరెందుకు రాస్తున్నారని మీరు అడగవచ్చు గాలీ, నీ వెందుకు వీస్తున్నావ్ ! మేఘమా, నీ వెందుకు వర్షిస్తున్నావ్ ! అంటే అవేం చెప్పగలవు ? అలాగే రచయితను అడిగితే ఏమి చెప్పగలరు ? రచన అంటే ఒకరు నేర్పితే నేర్చుకునే విద్యకాదు అది మనస్సుకు, హృదయానికి సంబంధించినది దేవుడు ప్రత్యేకంగ ఇచ్చిన వరం"

"మీ రచనల్లో మీకేది బాగుంటుంది ?"

"నాకు దేనికదే బాగుంటుందనిపిస్తుంది మన సృష్టి మనకు బాగానే వుంటుందనిపించటం సహజమే కాకిపిల్ల సామెత " అంటూ నవ్వారు

అంతలో లక్ష్మీపతిగారు వచ్చారు చిట్టారెడ్డి "మా వారండి" అంటూ పరిచయం చేసింది

ఆయనతో లోకాభిరామాయణము మాట్లాడు తుంటే కూల్‌డ్రింక్స్ తెచ్చి యిచ్చారు,

"ఇంటర్వ్యూ చేసి అలసిపోయారు పాపం" అంటూనే

మొదట పని ఏ విఘ్నము కలుగకుండా జయప్రదంగా జరిగిపోయినందుకు సంతోషిస్తూ థాంక్స్ చెప్పి ఆనందంగా నిష్క్రమించారు

(ఇంకా వుంది)

సూటింగులు: పాలియెస్టర్ బ్లెండ్ మరియు కాటన్



మంచి అభిరుచి. తగిన ధరలు.

ఎన్‌లైవ్®

నేషనల్ టెక్స్‌టైల్ కార్పొరేషన్ (తమిళనాడు మరియు పాండిచెరి) లి.
భారత సర్కారుపు ఒక ఉద్యోగ సంస్థ
10/64 సోమసుందరం మిల్ రోడు, కొయమత్తూరు-641009

MCA/NTC/79/TEL

ఇండెంటింగ్ ఏజెంట్లు: బాలాజీ టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్-3, సంగం టెక్స్‌టైల్ ఏజెన్సీస్, 230, మొదటి అంతస్థు, డి. బి. రోడ్, ఆర్. ఎస్. పురం, కొయమత్తూరు-2, స్టాక్-కమ్-సేల్ డిపో: ఆర్. పి. డిస్ట్రిబ్యూటర్స్, 3-4-394, టుబాకో బజారు, సికింద్రాబాద్-3.

# వారఫలం

12-11-1982 శుక్రవారం మొదలు
18-11-1982 గురువారం వరకు

♈ **మేషం** కొండంత ఆశతో ఒకానొక కార్యాన్ని సాధించాలని తలుస్తారు అనేక విధాల మీ వ్యాపారాన్ని విస్తరించాలని ప్రయత్నిస్తారు ఉద్యోగంలో మార్పులు తేవాలని ప్రయత్నిస్తారు ఏమైనా సమర్థులైన వారుంటేనే గదా! పని సానుకూలం కావటానికి స్త్రీలకు విద్యా వినోదాలు ఆనందం చేకూరే వారం

♉ **వృషభం** ధనాదాయానికి లోటులేదు సమయానికి చేతికి డబ్బు అందే సూచన గలదు వ్యాపారం యథాప్రకారం జరుగటానికి ఆక్షేపణ లేదు ఉద్యోగంలో కొందరు ప్రగతిని సాధించగలరు. స్త్రీలకు దూరదేశ ప్రయాణావకాశాలు, మిత్రగోష్ఠి, వినోదంతో కాలక్షేపం

♊ **మిధునం** వృత్తిలో పెంపుదల గలదని వేరుగా చెప్పనక్కరలేదు వ్యాపారంలో అభివృద్ధి కనిపించుటలో ఆక్షేపణ లేదు మేధావుల సాహచర్యం లభించుటలో ఆశ్చర్యం లేదు ధనాదాయానికి ఏవిధంగా లోపంలేదు స్త్రీలకు. వృత్తి గౌరవం, సభా గౌరవం, సాటివారిలో గౌరవ ప్రతిష్ఠలు వృద్ధియగుటకు అనుకూల వారం

♋ **కర్కాటకం** ఎలా చూచినా, ఏరంగానికి సంబంధించిన వారిని గూర్చి తెలుపాలన్నా, భవిష్యత్తుకు, సుగమంగా బాటలు ఏర్పడగల వారం ధనాదాయానికి గాని పెద్దల అనుభూతిని చూరగొనటానికి గాని ఎలాంటి లోపం లేనివారం స్త్రీలకు కుటుంబానందం, శుభ కార్యాలోచనకు అనువైన కాలం

♌ **సింహం** కొంత యిబ్బందితో, ధనాభావంతో యత్న కార్యాచరణంలో లోపం ఏర్పడుటకు అవకాశం ఉన్నది వయసు మిరిన వారు ఆరోగ్య విషయంలో ఎంతో శ్రద్ధ వహించాలని వేరే చెప్పనక్కరలేదు స్త్రీలకు ఒకానొక గృహ వ్యవహారంలో పరిష్కారానికి, కించిత్త ధనాదాయానికి అనుగుణమైన వారం

♍ **కన్య** ప్రయాణాలలో గాని, ఉద్యోగ వృత్తులను సవరించుకొనుటలో గాని మీరు శ్రద్ధ వహించాలి ఎలాంటి పొరబాట్లు గాని, తప్పులు గాని జరుగకుండా చూచుకోవాలి కొందరకు విదేశ ప్రయాణ సూచన రాజకీయంగా మేలు చేకూరుటకు అవకాశమున్నది స్త్రీలకు నూతన వస్తు సేకరణకు, నూతన వ్యవహారాలలో జోక్యానికి అవకాశం గలవారం

♎ **తుల** దైనందిన కార్యాలలో, భారీ వ్యాపారం చేసేవ్యక్తి వ్యాపార విషయంలో భాగస్వాములతో వ్యాపారం చేసేవారైనా మిక్కిలి శ్రద్ధ వహించాలి అనుకోకుండా ధనాదాయానికి, ఆరోగ్యాభివృద్ధికి అవకాశమున్నది స్త్రీలకు నూతనంగా ఉద్యోగ ప్రయత్నాలు చేసేవారికి మేలున్నది

♏ **వృశ్చికం** మితాలూకు వస్తువులు రాకపోకల్లో పోగొట్టుకొంటారేమో జాగ్రత్త! వాహన ప్రయాణ సమయాల్లో కూడా ఎంతో జాగరూకత అవసరం వ్యాపారంలో అభివృద్ధికి ఆస్కారమున్నది శ్రమకు దగిన ఫలితాలకు లోటులేదు స్త్రీలకు అనుకొన్న దానికన్నా ఎక్కువగా ధనలబ్ధికి అవకాశం, వృత్తిలో పెంపునకు అవకాశ ముంటుంది

♐ **ధనుస్సు** అప్రయత్నంగా కొందరకు గౌరవ పదవులు లభ్యం కావటానికి అవకాశ మున్నది కొందరు మిత్ర, బాంధవ సహాయం అందుకోగలరు. భూసంపాదనా ప్రయత్నాలకు, చాల కాలంగా తనఖా పడిన వ్యవహారం మరలా సాగుటకు అవకాశం గలదు స్త్రీలకు నాల్గు విధాలా, ముఖ్యంగా సాహిత్య పరంగా మేలు సంభవం

♑ **మకరం**- చిరకాలంగా చేసే ప్రయత్నాలు ఫలితానికి రాగలవు ధనలబ్ధికి, నూతనంగా విలువగల వస్తువులు సేకరించు కొనుటకు అవకాశం గలవారం స్త్రీలకు కళా సాహిత్య రంగాభివృద్ధి, నగలు కొనుటకు అవకాశం కూడా లేకపోలేదు

♒ **కుంభం**- మిత్రులతో వ్యాపారస్థులతో, బంధువులతో సంభాషించే సమయంలో, ఈ వారం రోజులు ఎంతో శ్రద్ధ వహించాలి విలిపి జగడాలకు కూడా అవకాశం ఉన్నది. కాబట్టి జాగ్రత్త వహించాలి స్త్రీలకు ఉద్యోగాభివృద్ధికి చేసే ప్రయత్నాలకు అనుకూలం ధన లబ్ధికి లోపం లేదు

♓ **మీనం** నూతన వ్యాపారాలో చనలు ఫలితానికి రాగలవు అధికంగా ఆదాయం ఆశించదగిన వారం అనుకోకుండా ఆప్తులు బంధువర్గీయులు యింటికి రాగల సూచనలున్నాయి అధిక వ్యయానికి మార్గాలు ఏర్పడుతాయి స్త్రీలకు దైవ కార్యాలోచన, విందు వినోదాలలో పాల్గొనే అవకాశం గలవారం

- విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి *

# ప్రకృతి కానుక
# ప్రతి ఒక్కరికీ.
# కోమల,యవ్వన
# ఛాయ సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా నుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా. తాజాగా, మెరుస్తూ వుంటుంది.

**శరీరమంతా పరిశుభ్రం**
**తల్లిలా చేసే సంరక్షణ**




## మార్గో—స్వచ్ఛమైన వేప నూనెతో
## ప్రత్యేకంగా చర్మ సంరక్షణకై చేయబడిన సబ్బు

కాల్ కెమికో వారి ఉత్పాదన నాణ్యతకై చూచి వాడేవారికి

CCC/4000 Tel

# పశ్చాత్తాపం

— వింధ్యవాసిని —

సాయంకాలం అయింది అప్పుడే కొద్దిగా జల్లు పడి ఆగి, మళ్ళీ నీరెండ పొడ కనిపిస్తోంది తడిసిన మట్టివాసనతో నిండిన చిరుగాలులతో వాతావరణం ఆహ్లాదకరంగా ఉంది

అలంకరణకి ఆఖరి మెరుగులు దిద్దుకుంటున్న మీరా ఇంటి ముందర కారు హారన్ చప్పుడు వినిపించటంతో కిటికీలోంచి బయటికి చూసింది

అప్పటికే మాలి వెళ్ళి గేటు తెరవటం, రవీంద్ర కారుతో లోపలికి రావటం జరిగిపోయాయి "అరే ఇవాళ త్వరగా వచ్చేశారే ఈయన ?" అనుకుంటూ, బొట్టు సరిదిద్దుకుని, పెర్‌ఫ్యూమ్ కొద్దిగా స్ప్రే చేసుకుని, తన గదిలోంచి ఇవతలికి వచ్చింది

అప్పటికి రవీంద్ర వంటమనిషి ఇచ్చిన కాఫీ తాగటం అయింది మీరాని చూడగానే, అతని ముఖంలో ఆశ్చర్యం "అరే నువ్వింట్లోనే ఉన్నావా? పార్టీకి వెళ్ళలేదూ ?"

"ఉహూ, మిసెస్ దేశాయ్ మధ్యాహ్నం ఫోన్ చేసి చెప్పారు దాస్ ప్రకాశ్‌లో పార్టీ హాల్ ఇదే టయింకి ఎవరో ముందే బుక్ చేసుకున్నార్ట లందుకని వీళ్ళు ఆరు నుంచీ ఏడుమ్పైకి మార్చుకున్నారుట టయిం "

"అహ, అలాగా" అనేసి తన గదిలోకి వెళ్ళిపోయాడు

అతనలా ముభావంగా వెళ్ళిపోవటం మీరాకి అసంతృప్తిగా వుంది తామిద్దరూ ఇలా సాయంత్రాలు కలుసుకోవటమే అపురూపం ఎందుకంటే అతను మామూలుగా ఆఫీసునుంచీ వచ్చేసరికి ఏ ఏడు గంటలో అవుతుంది అంతవరకూ ఊరికే ఇంట్లో కూర్చోవటం తనకి బోరు తను ఏ లేడీస్ క్లబ్ మీటింగ్‌కో, ఫ్రెండ్ ఇంటికో, పార్టీకో వెళ్ళిపోతుంది రాత్రి తను వచ్చేసరికి బాగా ఆలస్యం అవుతుంది ఒకోరోజు రవీంద్ర భోంచేయకుండా తనకోసం కాచుక్కూచుని ఉంటాడు, ఏవయినా ఆఫీస్ కాయితాలు చూసుకుంటూ ఒకోసారి, ముందే భోంచేసి నిద్రపోయి ఉంటాడు

అతని ఆఫీస్ రూం కమ్ డ్రసింగ్ రూం ఒక్కటే "అప్పుడే ఆఫీస్ కాయితాలు ముందేసుకుని కూర్చున్నాడు కాబోలు ఈయనకీ మధ్య బిజినెస్ పిచ్చి బాగా పట్టుకుంది," అనుకుంటూ గడప దగ్గర వచ్చి నిలుచుంది మీరా

రవీంద్ర ఎక్కడికో వెళ్ళేందుకు తయారు అవుతున్నాడు స్నానంచేసి వచ్చాడు కాబోలు ఒళ్ళు తుడుచుకుని, తెల్లటి పైజమా, లాల్చీ వేసుకున్నాడు తల దువ్వి, కాస్త పౌడరద్దుకుని, తేలికగా ఉండే మామూలు తోలు చెప్పులు వేసుకుని బయలుదేరాడు

హాల్లో సోఫాలో ఫెమినా చూస్తూ కూచుని ఉన్న మీరా, అతనెక్కడికి వెళుతున్నదీ చెపుతాడని చూస్తూ ఉంది తను అడిగితే అతను చెపుతాడని తెలుసు కానీ అడక్కుండానే చెప్పాలనీ, తన్నీ వెంట రమ్మనాలనీ ఉంది రమ్మంటే తన పార్టీ ఒదులుకుని వెళ్ళేదే!

కానీ రవీంద్ర అలాంటిదేం లేకుండా, "నీకింకా చాలా టయం ఉందేమో కదూ? నేను వెళుతున్నా" అనేసి జవాబు కోసం అయినా చూడకుండా, వెళ్ళి కార్లో కూర్చుని, స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు

రాత్రి మీరా పార్టీనుంచి వచ్చేసరికి తొమ్మిది గంటల ముప్పయి నిమిషాలు అయింది పెద్ద ఆలస్యం ఏమీ కాలేదు కానీ అప్పటికే రవీంద్ర భోంచేసి నిద్రపోతున్నాడు

ఎప్పటిలా ఊరుకోలేకపోయింది రవీంద్రతో ఏమయినా మాట్లాడాలని ఉంది అందుకనే, "రవీ! ఏమిటండీ అప్పుడే నిద్రా ?" అని పలుకరించింది అతన్ని

అతను ఉలిక్కిపడి కళ్ళు తెరుస్తూ, "ఏమిటి ఎంతసేపయింది నువ్వొచ్చి?" అన్నాడు చిరునవ్వుతో

"ఇప్పుడే" పొడి పొడిగా అంది

"పార్టీ బాగా జరిగిందా ?"

"ఊ జరిగింది నువ్వురానందుకు వాళ్ళు చాలా నొచ్చుకున్నారు "

రవీంద్ర ఆఫీస్‌కీ, బిజినెస్‌కీ అవసరం అయిన పార్టీలకు తప్ప, మిగతా వాటికి సాధారణంగా రాడని అందరికీ తెలుసు అందుకని, మామూలుగా ఆ విషయాన్నెవరూ అంతగా పట్టించుకోరు అయితే మీరా మనస్సులో ఉన్నది వేరు ఇవేళ సాయంత్రం తనకు చెప్పకుండా వెళ్ళిన దెక్కడికో తెలుసుకోవాలని కుతూహలం ఆ మాటని నేరుగా అడగటం ఇష్టం లేక, అలా కల్పించి చెప్పింది

రవి మీరా మాటలు అసలు పట్టించుకోనివాడిలా, "నువ్ ఆర్డర్ చేసిన కొత్త డిజయిను నెక్‌లేస్ రేపటికి రెడీ అవుతుందన్నాడు సేఠ్ ఇవాళ ఫోన్‌చేసి కనుక్కున్నాను రేపు సాయంత్రం పట్టుకొస్తాను" అన్నాడు

అంతే! మీరా అసలు విషయం మర్చిపోయింది "రేపు నెక్లెస్ వస్తే, దాన్ని వచ్చే వారం, మిసెస్ నాయుడుగారి అమ్మాయి వెడ్డింగ్ రిసెప్షన్‌కి వేసుకుని వెళ్ళి అందరికీ చూపించాలి" అనుకుంటూ "మొత్తం ఎంత అయిందట ?" అనడిగింది

"పాతికవేలు లవచ్చనుకుంటాను" అంటూ, ఆవలిస్తూ, కళ్ళు మూసుకుని పడుకున్నాడు రవీంద్ర ఇవాళ ఆఫీసులో జరిగన గొడవ, తనకీ, మేనేజర్ రామభద్రంకీ వచ్చిన తగాదా, చివరికది అతన్ని ఉద్యోగంలోంచి తీసేసేదాకా వెళ్ళిన వైనం అన్నీ ఆమెకు చెప్పాలని ఉంది రవీంద్రకి కానీ మీరాకిలాంటి విషయాల్లో అంత ఆసక్తి ఉండదు అందుకే నిశ్శబ్దంగా నిద్ర కుపక్రమించాడు

ఒకప్పుడు అయిదేళ్ళ క్రితం తమకు కొత్తగా పెళ్ళయినరోజుల్లో, తను ఏ ట్రాష్ మాట్లాడినా, ఆమెకు ఆసక్తికరంగానే ఉండేది కానీ, ఇప్పుడు అట్లాకాదు అప్పుడు తను మామూలు గుమాస్తాగా ఉండే రోజుల్లో, ఆమె తన భార్యా, స్నేహితురాలు, ప్రేయసి, అన్నీను ఇప్పుడు ఉహూ ఆమె తప్పేంలేదు ఈ సంపాదన, ఆస్తి, అంతస్తు ఇవే ఇద్దరిమధ్యా దూరాన్ని పెంచుతున్నాయి రవి ఆలోచనలతోనే నిద్రపోయ్యాడు అతని పక్కనే ఆనుకుని పడుకున్న మీరా నిద్ర నిండా నెక్‌లేస్ వేసుకున్న కలలే

*　　*　　*

మహిళా మండలి వారంతా కలిసి వేసుకున్న మూడురోజుల విహారయాత్ర ముగించుకుని ఇల్లు చేరుకుంది మీరా

రవీంద్ర ఇంట్లో లేడు కాఫీ తాగి స్నానం చేసి ట్రిమ్‌గా తయారయింది మీరా మూడు రోజులయి వదిలి వెళ్ళినందుకేమో భర్తని చూడాలనీ, మాట్లాడాలనీ ఉంది కానీ అతనేమో ఇంకా రానే లేదు పోనీ ఫోనయినా చేద్దామని డయల్ చేసింది

"అయ్యగారు ఆఫీసు వదిలి గంటన్నర అయిందమ్మగారూ!" అని జవాబొచ్చింది

మొదట ఏమీ అర్థంకాలేదు మీరాకి తరువాత వంటమనిషిని పిలిచి అడిగింది, "అయ్యగారు రాలేదా ?" అని

"మీరు రాకముందే వచ్చి మళ్ళీ బయటికి వెళ్ళారమ్మా" అన్నాడు అతను

ఉక్రోషంతో మీరా ముఖం కందిపోయింది 'హు! తను ఇవాళ వస్తుందని తెలిసీ, ఇంటికి వొచ్చి, మళ్ళీ బయటికి వెళ్ళిపోయాడని తెలిసి మండిపోయింది మీరా ఎంత నిర్లక్ష్యం ? అతని దృష్టిలో తనకున్న విలువ ఇదేనా ?'

ఆవేళ మొదటిసారి, ఒక కొత్త అనుమానం కలిగింది మీరాకి అతను తననింత పట్టించుకోకుండా వెళ్ళాడంటే, అవతల అతను కలుసుకోబోయిన వ్యక్తి ఎవరు అయి ఉంటారు ? తనకి తెలీకుండా కొత్తగా అతనికే ఆడస్నేహితులయినా ఏర్పడ్డారేమో! ఏమో ఎలా తెలుసుకోవటం ? అడిగితే మాత్రం ఇలాంటి విషయాల్లో నిజం చెబుతారా ?

అయినా రవీంద్ర అలాంటి వాడు కాదు బహుశా ఏదో ముఖ్యమయిన పనిమీదే వెళ్ళి ఉండాలి అనుకుంటూ, ఉసూరుమని, సోఫాలోనే పడుకుని నిద్రపోయింది మీరా

రాత్రి రవీంద్ర వొచ్చి, "అన్నం తిందువులే మీరా!" అని లేపితే లేచింది అతను తెల్లని పైజమా, లాల్చీ వేసుకుని ఉన్నాడు దగ్గర్నుంచీ సన్నజాజుల పరిమళం వస్తోంది ఎక్కడిదీ సువాసన అని అనుమానంగా చూస్తున్న మీరా చేతిలో, సన్నజాజుల మాల కట్టిన పొట్లం పెట్టి, "నీ కిష్టమని తెచ్చాను" అన్నాడు రవీంద్ర చిరునవ్వుతో

"బాగా జరిగిందా ట్రిప్" అని అడిగాడు మీరాని

చెదిరిపోయిన జుట్టుని సవరించుకుందుకయినా ఓపిక లేనిదానిలా అలాగే పూవులు తల్లో తురిమేసు

కుంది మీరా, "మీరు భోంచేశారా ?" అని అడుగుతూ

"ఉహు ఇప్పుడే నే వచ్చింది "

*　　　*　　　*

ప్రయాణపు బడలిక తీర్చుకుందుకు మీరా ఒక రోజంతా ఎక్కడికీ వెళ్ళకుండా విశ్రాంతి తీసుకుంది పొద్దున్న టిఫిన్ తిని ఒక నిద్ర, మధ్యాన్నం భోంచేసి మరో నిద్ర తీసింది ఫోన్ మోగిన శబ్దానికి నిద్ర లేచింది

"హలో మీరా! ఏమిటే ఇంకా రెస్టేనా? ఇవాళ రాలేనంటావా ?" అని అడుగుతోంది, మిస్ వహీదా ఫోన్లో ఈ అమ్మాయి ఒక వయోజన విద్యా కేంద్రం నడుపుతోంది. మీరా అక్కడ వారాని కొక్కసారి వచ్చి పాఠాలు చెప్పేలా బలవంతంమీద మీరాతో ఒప్పించుకుంది. ఇందులో తనకేమీ ఆసక్తి లేకపోయినా మొక్కుబడి చెల్లించుకుందుకు వెళ్ళి వస్తూ ఉంటుంది మీరా.




"సారీ వహీదా, ఏమీ అనుకోకు వచ్చే వారం తప్పకుండా వస్తాను అదుగో మావారు కూడా వొచ్చేశారు" అంటూ ఫోన్ పెట్టేసింది వహీదా ఫోన్లో సంభాషణ అంటూ ఆరంభించిందంటే, ఒక పట్టాన వదలదు అందుకని తనే తెగేసి ఫోన్ పెట్టేసింది మీరా

మీరా మాటవరసకి అన్నా, అదే క్షణంలో రవీంద్ర రావటంకూడా జరిగింది

అతను బాగా అలసటగా కనిపిస్తున్నాడు అయినా మామూలుగా నవ్వుతూ, "బాగా రెస్ట్ తీసుకున్నావా ?" అనడిగాడు

మీరాకి ఈవేళ ఎలాగయినా కాస్సేపు రవీంద్రతో కలిసి గడపాలని ఉంది అందుకనే, "బయటికి వెళ్ళే పనేమయినా ఉందా ?" అని అడిగింది అతన్ని

"ఏం చీరలేమయినా కొనాలా ?"

"ఉహూ లేదు "

"మరి"

"ఊరికేనా "

రవీంద్ర ఇంకేం రెట్టించకుండా కాఫీతాగి, స్నానం చేసి తయారు అయ్యాడు తెల్లటి ధోవతి, లాల్చీ వేసుకుని ఉన్న అతన్ని చూడగానే, మీరా మనసులోని జ్ఞాపకాల పొరలేవో కదిలినట్లయింది

నిశ్శబ్దంగా బయటికి వెళ్ళిపోతున్న రవీంద్రని చూస్తూ, అసహాయంగా ఉండిపోయింది మీరా

చాలా రోజులుగా గమనిస్తూనే ఉంది తను ఇతనిలా త్వరగా ఇల్లు చేరిన ప్రతీ రోజు, మళ్ళీ తయారయి, ఎక్కడికో వెళుతున్నాడు ప్రతిసారీ, తను ఇంట్లో ఉన్నా పట్టనట్టు, ఎక్కడికి వెళుతున్నది చెప్పకుండా వెళ్ళిపోతున్నాడు

ఏమిటిది ? ఎందుకిలా జరుగుతోంది ? కొం దీసి తనకారోజు వచ్చిన అనుమానం నిజం కాదు కదా ?

"ఉహూ ఊరికే వుంటే లాభంలేదు ఇవాళ ఏమయినా అసలు సంగతి తెలుసుకోవాలి" అనుకుంది మీరా

అంతే, ఇక చీర మార్చుకోవాలని, చెప్పులేసు కోవాలని కూడా గుర్తులేకుండా పిచ్చిదానిలా వీధిలోకి పరుగెత్తింది కనిపించిన ఆటోలో కూచుని, అల్లంత దూరాన వెళుతున్న రవీంద్ర కారుని వెంబడించ మన్నది డ్రైవర్ మంచివాడు లాగే ఉన్నాడు ఎక్కువగా ఏమీ ప్రశ్నలు వేయకుండా ఆటో ముందుకు దూకించాడు.

కారు ఏ సందు గొందుల్లోనో దూరి ఆఫీసులో పనిచేసే ఏ ఆడగుమాస్తా ఇంటికో వెళ తుందనుకున్న మీరా అంచనా తల క్రిందులయింది

కారు సాఫీగా ఉన్న మెయిన్ రోడ్లలో వెళుతూంది నమ్మలేనట్లుగా, ఆత్రుతగా చూస్తున్న మీరా, కారు పబ్లిక్ గార్డన్స్ ముందు ఆగట గమనించింది "ఉహూ, ప్రతీరోజూ ఇక్కడ ఎవరో కలుసుకుంటాడన్నమాట' అనుకుంటూ ఆట ఆపించి ఛార్జీ చెల్లించింది

ఆటో దిగి కింద నడుస్తూ ఉంటేగానీ గుర్తు రాలేదు, మీరాకి చెప్పులు వేసుకురావటం మరిచాన పాదాలు కనిపించకుండా, చీర కుచ్చిళ్ళు కొద్ది

ందికి లాక్కుంటూ అటూ ఇటూ చూసి గార్డెన్స్ ోపలికి నడిచింది

అంత దూరాన తలవంచుకుని నిదానంగా డుస్తూ వెళుతున్న రవీంద్ర కనిపించాడు వడివడిగా డుగులు వేస్తూ అతన్ని వెంబడించి వెళ్ళింది మీరా

జన సమ్మర్దానికి కొంచెం దూరంగా ఓ చెట్టు గ్గర ఒక్కడే కూచున్నాడు రవీంద్ర

'ఓహో! ఇక్కడికి వస్తుంది కాబోలు, విడెవరో ' అనుకుంటూ అతని వెనుకవైపు ారుగున నిలుచుంది మీరా

ఆమె తలలో అగ్నిపర్వతాలేవో పగులు ున్నట్లుగా ఉంది ఊపిరి పీల్చటం కూడా మరచిన ిలా, చూస్తూ నిలుచుంది మీరా

అయిదు, పది, పదిహేను నిమిషాలు గడిచాయి వ్వరూ రాలేదు రవీంద్ర కూడా, ఎవరి కోసమో మరుచూస్తున్న వాడిలా, టయిం చూసుకోవటం, టూ ఇటూ తల తిప్పి చూడటం ఏమీ చేయటం దు తనంతట తాను చెట్టు మొదలుకు చేరగిలబడి, ్రమిస్తున్నట్లుగా కూర్చుని ఉన్నాడు

'ఎందుకు ఎందుకిలా అయింది?' అని ాలోచిస్తోంది మీరా తనమీద అతనికున్న ప్రేమంతా మయింది? తను ఏం చేసిందని ఇలా తన్ను దూరం సి తను దూరంగా వెళ్ళిపోతున్నాడు? అని తన్ని నే ప్రశ్నించుకుంటోంది

కాస్సేపటికి నిలుచోలేక అక్కడే అలాగే ాార్చుంది

మెల్లగా చిరుచీకట్లు అలముకుంటున్నాయి క్కసారిగా అంతటా దీపాలువెలిగాయి అప్పుడే తమ మ గూళ్ళు చేరుకున్న రకరకాల పక్షుల శబ్దాలు తప్ప, ారే శబ్దం వినిపించటం లేదు జన సమ్మర్దానికి డంగా కూర్చోవటం వల్లనేమో, పల్లీల కుర్రాళ్ల కలుగానీ, దీపాల వెలుతురుగానీ అంతగా ఇటు ్పు రావటం లేదు

క్షణాలు నిముషాలు, నిముషాలు గంటలు అయి ార్లిపోతున్నాయి మీరా చేతికి వాచీ లేదు టయిం ంతయిందో తెలీదు సాయంత్రం కొద్దిగా పట్టిన ుబ్బు తొలిగి చందమామ కనిపిస్తున్నాడు

రవీంద్ర లేచి నిలుచుని ఒళ్ళు విరుచుకున్నాడు

## డెమోక్రసీ

గంటల ముల్లు
నిమిషాల ముల్లును
శాసిస్తుంది
నిమిషాల ముల్లు
సెకన్ల ముల్లును
బెదిరిస్తుంది
సెకన్ల ముల్లు
ఆలోచన విడిచి
పరుగో పరుగు,
డెమోక్రసీ అంటే
అంతే మరి

— ఎస్. మునిసుందరం

## పశ్చాత్తాపం

బయలుదేరబోతున్నవాడిలా, లాల్చీకి అంటుకున్న గడ్డి దులుపుకుని, ధోవతి కుచ్చులు సరిదిద్దుకుని, పక్కగా విడిచి ఉంచుకున్న చెప్పులేసుకున్నాడు

మీరా ఇంక ఆగలేకపోయింది "రవీ!" అని పిలుస్తూ పరుగెత్తి వెళ్ళింది

ఆ సమయంలో, అక్కడ, ఆ స్థితిలో కనిపించిన మీరాని చూడగానే ఆశ్చర్యంతో రవి నోట మాట రాలేదు

"మీరా, ఏమిటిది? ఇక్కడ "

"మీ వెంబడే వచ్చాను "

"ఎందుకు? వస్తానని అడిగితే కార్లో తీసుకొచ్చేవాణ్ణిగా?"

"మీరు నాకు చెప్పకుండా రోజూ ఎక్కడికి వెళుతున్నారో, ఎవరిని కలుసుకుంటారో చూద్దామని "

"పిచ్చి మీరా! నీకు తెలీని స్నేహితులు నాకెవరున్నారు? మనుషులకి దూరంగా ఇలా ఒంటరిగా ఈ చల్లని వాతావరణంలో కాస్సేపు గడిపితే సేద దీరినట్లుంటుంది మనసులో ఉన్న టెన్షన్ అంతా తగ్గి, ప్రశాంతత దొరికినట్లుంటుంది అందుకే ఇట్లా రావటం, అంతేనోయ్!"

అతని ఒకొక్క మాట ఒక్కొక్క ముల్లులా పొడుస్తున్నట్లుంది మీరాని 'తప్పంతా నీదే! నీదే!' అని ఆమె అంతరంగం గోల చేస్తోంది

కుప్పగా అతని పాదాల దగ్గిర కూలిపోతూ, "రవీ నన్ను క్షమించరూ?" అని పదే పదే అంటోంది మీరా

"ఏయ్ మీరా! ఏమిటిది? ఎందుకేడుస్తున్నావ్? నీది తప్పని ఎవరన్నారు? అసలిప్పుడేమయిందని " అంటూ తనూ క్రింద చతికిలబడ్డాడు రవీంద్ర

మీరా ఇంకా ఏడుస్తూనే వుంది దాన్ని రవీంద్ర మరోలా అర్థం చేసుకున్నాడు "నా మాటలు నువ్వు నమ్మటంలేదు కదూ? నిజం మీరా! నువ్వుకాకుండా, నీకు తెలియకుండా, నాకు స్నేహితులు, ఆత్మీయులు ఎవ్వరూ లేరు" అనునయంగా అన్నాడు

"ఉహూ అది కాదు రవీ! నువ్విలా మనశ్శాంతి కోసం ఇల్లు వదిలి పార్కులవెంట తిరిగి ఒంటరిగా బాధ పడటానికి కారణం నేనే కాదూ?"

"ఛ! అదేం కాదు ఈ సమస్య ఇంతే మీరా! ఆస్తి, అంతస్థులు అన్నవి ఏర్పడిన తర్వాత, మనుషులు, ఆత్మీయులయినా సరే, ఒకరి నుండి ఒకరు దూరం కావటం తప్పదు "

"ఉహూ మీరు చెప్పింది సరికాదు మనసంటూ వుంటే మార్గం ఉండి తీరుతుంది నాకు తెలుసు మారిపోయింది నేనే డబ్బు పిచ్చితో నా కళ్లు మూసుకుపోయాయి, ఇన్నాళ్లూ నన్ను క్షమించరూ? మళ్ళీ మనం మునుపటిలా, మీరు చిన్న ఉద్యోగం చేస్తూ, ప్రతీరోజూ పావలా పూలు తెచ్చి నా తల్లో తురిమే రోజుల్లోలా ఉందామండీ!" అని అడుగుతున్న మీరాని చూస్తోంటే, ఆమెనలాగే ఎత్తుకుని, గాలిలో తేలిపోవాలనిపించింది రవీంద్రకి

"ఏయ్ పిచ్చీ! ఏమిటిది, చెప్పులు కూడా వేసుకోకుండా వొచ్చేశావా? పద, నిన్నిలాగే ఎత్తుకుని వెళ్ళి కార్లో కూచోబెడతాను" అంటూ ఆమెనలాగే గుండెలకి హత్తుకున్నాడు రవీంద్ర ★

విద్యార్థిలోకం వ్యాసరచన పోటీలో రెండవ బహుమతి రు. 750/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

ఆశయాలు అనేవి అందరికీ ఉంటాయి ఉండి తీరాలి ఆశయం లేకపోతే జీవితానికి అర్థం లేదు అమసరణీయమైన, నైతిక విలువలుగల, ఆశయాలు ఉత్తమ విద్య ద్వారా ఉత్పన్నమవుతాయి

విద్య అనునది సంస్కృతి, నాగరికతల అభివృద్ధి కాంక్షించే ప్రక్రియ మన భారత దేశంలోని విద్యా విధానం అంతర్గతంగా లోప భూయిష్ఠమై ఉన్నా, బయటకు చూడటానికి మాత్రం క్రమబద్ధంగానే గోచరిస్తుంది "మేడి పండు చూడ మేలిమై ఉండు" అనే సామెత ఇక్కడ బాగా సరిపోతుంది

ఇటు కళాశాలల్లో కాని, అటు విశ్వ విద్యాలయాలలో కాని విద్యా విధానం విద్యార్థులకు అవుసరమైన విజ్ఞానాన్ని ప్రసాదించి, వారి జీవితానికి, జీవిత పరమావధికి కల అవినాభావ సంబంధాన్ని ప్రతిబింబిస్తూ, వారి జీవితం సత్యంగాను, సక్రమంగాను నడిపించే రీతిగా లేదు కాకపోతే ఉద్యోగం సంపాదించడానికి ఒక అర్హతా పత్రంగా మాత్రము ఉపయోగపడుతుంది అంతేకాక ఈ డిగ్రీలతో సంపాదించే ఉద్యోగము మనిషిలో ఏదైనా సృజనాత్మకమైన మార్పును తీసుకువస్తుందా ? అనే విషయాన్ని పరిశీలించిన "లేదు" అని చెప్పవలసి ఉంటుంది విద్యారంగంలో పరోక్షమైన కేంద్రీకృత వ్యవస్థ దీనికి కారణం తనకుగా ఒక విధమైన వ్యక్తిత్వాన్ని సంపాదించుకోవాలి అని తపనపడే వానికి అడుగడుగునా అడ్డంకులే ఇంకా చెప్పాలంటే ఒక వ్యక్తిలో చురుకుదనం, తనంతట తాను ముందుకు వచ్చి ఏదో ఒక కొత్త విషయము కనిపెట్టాలని, క్రొత్త పంథను అనుసరించాలని ఆశయాలు ఉండి ఆ ఆశయాలు దేశ పునర్నిర్మాణానికి, దేశ ఔన్నత్యానికి తోడ్పడగల్గి వుండాలి అయితే మన విద్యా విధానం ఈ పరిస్థితులకు చాలా వ్యతిరేకంగా ఉన్నది మన విద్యా విలువలు నానాటికీ క్షీణిస్తున్నాయి ఈ విద్యా విధానం ఇలాగే మరి కొంతకాలం కొనసాగితే మనం ఎదుర్కోవలసిన క్రొత్త సమస్యలు అనేకం ఉద్భవించడానికి హేతువు అవుతుంది

అన్ని రంగములలోను ఉపయోగించునటు వంటి "స్వయం ఉపాధి" పథకాలను రూపొందించి తద్వారా తాను నేర్చుకొన్న విషయాలతో జీవితములో ఉత్పన్నమయ్యే సమస్యలను పరిష్కరించి, మంచి ఫలితాలను పొందవచ్చు

గ్రామీణ ప్రజలలోని మూఢాచారాలను, కట్టుబాట్లు అనే మూఢ నమ్మకాలు తొలగించే ఆవశ్యకత ఎంతైనా ఉంది దీనికి విద్యార్థులే నడుం కట్టాలి కొంతమంది గ్రామీణులు సౌకర్యముల కొరత కారణముగా వస్తున్న అవకాశాల్ని వృత్తి ఉద్యోగాల్ని నిర్వహించుకొనుటలో ఆధిపత్యం వహింపలేకున్నారు

పగలు కష్టపడి పనిచేయు కార్మికులకు, కర్షకులకు విద్యార్థులు, ఉపాధ్యాయులు, రాత్రి పాఠశాలలను (వయోజన విద్య కేంద్రములు) నెలకొల్పి, వాటిని కొనసాగించడం వంటి ఉద్యమాలను చేపట్టి మన విద్యా విధానాన్ని పునర్వ్యవస్థీకరించడానికి ఇంకా గట్టి కృషి జరగాలి ఇలా విద్యారంగంలో గణనీయమైన మార్పును తీసుకొని రావడం మన గ్రామీణ, సాంఘిక, ఆర్థిక ప్రగతికీ దోహదం చేస్తుంది –

మనదేశంలో ఉద్యోగాలకు ఎంపిక చేయడంలో యూనివర్సిటీ డిగ్రీ ఒక కొలబద్దగా తయారయింది ఈ విషయంలో కూడా విప్లవాత్మకమైన మార్పు రావాలి ఒక వ్యక్తికి ఉద్యోగం ఇవ్వడం విషయంలోకాని, లేక అతనిని పై ఉద్యోగానికి పంపడానికికాని ఇటువంటి డిగ్రీలు మాత్రమే అర్హతా పత్రములుగా భావింపక వారి వారి వ్యక్తిగత శక్తి యుక్తుల్ని పరిశీలించే అనేక పరీక్షలను పెట్టాలి పని నైపుణ్యాన్ని నిర్ణయించే పరీక్షల ద్వారా ఆ వ్యక్తుల సామర్థ్యాన్ని, వారి కార్యదక్షతను తెలుసుకోగలుగుతాం

మన దేశంలో నూటికి నూరుపాళ్లు దిగువ స్థాయిలో స్వేచ్ఛా విద్యా విధానం విజయాన్ని సాధించేవరకు పాఠశాలల సంస్కారానికి ఎక్కువ ప్రాధాన్యత ఇవ్వకూడదు విద్యా సంస్థల సంఖ్య కన్న విద్యా విధానపు శ్రేష్ఠతలో మార్పు రావాలి ఏ శాస్త్రమైనా కానివ్వండి, ఆ శాస్త్రాల అధ్యయనం సామాజిక స్పృహనూ సామాజిక జీవనంలో చైతన్యాన్ని కలిగించి, సమాజాభివృద్ధి కార్యక్రమాలకు దోహదం చేసేదిగా ఉండాలి కాని ఈ విషయంలో ప్రభుత్వం గణనీయమైన మార్పును తీసుకురాలేకపోతుంది వివిధ విద్యాంశాలలో నిష్ణాతులైనవారిని ఒకచోట చేర్చి మన దేశంలోకాని, ఇతర దేశాలలోకాని ఇటీవల జరిగిన ప్రముఖ సంఘటనల్ని పరిశీలింపచేసి, అందలి లోపములను నిర్మూలించి తద్వారా అభివృద్ధి కార్యక్రమాన్ని రూపొందించి, ఆ కార్యక్రమాన్ని వివిధ, సాంఘిక, భౌతిక, రసాయనిక శాస్త్రాలయందు అమష్ఠానీయంగా చేయుట జరగాలి

సాంకేతికనిపుణులు మహానగరాలలోని ఆకాశ హర్మ్యాలలో, ఎయిర్ కండిషన్డ్ గదుల్లో కూర్చుని గ్రామ జీవితానికి జీవనాడి వంటి ఎద్దుల బండిలో విప్లవాత్మకమైన, శాస్త్రీయమైన మార్పును తీసుకురావాలి అనుకోవడం అవివేకం అలా కాకుండా మన ఇంజనీర్లు, శాస్త్రవేత్తలు గ్రామీణ జీవితానుభవం ప్రాతిపదికగా కార్యక్రమాలను రూపొందించడం జరగాలి అట్టి కార్యక్రమాల నిర్వహణద్వారా సామాన్య పౌరుడు కూడా ఉత్సాహంగా ప్రగతి పథంలో ముందడుగు వేయాలి ప్రస్తుతం మన విద్యాలయాలలో నేర్పబడే నైపుణ్యం ఒక విధంగా చెప్పాలంటే వారికి భవిష్యత్తులో ఏ విధంగాను ఉపయోగపడేవిగా లేవు అందువలన మన ఉపాధ్యాయులందరికి నైపుణ్యాభివృద్ధిని కాంక్షించే శిక్షణా తరగతుల ద్వారా వారిలో నైపుణ్యాన్ని, వృత్తి ప్రాతిపదికగాగల శీల సామర్థ్యాన్ని పెంపొందించాలి

కాంక్షనీయమైన శిక్షణకు విద్యార్థులు మనస్ఫూర్తిగా కృషి చేయాలి శిక్షణ, బోధనలలో సమన్వయం సాధించాలి అభివృద్ధి అనేది ప్రస్తుతం ఉన్న వ్యవస్థ సర్వదా లోపరహితం చేసి వ్యాప్తి చేయడానికి దోహదం చేస్తుంది ఇలా వ్యాప్తి చేయడానికి దక్షత, కార్యశూరత, ధైర్యసాహసాలు కల విద్యార్థులద్వారా మాత్రమే సాధ్యమవుతుంది *

## రచయిత పరిచయం



"పేరు నరేష్‌కుమార్, పాట్నీడి, జననం 5–3–1966 వయస్సు 16 సం॥, పుట్టినది హైదరాబాదులో, నివాసం కాకినాడ, తల్లిదండ్రులు పాట్నీడి సత్యనారాయణమూర్తి, నాగమణి గార్లు, చదువు బి యస్సీ మొదటి సం॥, పిఠాపురం రాజా ప్రభుత్వ కళాశాల, కాకినాడ, మా తాతయ్యగారు (బి హెచ్ ఆర్ శేషగిరిరావుగారు, అడ్వకేటు) ప్రోత్సాహముతో రాసిన ఇది నా మొట్టమొదటి రచన, అభిరుచులు శ్రీశ్రీ కవితలనిన మక్కువ హాబీలు పత్రికా పఠనం, చిత్రలేఖనం, స్నేహితులతో చర్చలు మొ॥వి"

— నరేష్‌కుమార్. పి.




### వి పి — హైద్రాబాద్

నా వయస్సు 15 సం॥లు నా ముందరి పళ్ళు వంకరటింకరగా ఉంటాయి దంతవైద్యుని కలసికొని వైర్లు, క్లిప్పులు పెట్టించుకొనుట వలన మామూలుగా వచ్చుటకు సాధ్యపడుతుందా ?

★ వైర్లు, క్లిప్పులు వాడినంత మాత్రాన బాగా వంకరటింకరగా ఉన్న పళ్ళు సరికావు ఆ సందర్భంలో స్థలా భావాన్ననుసరించి కొన్ని దంతాలను తీసివేసి అందువల్ల ఏర్పడే ఖాళీని భర్తీ చేయటానికి వైర్లుగాని క్లిప్పుగాని వాడటం జరుగుతుంది మీరు నిపుణులైన ఆర్థోడాంటిస్టులను కలుసుకొని సంప్రదించండి

### డి. వి. — ఖమ్మం

నాకు మూడు సం॥ల క్రితం నాలుకమీద పుట్టుమచ్చల లాంటివి అనేకం వచ్చాయి వీటివలన నాకు ఇప్పటివరకు హాని జరుగలేదు ఈ మచ్చలు ఎలా పోతాయి ?

★ కొందరికి ఈ మచ్చలు పుట్టుకతోనే రాగలిగినా, అవిబహిర్గతం అవటం మాత్రం ఏ వయస్సులోనైనా జరుగవచ్చును ఈ మచ్చలు మందులకి లొంగవు కొందరికి కడుపులో హూక్ వర్మ్‌లు చేరటం వల్ల నాలుకమీద మచ్చలు ఏర్పడే అవకాశం ఉన్నది ఈ క్రిములు ఉన్నదీ లేనిదీ మల పరీక్ష వరుసగా నాల్గుసార్లు (రెండు, మూడురోజుల కాల వ్యవధిలో) చేయించుకొంటే తెలుస్తుంది ఈ క్రిములకిగాను చికిత్స చేయించుకొంటే మచ్చలు పోయే అవకాశం ఉంటుంది

### పి. ఎస్. — కడప

నా వయస్సు 25 సం॥లు ఇప్పుడు నాకు 7 నెలలు మూత్రం వచ్చే భాగాన ఎక్కువ దురదగా ఉన్నది చాలాసేపు గీరాలనిపిస్తుంది బొబ్బలు కూడా ఏర్పడతాయి చాలా బాధగా ఉంటుంది ఇలా రావటానికి కారణం ఏమిటి ? తగ్గాలంటే ఏ మందులు వాడాలి ?

★ జననేంద్రియ భాగం మలంతో కలుషిత మవటం వల్ల ఇలా జరిగే అవకాశం ఉంటుంది మలంలో నులిపురుగులు (త్రెడ్‌వర్మ్స్) ఉన్నా ఇలా దురదలు పుడతాయి మలపరీక్ష, మూత్రపరీక్ష చాలా అవసరం ప్రతిరోజూ రెండుసార్లైనా డెట్టాల్ నీళ్ళలో కలిపి, ఆ నీళ్ళతో జననేంద్రియ భాగాలను తుడవటం మంచిది లోనికి అవిల్ లేక పిరిటాన్ మాత్రలు వాడవలసి ఉంటుంది ఇన్‌ఫెక్షన్ ఉంటే యాంటీ బయాటిక్‌లు వాడాలి

### టి టి. ఆర్. ఎం ఆర్. — చివవులివ్రు

నా కళ్ళకి లాంగ్ సైట్ ఉన్నది సంవత్సరం క్రితం కళ్ళజోడు పెట్టుకున్నాను కళ్ళజోడు 1 గంటకన్నా ఎక్కువసేపు పెట్టుకొంటే ముక్కు దగ్గర మంటగా ఉంటుంది గేమ్స్ ఆడాలంటే కుదరటంలేదు కాంటాక్టు లెన్స్ వాడవచ్చునా ? దాని మూలంగా కంటికి హాని కలుగుతుందా ? నా వయస్సు 17 సం॥లు

★ తప్పకుండా కాన్‌టాక్ట్ లెన్సు వాడవచ్చును వీటివల్ల కంటికి హాని కలుగదు

### జి. ఎస్. పి. — హైదరాబాద్

నా వయస్సు 30 సం॥లు నేను చాలా కాలంగా బైలాటరల్ బ్రాంకియెక్టేసిస్‌తో బాధ పడుతున్నాను నాకు చిన్నప్పటినుంచి దగ్గు ఆయాసం ఉన్నది దానితోడు కఫం పడుతూ ఉండేది 1976 నుంచి విపరీతమైన ఆయాసం, ఎక్కువగా కఫం రావటం జరుగుతున్నది ఎన్నో మందులు వాడినా ఫలితం లేదు ?

★ కొన్ని కేంద్రాలలో ఇలా బ్రాంకియెక్టేసిస్ ఊపిరితిత్తులలోని ఒక భాగం (లోబ్)లో మాత్రమే ఉంటే ఆ భాగాన్ని శస్త్రచికిత్స ద్వారా తీసివేయటం జరుగుతుంది

మామూలుగా అయితే, పాస్చురల్ డ్రెయినేజ్ మూలంగా కఫాన్ని బహిర్గతం చేయటానికి ప్రయత్నిస్తారు లోనికి మందులు వాడటం జరుగుతుంది

### ఓ ఎస్. — కొవ్వూరావు వగర్

నాకు ఇన్‌ట్రామెడుల్లరీ ఫైబ్రోమా వీపు భాగంలో ఉంటే ఆపరేషన్‌చేసి 2½ సం॥లు అయింది 1½ సం॥లు ఎక్సర్‌సైజు ఏమీ చేయకుండా మంచంలో ఉండవలసి వచ్చింది 1 సం॥ నుంచి మాత్రం ఎక్సర్‌సైజు చేస్తున్నాను కాళ్ళలో ఇప్పుడు మెల్లగా మార్పులు వస్తున్నాయి స్పర్శ పూర్తిగా రాలేదు నేను లేచి నిలబడగలనా ? కాలి మీద వచ్చే బొబ్బల నుండి పూర్తిగా కోలుకొనే మార్గం ఏమిటి ?

★ ఫైబ్రోమా అనే కంతి నరాలమీద తెచ్చిన వత్తిడివల్ల కాళ్ళు స్వాధీనం తప్పటం జరిగింది ఈ కంతిని తీసివేసిన తర్వాత కాలక్రమేణా కాళ్ళు యధాస్థితికి వచ్చే అవకాశం ఉంటుంది కాలిమీద ఏర్పడే బొబ్బలు, ఎక్కువ కాలం కాళ్ళ కదపకుండా ఉంచటం వల్ల వచ్చినవే ప్రతిరోజు కాళ్ళ పొజిషన్ మార్చటం, కాళ్ళను సబ్బునీళ్లతో తుడిచి పౌడర్ మొదలయినవి రాయటం అవసరం ప్రస్తుతం ఉన్న బొబ్బలకి డ్రస్సింగ్‌చేయటం, లోనికి యాంటీ బయాటిక్‌లు వాడటం అవసరం ★

విశిష్టమైన వ్యక్తి యొక్క,
విశిష్టమైన అభిరుచి...'ప్లెయిన్' షర్టింగ్ మాత్రమే.

MODEL COURTESY AIR-INDIA

అంటే పాలియెస్టర్ మరియు పాలియెస్టర్ బ్లెండ్
మఫత్‌లాల్ షర్టింగ్!

ఈ వ్యక్తి ఠీవిగా, ఏరికోరుకునేలా రూపొందిన వ్యక్తి. అందుకే డాంబికంగా గాక, ప్రశాంతంగా దీనిని ధరించే వ్యక్తి. ఇలా ఓ ప్రత్యేకమైన వ్యక్తిత్వాన్ని తనంతటతానే సంతరించుకున్న వ్యక్తి.

మఫత్‌లాల్
షర్టింగ్





# జీవన్మృతులు

## ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

## స్వేచ్ఛానువాదం: కొలను వేంకట దుర్గాప్రసాద్

## జోనాథన్ హార్కర్ కథనం: *(షార్టుహాండ్‌లో వ్రాసిన డైరీ)*

బిస్ట్రిట్జ్, మే 3: మే ఒకటో తారీకు రాత్రి 8-35కు మ్యూనిచ్ (పశ్చిమ జర్మనీ) నుండి బయలుదేరి మరునాడు ఉదయం వియన్నా (ఆస్ట్రియా) చేరుకున్నాను. రైలు ఓ గంట లేటయింది గాని, అసలు 6-46 కే చేరుకోవాల్సింది. అక్కడ్నించి బుడాపెస్టుకు (హంగరీ) ప్రయాణం

రైల్లోంచి కొంత, రోడ్డుమీద నడిచి కొంత చూస్తే, బుడాపెస్టు అద్భుతమైన ప్రదేశమనిపిస్తుంది స్టేషన్నుంచి ఎక్కువ దూరం వెళ్ళలేదు, ఎందుకంటే, అసలే రైలు లేటు చేరుకోవలసిన ప్రదేశానికి తొందరగా చేరుకోవాలని తాపత్రయం. దనుబే బ్రిడ్జిమీదనుంచి ప్రయాణం చేస్తుంటే పశ్చిమ దేశాన్ని వదిలేసి తూర్పు దేశం చేరుకున్నట్టు అనిపించింది. మరి అంతేకదా!

రాత్రి అయ్యేసరికి క్లాసెన్‌బర్గు చేరుకున్నాం. ఆ రాత్రి హోటల్ రాయలేలో బస చేసాను పండుమిరపకాయల కారంలో చేసిన కోడిమాంసం నా భోజనం. చాలా బాగుంది. కానీ దాహం అనిపించింది.

ఆ భోజనాన్ని 'పాప్రికా హెందల్' అంటారు పైగా అది ఆ దేశంయొక్క జాతీయ భోజనం అవడంవల్ల కార్పతియన్స్‌లో ఎక్కడైనా అదే దొరుకుతుంది నాకు కాస్త జర్మనీ భాష తెలియడం చాలా ఉపయోగించింది అదేకనక చేతకానట్టయితే, ఇబ్బంది పడేవాడ్ని



లండన్‌లో వున్నప్పుడు కాస్త తీరిక చిక్కింది అప్పుడు బ్రిటిష్ మ్యూజియంకు వెళ్ళాను అక్కడ లైబ్రరీలో పుస్తకాలు, మ్యాపులు వెతికాను ట్రాన్‌సిల్వేనియా గురించి తెలుసుకునేందుకు హంగరీ తూర్పు వైపున కార్పతియన్ పర్వతాలమధ్య మూడు రాష్ట్రాలున్నాయి అవి ట్రాన్‌సిల్వేనియా, మోల్డేవియా, బుకోవినా కార్పతియన్ తక్కువ మందికి తెలిసిన ప్రదేశం మ్యాపులో డ్రాకులా కోట ఖచ్చితంగా ఎక్కడుందో తెలియలేదు కానీ బిస్ట్రిట్జ పట్టణం ఎక్కడుందో తెలిసింది డ్రాకులా ప్రభువు పెట్టిన పేరు అది ఈ పట్టణం గురించి ఇక్కడ కొన్ని నోట్ చేసుకోవాలి నా ప్రయాణం గురించి మీనాకు కబుర్లు చెప్పేటప్పుడు విషయాలు చెప్పొచ్చు

ట్రాన్స్‌ల్వేనియా జనాభాలో నాలుగు రకాల జాతీయులు కనిపించారు దక్షిణాన, సాక్సనులు,

కంఠముంద వాలాచలు. పశ్చిమాన మాగ్యారులు. తూర్పు, ఉత్తరాన జెక్లీలు. ఇప్పుడు నా ప్రయాణం మాగ్యారులు వుండే చోటుకి.

ప్రపంచంలో వున్న మూఢ నమ్మకాలన్నీ కార్పతియన్స్‌లో వున్నాయని చదివాను. అట్లాంటి చోటుకు నా ప్రయాణం తలుచుకుంటే కాస్త కుతూహలంగానే వుంది.

నా పడక ఏర్పాటు బాగానేవున్నా నాకు నిద్ర పట్టలేదు. ఏవేవిటో కలలు ! రాత్రి తెల్లార్లూ నా పడకగది కిటికీ క్రింద నుంచి కుక్క అరుపు వినిపిస్తూనే వుంది. అది కొంత కారణం అనుకో వచ్చు. నేను తిన్న 'ప్రాపికా' కూడా కొంత కారణం కావచ్చు. ఎందుకంటే, నాకోసం గదిలో అట్టిపెట్టిన నీళ్ళు మొత్తం తాగేశాను. అయినా దాహం తీరలేదు. తెల తెల వారుతుండగా బాగా నిద్ర పట్టేసింది. తలుపు కొట్టిన చప్పుడయినా, చాలాసేపు చెవికెక్క లేదు. నిద్ర లేచాను. మళ్ళీ భోజనంలో వచ్చిన వంటకాలు ప్రాపికా, మైదాపిండిలాంటి దానితో చేసిన జావ—దీన్ని 'మామాలిగ' అంటారు, గుడ్డుతో కలిపి క్రైమా మాంసం, దీన్ని 'ఇంప్లితాల్' అంటారు వాళ్ళు. భోజనం గబగబా ముగించేసాను, ఎనిమిది గంటలకు కాస్త ముందర రైలు వుందని. ఏడున్నర కల్లా హడావుడిగా స్టేషనుకు చేరుకుని రైల్లో కూర్చున్నాను. కానీ ఓ గంట తర్వాతగానీ రైలు కదల్లేదు. తూర్పువేపు వెళుతున్న కొలదీ, రైళ్ళు లేటుగా వెళతాయేమో ననిపించింది.

రోజంతా రైల్లో ప్రయాణం. చుట్టూ ప్రకృతి చాలా అందంగా కనిపించింది. అప్పుడప్పుడూ చిన్నచిన్న పట్టణాలు, చిన్న కొండలమీద కోటలు కనిపించాయి. దార్లో గలగలపారే నదులు, ఆ నదులకు రెండు వేపులా కొండరాతి అంచులు. ప్రతి స్టేషనులోనూ జనమే. వాళ్లల్లో చాలామంది పల్లెటూరి వాళ్ళు. కొంతమంది ఫ్రాన్సు నుంచి, జర్మనీ నుంచి వస్తున్నవాళ్ళు. వాళ్ల దుస్తులు రకరకాలుగా, కంటికి నదరుగా వున్నాయి. ఆడవాళ్లు అందంగా వున్నారుగానీ, వాళ్ల నడుముదగ్గరమాత్రం మోటుగా అనిపించింది. నడుముకి ఏవేవో బెల్టుల్లా బిగించారు. వాళ్లల్లో వింతగా తోచింది 'స్లోవాక్సు' తెగ. వాళ్ళు చాలా మొరటు మనుషులు. పొడుగాటి టోపీ, బాగా వదులైన దుమ్ముకొట్టుకున్న లాగులు,

## జీవన్ మృతులు

తెల్లటి చొక్కా, వెడల్పాటి తోలు బెల్టులు. లాగులు ఎత్తయిన బూట్లలోకి దోపారు. పొడుగాటి నల్లటి జుట్టు, నల్లటి దట్టమైన మీసాలు. ఇదీ వాళ్ల అవతారం. వాళ్లు మొరటుగా కనిపించినా, ప్రమాదమైన వాళ్లు కాదని చెప్పారు.

షేం బిస్ట్రిట్జ్ చేరుకునేటప్పటికి సాయంకాల మైంది. ఆ వూరు చూస్తుంటే ఏదో వరద వచ్చి కొట్టుకుపోయిన దానిలా కనిపించింది. యాభైఏళ్ల క్రితం అయిదుసార్లు పెద్ద అగ్ని ప్రమాదాలకు గురి అయింది. పదిహేడవ శతాబ్దం మొదట్లో అక్కడి కోట ముట్టడి జరిగింది. అప్పుడు 13,000 పోయారు — చాలామంది కరువుతో, అంటు రోగాలతో.

డ్రాకులా ప్రభువు 'గోల్డెన్ క్రోన్' హోటల్లో దిగమని చెప్పాడు. ఆ హోటలు కనిపించింది. చాలా పురాతనమైన కట్టడం అది. అక్కడ కెళ్లేసరికి ఓ ముసలావిడ నవ్వుతూ కనిపించింది. పల్లెటూరి మనిషిలా వున్నాయి దుస్తులు. కాస్త దగ్గరికెళ్లాను. వినయంగా వంగి 'మీరేనా ఇంగ్లీషు మనిషి' అడిగింది. 'అవును. జోనాథన్ హార్కర్' అన్నాను. ఆమె నవ్వింది. అక్కడే వున్న ముసలాయనకు సైగ చేసింది. అతడు ఆమెతోపాటు ఓ తలుపు దగ్గరగా వెళ్లి, వెంటనే తిరిగొచ్చాడు, ఓ ఉత్తరంతో.

మిత్రమా !

కార్పతియన్స్‌కు స్వాగతం.

మీ కోసమే ఎదురు చూస్తూ వున్నాను. ఈ రాత్రికి బాగా నిద్రపోండి. రేపు మూడు గంటలకి బుకోవినాకి బయలుదేరండి. బోర్గోపాస్ దగ్గర మీ కోసం ఒక గుర్రపు బగ్గీ వుంటుంది. అది ఎక్కారంటే, నా దగ్గరకు వస్తారు. లండన్ నుంచి మీ ప్రయాణం హాయిగా జరిగిందని తలుస్తాను. నా దగ్గరకు వచ్చిన తర్వాత ఇంకా సంతోషంగా వుంటారని ఆశిస్తాను.

మీ స్నేహితుడు
డ్రాకులా

మే 4 : నేను దిగిన హోటలువాడికి డ్రాకులా ప్రభువు దగ్గర్నుంచి ఉత్తరం వచ్చినట్టు గమనించాను. అది గుర్రపు బగ్గీలో నాచోటు రిజర్వేషను గురించి. ఇంకా వివరాలు అడిగాను, కానీ అతను నా భాష అర్థం కానట్టు మొహం పెట్టాడు. అప్పటి వరకు నా జర్మన్ భాష అతనికి అర్థమవుతూ వచ్చి, వున్నట్టుండి, అర్థం కానట్టు నటించాడు. తర్వాత ఏర్పాట్లు అన్నీ స్వయంగా చేస్తున్నట్టు చెప్పాడు. ఈ ఏర్పాట్లకు తనకు డబ్బు ముట్టినట్టు, అంతకంటే తనకు ఏమీ తెలియనట్టూ చెప్పాడు. డ్రాకులా ప్రభువు గురించి, అతని కోట గురించి అడిగాను. వాళ్లకి ఏమీ తెలియ దన్నారు. గుండెలమీద చేతులు వేసుకుని దేవుడ్ని తలుచుకున్నారు. వాళ్ళు ఏమాత్రం వివరాలు ఇచ్చేట్టు కనపడలేదు. ఓ ప్రక్కన బయలు దేరే వేళ అవుతున్నది. ఇదంతా ఏదో గందరగోళంగా వుండి నా ప్రయాణం సాఫీగా సాగదనిపించింది.

ఇక నేను బయలుదేరబోతుండగా ముసలావిడ నా గదిలోకి పరుగెత్తుకుంటూ వచ్చింది. 'నువ్వు అక్కడికి వెళ్ళాల్సిందేనా ? చెప్పు, వెళ్ళాలిసిందేనా ?' ఆమె తడబడుతూ జర్మన్ భాషలోనూ, ఇతర భాషల్లోనూ కలిపి గట్టిగా అడుగుతోంది. చాలా కంగారుగా కనిపించింది. ఆమె భాషగానీ, కంగారు గానీ, నాకు అర్థంకాలేదు. చాలా ప్రశ్నలేసాకగానీ, ఆమె మొదట అడిగిన ప్రశ్న అర్థంకాలేదు. చాలా ముఖ్యమైన పనిమీద వెళుతున్నానని, తప్పదనీ చెప్పాను.

'ఈ రోజు ఏవిటో తెల్సా ?' అడిగింది. వారం పేరు చెప్పాను. 'అయ్యో అది నాకు తెల్సు ! కానీ ఇవాళ ఎటువంటి రోజు అనుకున్నావు ?' ఆమె గొడవ అర్థంకాలేదు.

'ఇవాళ సెయింట్ జార్జి పండుగరోజు. ఇవాళ అర్థరాత్రి పన్నెండు కొట్టేటప్పటికి దుష్టశక్తులన్నీ స్వైర విహారం చేస్తాయి అన్నసంగతి నీకు తెలీదా? అసలు నువ్వు ఎక్కడికెళుతున్నావో, ఎందుకెళు తున్నావో తెల్సా ?' ఆమె అంతులేని ఆవేదనతో చెబుతోంది. ఆమెను ఓదార్చటానికి ప్రయత్నించాను. కానీ కుదరలేదు. చివరికామె మోకాళ్ళమీద కూర్చుని ప్రాధేయపడింది 'వెళ్లొద్దు ! పోనీ కనీసం రెండు రోజులాగి వెళ్ళు' అంది. నాకేమిటో చికాగ్గావుంది. నేను ఒక ముఖ్య వ్యవహారంమీద వెళుతున్నాను. ఆ పని అవ్వాలి కదా. నా వ్యవహారంలో ఈ ముసలావిడ తలదూర్చడం ఒప్పుకోలేను. ఆమెను పైకి లేవ నెత్తాను. 'నాకు పనిముఖ్యం. వెళ్లక తప్పదు'






సరికొత్తది! ఇన్‌స్టెంట్ నెస్ స్ప్రే
# 5-క్షణాలలో పాలు

## వేయండి, కలపండి, ఇక ఇవ్వండి అంతే

**తయారు చేయడం ఎంతో సులభం**

ఒక గ్లాసు చల్లని లేక వెచ్చని నీటిలో 3 చెంచాల ఇన్‌స్టెంట్ నెస్‌స్ప్రే వేయండి. కలపండి. 5 క్షణాలలో మీ కోసం ఒక గ్లాసు పాలు సిద్ధంగా వుంటాయి.

**మంచి పోషకాహారము**

ఇన్‌స్టెంట్ నెస్ స్ప్రే 'ఏ' మరియు 'డి' విటమిన్లతో ప్రత్యేకమైన శక్తి కలిగి వుంది. ఇవి, పెరుగుతున్న పాపలకి విలువైన, మీగడతో వున్న, రుచికరమైన పాలు.




## చన్నీళ్ళలో కూడా తక్షణం కరుగుతుంది

CAS/243 TEL

# ఇప్పుడు! ప్రపంచ ప్రసిద్ధమైన పసిమిఛాయ రహస్యం ఇండియాలో!

# క్లియర్-టోన్

ప్రత్యేక దినుసు చర్మానికి తేటను,
పసిమిఛాయను తెస్తుంది-ప్రకృతి సిద్ధంగా.

శాస్త్రీయమైన సూత్రం మచ్చల్నీ,
కళంకాల్నీ తొలగిస్తుంది.



మేలైన సూర్యకవచం చర్మం
నల్లబడటాన్ని అరికట్టుతుంది.

సమృద్ధిగా చెమ్మనిచ్చే పదార్థం
చర్మాన్ని మృదువుగా చేస్తుంది.

## పరిపూర్ణమైన పసిమిఛాయ క్రీం

ప్రపంచమంతటా వివిధ దేశాలలో లక్షలాది సుందరులు క్రమంతప్పకుండా వాడుతున్నారు, **క్లియర్-టోన్**.

అంతర్జాతీయ ఔషధ శాస్త్రపరిశోధనా ఫలితమైన ఈ శాస్త్రబద్ధమైన పసిమిఛాయ సూత్రీకరణను నికొలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్ వారు మీకందిస్తున్నారు.

అంతర్జాతీయ స్వీకరణ పొందిన సూత్రం **క్లియర్-టోన్** మీ చర్మానికి తేటను పసిమి-ఛాయను తెచ్చేందుకు. ఇండియాలో లభించే మరే యితర క్రీంలోనూ లేని ఒక ప్రత్యేక దినుసు కలిగి ఉంది.

**క్లియర్-టోన్** క్రీం మీ చర్మానికి మరింత పసిమిఛాయను తెచ్చేందుకు. మచ్చల్నీ కళంకాల్నీ తొలగించేందుకు ప్రకృతి సిద్ధంగా పనిచేస్తుంది. అందులోని శాస్త్రీయ సూత్రీకరణ హాని కలిగించే అల్ట్రావయొలెట్ కిరణాల నుండి మీకు రక్షణ కలిగించి, మీ చర్మం నల్లబడటాన్ని అరికట్టుతుంది. అంతేకాదు, **క్లియర్-టోన్** మీ చర్మాని కవసరమైన చెమ్మను అతి సున్నితమైన పద్ధతిలో ఇస్తుంది. అతేవామీకై మీరే చూడండి - **క్లియర్-టోన్** క్రమం తప్పకుండా వాడండి. మరి 6 వారాల్లో దాని ఫలితాల్ని చూసి వళ్లు పులకరించి పొండి.



ప్రపంచమంతటా
ప్రఖ్యాతిచెందింది

Clear·tone
the perfect fairness cream
Makes you fairer, keeps you fairer, naturally.
LONDON · PARIS · NEW YORK

కొత్తది

మేలైన సూత్రం
మేలైన చర్య

## పసిమిఛాయ రహస్యం-ప్రకృతి సిద్ధంగా క్లియర్-టోన్

లండన్. పారిస్. న్యూయార్క్.

daCunha/NICL/3/81-TL

## విద్యార్థి లోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు.150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

భావి నిర్ణేతలగు విద్యార్థులు సహజముగ ఉన్నత ఆశయములను కలిగియుండి వానిని నెఱవేర్చుకొనుటకు సక్రమ మార్గమున ప్రయత్నములు సాగింతురు కానీ ఈ ఆశయాల ఒరవడిలో ఎన్నెన్నో అడ్డంకులు కలవు, కానీ వానికి ఆచరణ యోగ్యమైన పరిష్కారముయినూ కలవు

మెకాలే ప్రవేశపెట్టిన విద్యావిధానమే నేటికినీ అమలులోనున్నది. ఈ విధానము కేవలము విద్యాధికుల సంఖ్యను పెంచుటకే ఉపయోగపడుచున్నది. సంవత్సరం పొడుగునా రోజుకు అయిదు గంటలు తరగతి గదిలో నేర్చిన చదువును మూడు గంటలలో పరీక్షించుటవలన విద్యార్థి యొక్క జ్ఞాపకశక్తికి మాత్రమే ప్రాధాన్యత నిచ్చుచున్నట్లగుచున్నది. మఱియు ఈ విధానము విద్యార్థికి భృతిని కల్పించుటలేదు.

మన దేశములో విద్యావసతులు సంపూర్ణముగా లేవు. అనేక గ్రామ, పట్టణ ప్రాంతములలో ప్రాథమిక, సెకండరీ స్థాయిలలో సరియైన బోధన ఇవ్వబడడంలేదు. విద్యార్థి ఉచ్ఛ భవిష్యత్తుకు పునాదియగు ఈ తరగతులందు విద్యార్థికి శిక్షణ చాలడంలేదు. కళాశాల స్థాయిలో సరియైన పరిశోదనశాలలు లేకపోవుటచే శాస్త్ర, సాంకేతిక రంగములలో కృషి చేయ నాశించిన విద్యార్థులకు సమస్య వచ్చుచున్నది

విద్యను బోధింపవలసిన ఉపాధ్యాయులు నిర్లక్ష్య వైఖరిని అవలంభించుచున్నారు ప్రైవేట్లను, గైడ్లను నిర్వహించి ఫక్కా వ్యాపారస్తులుగా మారినారు ఉన్నత విద్య నభ్యసింప నాశించిన విద్యార్థుల ఆశయములను నిలువున నఱికివేయుచున్నారు

పవిత్రమైన 'విద్యారంగము'ను 'భాగ్యలక్ష్మి రంగము'గా మార్చివేయుట ఈ రంగమునందు మరియొక్క అవరోధము 'డొనేషన్స్' విధానమును ప్రవేశపెట్టి తెలివైన పేద విద్యార్థుల అభివృద్ధికి ఆనకట్ట వేయుచున్నారు

విద్యయందు కూడ రాజకీయ నాయకుల ప్రభావము పడినది విద్యా ప్రణాళికలందును, అధికారుల దైనందిన చర్యలలో రాజకీయ నాయకుల అనవసర జోక్యం గర్హనీయం దీనివలన అనర్హులైన కొంతమంది పలుకుబడి గల విద్యార్థులు తమ ఆశయములను సులభముగా నెఱవేర్చుకొనుచున్నారు స్వార్థ రాజకీయ నాయకులు కుల, మత, ప్రాంతీయ విభేదములను సృష్టించి, విధ్వంసక చర్యలకు విద్యార్థులను ప్రోత్సహించి, వారి మనస్సులను కలుషితం చేసి, వారి ఆశయాల భవంతిని పునాదులతో కూల్చివేయుచున్నారు ఉద్యోగములు పలుకుబడి, ధనములచే లభించుటచే "విద్యార్థి లోకం" నిరాశపడుచున్నది మన ప్రభుత్వము వారి "కేటాయింపు" పద్ధతి ఆర్థికముగా వెనుకబడిన కొంతమంది ఉన్నత కులస్థులగు విద్యార్థులకు లభింపక, వారి ఆశయములను ధనలేమిచే నెఱవేర్చుకొనలేక నిరాశ నిస్పృహల మధ్య కొట్టుకొనుచున్నారు

పైన పేర్కొన్న విద్యార్థి లోకం సమస్యలకు ఆచరణయోగ్యమైన పరిష్కారములు లేకపోలేదు

మన విద్యావిధానమునందు విద్యార్థికి ఉపాధి కల్పించు వృత్తి, సాంకేతిక విద్యలను ముఖ్యముగా ప్రవేశపెట్టవలెను ఆంగ్లము, తెలుగు సాహిత్యము కంటే వ్యాకరణము, వ్యాసరచన మున్నగు అంశములకు ప్రాధాన్యమునిచ్చి 'సివిల్ సర్వీస్'లలో చేరనభిలషించిన విద్యార్థులకు సహాయకారిగా ఉండవలెను పరీక్ష విధానము కూడ జ్ఞాపక శక్తికి కాక, మెదడును పదును చేయునదిగా నుండవలెను ఉద్యోగములు కూడ విద్యార్థి మేధస్సునుబట్టి మాత్రమే నీయవలెను మన విద్యార్థులకు ప్రాథమిక, సెకండడీ స్థాయిలలో మంచి శిక్షణ నీయవలెను కళాశాల స్థాయిలో మంచి పరిశోధన శాలలను ఏర్పరచి, శాస్త్ర రంగమునందాసక్తి ఉన్న విద్యార్థులను ప్రోత్సహించవలెను

ఉపాధ్యాయులు తమ వృత్తిని పవిత్రమైనదిగా భావించి విద్యాదానము చేయవలెను గైడ్సు, ప్రైవైట్లు మొదలగు అడ్డదారులను అనుసరించి, జ్ఞానము నార్జింపవలెనను తపన ఉన్న విద్యార్థుల ఆశయమును నరికివేయరాదు

ప్రభుత్వమువారు 'డొనేషన్స్' విద్యా సంస్థలలో తెలివైన పేద విద్యార్థులు చేరుటకు అనుమతి నీయవలెను (కేటాయింపు నీయవలె)

విద్యారంగమునందు రాజకీయ నాయకులు అనవసర జోక్యము కలుగచేసికొనరాదు దీనికి విద్యార్థులందరూ మనస్ఫూర్తిగాను, ఐక్యముగాను కృషి చేయవలెను

మన ప్రభుత్వమువారు 'కేటాయింపు' (రిజర్వేషన్స్) పద్ధతిని కేవలం కుల ప్రాతిపదిక మీదనే కాకుండ, ఆర్థిక స్థితినిబట్టి కూడ నిర్ణయింపవలెను

విద్యారంగమునందు మేము ఎదుర్కొంటున్న గడ్డు సమస్యలకు నేను సూచించిన పరిష్కారములను అనుసరించుటలో విద్యార్థులు సంయుక్తముగా కృషి చేసిన, "విద్యార్థి లోకం" తమ "ఆశయము"లను త్వరితగతిన నెఱవేర్చుకొనగలదు *

### రచయిత పరిచయం



"పేరు ఎన్ ఎస్ కృష్ణ,
తృతీయ బి ఎస్‌సి (ఎమ్ పి సి)
జననం 3–5–1963, విశాఖపట్నం
తండ్రి శ్రీ ఎన్ జె రావు,
జిల్లా మలేరియా శాఖాధికారి
గుంటూరు
ప్రస్తుత నివాసం కడప (ప్రభుత్వ కళాశాల హాస్టల్)
హాబీలు వివిధరకములైన పత్రికలు చదవడం, క్రికెటు కామెంటరీ వినడం

ఇంతకుముందు ఎన్నోసార్లు ఎన్నెన్నో బహుమతులు విద్యారంగంలో వచ్చినప్పటికీ, పత్రికా ముఖంగా బహుమతి సాధించడం ఇదే ప్రథమం

నా విజయానికి ప్రోత్సాహమిచ్చినది మా కుటుంబ సభ్యులు వారికి నేను ఎల్లప్పుడును కృతజ్ఞుడనే"

— ఎన్. ఎస్. కృష్ణ.

## జీవన్ మృతులు

బండి చాలా దూరం వెళ్ళి ఒక మలుపు తిరిగి తిన్నగావున్న రోడ్డు ఎక్కింది కాసేపు అయిన తర్వాత అనిపించింది, మా బండి అక్కడక్కడే చుట్టూ తిరుగుతోందని, ముందుకు సాగడంలేదని కొన్ని గుర్తులు పెట్టుకొని పరిశీలించాను నా ఆలోచన నిజమేనని తోచింది. 'ఇదంతా ఏవిటి' అని అడుగుదామనుకున్నాను గానీ, భయం వేసి వూరుకున్నాను అగ్గిపుల్ల వెలిగించి, ఆ వెలుతురులో నా గడియారం చూసాను కొద్ది నిముషాల్లో పన్నెండు అయ్యేట్టు వుంది ఇప్పటివరకు అనుభవం అయిన దాన్ని బట్టి చూస్తే, నాకు కొంచెం దడపట్టుకుంది పన్నెండు అయితే ఏమవుతుందోనని ఊపిరి బిగబట్టి కూర్చున్నాను

(ఇంకా వుంది)

# మరపురాని అభిమానులు

"నన్నొకసారి అభిమానులు హడలగొట్టేశారు... ఆ విషయాన్ని ఎన్నటికీ మరచిపోలేను," అంటూ సంగీత ఇలా వివరించింది :

"శంఖో — మౌరి" (శంఖము — సన్నాయి) అనే ఒరియా చిత్రం ఔట్‌డోర్ షూటింగును కోరాపుట్‌కు దూరంగా కొండల ప్రాంతంలో ఏర్పాటు చేశారు కొంత దూరం కీకారణ్యంలో జీప్‌లో వెళ్లి, ఆ లొకేషన్‌కు చేరుకోవాలన్నమాట జెయ్‌పూర్ నుంచి బయలుదేరే ముందు కొందరు అభిమానులు నన్ను హడలగొట్టేశారు "అబ్బా! ఆ అడవుల్లో— కొండల దగ్గర షూటింగా? మీరు తిరిగి రాగలరనే నమ్మకం మీకుందా? అక్కడంతా అర్ధనగ్నంగా తిరిగే ఆదివాసులు సంచరిస్తూంటారటండీ వాళ్ళనుచూసి మీరు ఏ మాత్రం నవ్వినా— అంతే ఏ మూలనుంచో విషపు బాణాలు రివ్వున దూసుకువచ్చి, మీ శరీరంలో దిగబడిపోతాయి ఇక, అంతే సంగతులు వాళ్ళు పచ్చిమాసం తింటారట అంతా రాతియుగపు అలవాట్లేనట!" ఇలా తలా ఒక్కో విధంగా చెప్పారు నాకు కాస్త భయం కలగకపోలేదు "మీరెప్పుడైనా అటుకేసి వెళ్లారా?" అని అడిగాను వాళ్ళను "వెళ్ళి ఉంటే, ఇప్పుడిలా మీ ఎదుట మాట్లాడేవాళ్లమా? ఆ అదివాసులకే బలి అయిపోయి ఉండేవాళ్ళం," అని ఒకరు సమాధానం చెప్పారు నాకేం పాలుపోలేదు ఎటూ ఇంత దూరం షూటింగ్‌కని వచ్చేశాం నిర్మాతలు ఎంతో ఖర్చుపెట్టి, ఔట్‌డోర్ షూటింగ్‌కు అన్ని ఏర్పాట్లూ చేసేశారు ఏది ఎలా జరగాలని ఆ విధి రాసివుంటే అలా జరిగితీరుతుంది హీరోయిన్‌గా నా రెండవ ఒరియా చిత్రమూ, ఆఖరి ఒరియా చిత్రమూ బహూశా ఇదేనేమో— అనుకుంటూనే జీప్ ఎక్కాం నా గుండె ధైర్యానికి అక్కడున్న అభిమానులంతా గుడ్లప్పగించి చూస్తూండిపోయారు

లొకేషన్ సమీపించేకొద్దీ నా గుండె వేగంగా కొట్టుకోసాగింది అదంతా బాగా వెనుకబడిన ప్రాంతం ఆ ఆదివాసులు అక్కడక్కడ గుంపులుగా సంచరిస్తూ కనిపించసాగారు ఒంటిమీద బట్టలకు బదులు పూసలతో కప్పుకొని ఉన్నారు ముఖాలకంతా పచ్చబొట్లు చేతుల్లో ఈటెలు భయంకరంగానే కనిపిస్తున్నా— జీప్ పక్కనే వాళ్ళ పాటికి వాళ్ళు వెళ్లిపోతున్నారు ఒకచోట దారికి అడ్డుగా బండలు పడి ఉంటే, వాటిని వాళ్ళే పక్కకు దొర్లించి— జీప్ వెళ్ళడానికి వీలుకలిగించారు నాకెంతైనా ఆశ్చర్యం వేసింది "ఏమిటీ? వీళ్ళు మంచివాళ్ళులా కనిపిస్తున్నారు కాని బయలుదేరే ముందు అక్కడ ఆ ఫాన్స్ అంతగా వీళ్ళ గురించి గాభరా పెట్టేశారేమిటీ?" అని నేనంటే, జీప్‌లో ఉన్న నిర్మాత తాలూకు మనిషి "వీళ్ళ గురించి అక్కడంతా ఇలాగే అనుకుంటూ, భయంతో ఈ ప్రాంతాలకు ఎవరూ రారు ముందు మేం కూడా భయపడ్డాం అయినా తెగించి, తీరా లొకేషన్ సెలెక్ట్ చేసుకోడానికి ఈ ప్రాంతాలకు వచ్చినప్పుడే, ఈ మొరటోళ్ళు హాని చేసేవాళ్ళు కాదనిపించింది లేకపోతే ఈ పరిసరాలలో షూటింగ్ ఏర్పాటు చేయగలమా? మీరేమైపోతారో అని ఆ అభిమానులు అంతగా భయపడి, మీకలా హెచ్చరిక చేశారు దీన్నిబట్టి, ఆ అభిమానుల హృదయాలలో మీకెంతటి స్థానముందో వ్యక్తమౌతోంది," అన్నారు అప్పటికి గాని నా గుండె తేలిక పడలేదు

మేమక్కడ ఉన్నంతవరకు ఆ ఆదివాసుల వల్ల యూనిట్‌లోని ఎవ్వరికీ ఏ విధమైన హాని జరగలేదు వాళ్ళు రెండు మూడుసార్లు షూటింగ్ చూడ్డానికి వచ్చారు కూడా వాళ్ళపాటికి వాళ్ళు దూరంగా నిలుచొని ఏవో సైగలు చేసుకుంటూ గుసగుసలాడుకునేవారు ఒకసారి డైరెక్టర్ కోరికమీద వాళ్ళలో కొందరు షూటింగ్‌లో పాల్గొన్నారుకూడా మూడవ రోజున అనుకుంటా — వాళ్ళలో షర్టు, పైజామా ధరించి కాస్త నాగరీకుడిలా ఉన్న ఓ వ్యక్తి కనిపించాడు అతగాడు నా దగ్గరికి వచ్చి, "మీరు 'ముత్యాల ముగ్గు' సినిమాలో నటించారు కదండీ? నేను విజయనగరంలో చూశాను అందులో మీరు సీతమ్మ తల్లిలా ఉన్నారు," అన్నాడు నేను థాంక్స్ చెప్పిన వెంటనే అతను వెనుతిరిగి వెళ్లి, వాళ్ళ జాతివాళ్ళతో ఏదో చెప్పాడు వాళ్ళు అమాంతంగా చేతుల్లోని విల్లులను కిందపడేసి, అక్కడ్నుంచే నాకు నమస్కరించారు నాకేం బోధపడక నేనూ నమస్కరించా దాంతో వాళ్ళు అమితానందంతో విల్లులను మళ్ళీ చేతబట్టి డాన్స్ చేయిసాగారు వాళ్ళవంకే చూస్తూండిపోయారు యూనిట్‌లోని వారంతా కాస్సేపు షూటింగ్ ఆపుచేసి

ఇక, అక్కడ షూటింగ్ ముగించి, మేం బయలుదేరే రోజున ఆ ఆదివాసుల విచారం ఇంతా అంతా కాదు కొందరు కన్నీళ్ళతో మమ్మల్ని సాగనంపారు వాళ్ళ నాయకుడు నాకు తేనె, జీడిపప్పు

"ఆదివాసుల ఆదరాభిమానాలు మరువలేనివి"





''అడవులిగోరు వల్ల మేలు ...''

కానుకగా ఇచ్చారు ఎంత మొరటుగా కనిపించినా — వాళ్ళ హృదయాలు ఎంత మెత్తనివో! అనిపించింది

నేను జీప్‌లో జెయ్‌పూర్ చేరుకోగానే నా ఫాన్స్ నేను తిరిగొస్తానో రానో తెలుసుకోడానికి ఆత్రుతతో ఎదురు చూస్తున్నట్లుంది నేను కనిపించగానే ''హమ్మయ్య! షూటింగ్ కార్యక్రమాలు ముగిశాయా? ఆ కొండజాతివాళ్ళవల్ల మీకే కీడూ జరగలేదు కదా? మీరు తిరిగొస్తారని మేం అనుకోలేదు సుమండీ! అయినా, మీకెంత ధైర్యమండీ! అసలు మీకా కొండజాతివాళ్ళు కనిపించ లేదా?'' అంటూ ప్రశ్నల వర్షం కురిపించారు నేను నవ్వుతూ, ఆ ఆదివాసులు ఎంత మంచివాళ్ళో వివరించి చెప్పాను ''అలాగటండీ! మరి, వాళ్ళ గురించి ఇక్కడ అంతా భయంకరంగా చెప్పుకుంటా రేమిటి?'' అంటూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు ''ఐతే, మేంకూడా ఆ ప్రాంతాలకు ఎప్పుడైనా పిక్నిక్‌కు వెళ్లొచ్చన్నమాట?'' అన్నారు ''తప్పకుండా మీరంతా వెళ్లి చూసితీరాల్సిన అందమైన ప్రదేశాలవి అలాంటి వెనుకబడిన ప్రాంతాలలో నివసించేవారిని నాగరీకులుగా తీర్చిదిద్దే బాధ్యత కూడా మీరే తీసుకోవాలి!'' అని చిన్న ఉపన్యాసం ఇచ్చానుకూడా ''అలాగేనండి,'' అంటూ వాళ్ళు తలలూపారు

## ఆడపులి గోరు

చింతపల్లి అడవుల దగ్గర ఏదో గ్రామం నుంచి ఓ జమీందారీ కుటుంబానికి చెందిన ఓ యువకుడు ఆ మధ్య పోస్ట్‌లో నాకొక పులిగోరును పంపిస్తూ, ''ఇది స్త్రీలకు రక్ష లాంటిది అసలు ఆడపులి గోరు దొరకడం చాలా కష్టం అందుకే ఇది ఎంతో పవిత్రమైనది కూడానూ ఎన్నో తరాలుగా మా భవంతిలో భద్రపరచబడిన ఈ అపూర్వమైన వస్తువును నా అభిమాన తార అయిన మీకు కానుకగా పంపిస్తున్నాను ఇది ఎప్పుడూ మీవద్ద ఉండేలా చూసుకోండి మీ కెంతైనా మేలు జరుగుతుంది,'' అని రాశారు

''ఆ పులిగోరును నేను హారంతో సదా ధరిస్తున్నాను

దానివల్ల ఇంకా ఏ ఏ మేలు జరుగుతుందో చూడాలి మరి,'' అంది సంగీత మందహాసంతో

[జి. వి. జి]

## ఇరుగు - పొరుగు

★ ''పట్నం వచ్చిన పతివ్రతలు'' చిత్రంలో రాధికకు నేపథ్యంలో గానం చేయడంతోపాటు సంభాషణలు కూడా ఎస్ పి శైలజ పలికింది శైలజకు ''సాగర సంగమం'' చిత్రంలో ఎస్ జానకి ప్లేబాక్ పాడింది

★ ఇటీవల భాగ్యరాజా నటించిన ''పొయ్ సాక్షి'' అనే తమిళ చిత్రం విడుదలైంది తమాషా ఏమిటంటే — బేనర్లలో, పోస్టర్లలో, పత్రికా ప్రకటనలలో ఈ చిత్ర దర్శకుని పేరు ఎక్కడాలేదు

★ శశికపూర్ చిత్ర నిర్మాణ సంస్థలో 'స్టెనో'గా పనిచేసిన సుప్రియా పాథక్ సినిమా నటి అయింది

★ రాజ్‌కపూర్ తన కొత్త చిత్రాల విడుదలకు ముందు 'ప్రీవ్యూ'ను భారీఎత్తున ఏర్పాటు చేయడం మామూలు కాని, ఇటీవల విడుదలైన ''ప్రేమ్ రోగ్'' చిత్రానికి మాత్రం అలాంటి ఆట్టహాసం ఏమీ చేయలేదు ఆ సమయంలో అమితాబ్‌బచ్చన్ అస్వస్థుడుగా ఉండడమే అందుకు కారణమట

★ కమలహాసన్‌తో నటించాలనే రాధిక కోర్కె త్వరలో ఈడేరబోతోంది ఎ వి ఎం సంస్థ త్వరలో ప్రారంభించే తమిళ చిత్రంలో ఇద్దరూ నాయకా నాయికలుగా బుక్ అయ్యారు

★ పుట్టణ్ణ దర్శకత్వంలో కన్నడంలో రూపొందిన ''మానస సరోవర'' చిత్రానికి కొ॥ సెల్ల విశ్వం కథకుడు

★ ''టాటా బిర్లా మోజీ'' అనే ముగ్గురు కథానాయకుల హిందీ చిత్రం త్వరలో సెట్స్‌కు వెళ్లబోతోంది

★ ఫ్రెంచ్ సెక్సీ నటి బ్రిగెట్టా బార్డట్ గౌరవార్థం ఫ్రెంచ్ ప్రభుత్వం ఒకప్పుడు నాణేలలో ఒకవైపున ఆమె బొమ్మను ముద్రించింది

★ భావనగర్ జిల్లా మాహువా నగరంలోని 'మేఘ దూత్' థియేటర్‌లో వారానికి 38 ఆటలు ప్రదర్శింపబడుతూంటాయి ఆదివారాలనాడు ఉదయం 8 గంటలకు బాలల చిత్రాలు, శని ఆది వారాలనాడు ఉదయం 10 గంటలకు ఆంగ్ల చిత్రాలు, ప్రతిరోజూ ఉదయం 11-30కు, మధ్యాహ్నం 1 గంటకు, 3గం 30ని లకు, 6-30కి - 9-30కి మామూలు ప్రదర్శనలు

★ నటి ప్రేమ్‌నారాయణ్ సినిమారంగంలో ప్రవేశించడానికి ముందు స్కూల్ టీచర్‌గా పనిచేసింది

★ ''గరీబీ దోహాత్'' చిత్రం ఋషీకపూర్, నీతుసింగ్ నాయకా నాయికులుగా కొంత షూటింగ్ జరిగాక జితేంద్ర, హేమమాలిని బుక్ అయ్యారు ఆ తర్వాత వాళ్ళకు బదులుగా రాజ్‌బబ్బర్, రతి అగ్నిహోత్రి ఎంపిక అయ్యారు హీరోగా కమలహాసన్‌ని కూడా వేయాలనుకున్నారు చివరికి, ఋషికపూరే మళ్ళీ హీరో అయ్యాడు

★ మనోజ్‌కుమార్ ప్రథమ పుత్రుడు కుణాల్ గోస్వామి హీరో అయితే, మరో పుత్రుడు విశాల్ నేపథ్య గాయకుడయ్యాడు

★ ''ఆక్టోపస్సీ'' ఆంగ్ల జేమ్స్‌బాండ్ చిత్రంలో ప్రముఖ టెన్నిస్ ఆటగాడు విజయ్ అమృత్‌రాజ్ ఒక పాత్రకు బుక్ అయ్యాడు అందుకోసం విజయ్ కొన్ని పాత జేమ్స్‌బాండ్ చిత్రాల కేసెట్స్‌ను తెప్పించి, తన గృహంలో వీడియోలో చూసుకుంటున్నాడట ''ఆక్టోపస్సీ'' చిత్రంలో జేమ్స్‌బాండ్ పాత్రధారి రోగర్ మూర్ కూడా టెన్నిస్ క్రీడాకారుడు విజయ్ సోదరుడు అశోక్ అమృత్‌రాజ్ ''నైన్ టైగర్ మన్'' అనే స్వాతంత్ర్య పోరాటానికి చెందిన ఆంగ్ల చిత్రాన్ని నిర్మిస్తున్నాడు

★ అస్వస్థతకు లోనవడానికి ముందు అమితాబ్‌బచ్చన్ ''మూన్రామ్ పిరై'' చిత్రాన్ని మూడుసార్లు చూశాక ఆ చిత్రాన్ని హిందీలో తాను నిర్మిస్తూ నటిస్తానని ఆ చిత్ర కథకుడు, ఛాయాగ్రాహకుడు, దర్శక నిర్మాత బాలూ మహేంద్రకు తెలియజేశాడట కాని, తమిళ చిత్రంలో నటించిన కమలహాసన్, శ్రీదేవితోనే హిందీ చిత్రం తయారుచేయాలని బాలూ నిర్ణయం కాల్‌షీట్లు కుదరక శ్రీదేవి ముందు తన అశక్తతను వెల్లడించేసింది కమల్, బాలూ బలవంతం చేయడంతో రెండు తెలుగు చిత్రాలను వదులుకుని, ఆ కాల్‌షీట్లను హిందీ చిత్రానికి కేటాయించిందట!



'యువరాజు'లో ఒక దృశ్యం




"అబ్బెబ్బే! ఇది రాజకీయ సినిమా కాదు! హీరో తల్లి ఢిల్లీలో ఉంటుంది, అందుకని ఆ పేరు పెట్టాం!"



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "గాంధీ" ఆంగ్ల చిత్రం

నవంబర్ 30న న్యూఢిల్లీలో ఏర్పాటు చేయబడిన "గాంధీ" ఆంగ్ల చిత్రం తొలి ప్రదర్శనకు మన అధ్యక్షులు శ్రీ జైల్‌సింగ్ ముఖ్య అతిథి ఈ చిత్రాన్ని మన దేశంలో పంపిణీ చేయడానికి మ్యూజిక్ ఇండియా లిమిటెడ్ (పాలిడార్ సంస్థ) మూడు కోట్ల రూపాయల మినిమమ్ గారంటీమీద హక్కులు పొందింది ఇంత మొత్తానికి మన దేశంలో ఇదివరకెన్నడూ ఇంత పైకం చెల్లించబడలేదు ఇటీవల "గాంధీ" చిత్ర నిర్మాతలు బొంబాయి తాజ్ హోటల్లో 'కాక్‌టైల్ పార్టీ ఇచ్చినప్పుడు ఆ హాలులో ఓ మూల మహాత్మా గాంధీ ఫోటో ఉందట

## కాగడా శర్మ రచనతో ఫూలన్‌దేవి

పేరుమోసిన బందిపోటు మురా నాయకురాలు 'ఫూలన్‌దేవి' కథ ఆధారంగా సి ఎస్ బోస్ దర్శకత్వంలో రాఘవేంద్ర ఆర్ట్ ఇంటర్నేషనల్ అధినేత కొల్లి రాఘవేంద్రరావు ఒక చిత్రాన్ని తల పెట్టారు నాయిక పాత్రకు నూతన నటి ఎన్నుకో బడుతుంది మదుమలై అడవుల్లో డిసెంబర్ 20 నుంచి 20 రోజులపాటు, విజయవాడ పరిసరాలలో జనవరి 20 నుంచి పది రోజులపాటు చిత్రీకరణ జరుగుతుంది రామచంద్రరావు సమర్పించే ఈ చిత్రానికి కాగడా శర్మ కథ, మాటలు రాశారు ఎన్ రామకృష్ణారావు ఛాయాగ్రాహకుడు

'కలవారి సంసారం'లో ఒక సన్నివేశం






హైదరాబాదు మరియు సికందరాబాదులో మాత్రమే లభ్యం.

చట్టబద్ధమైన హెచ్చరిక సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం

STATUTORY WARNING CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

Rediffusion/GPI/1698 R



'సకలకళా ప్రియుడు'లో పూర్ణిమాజయరాం

## విజం చెబితే నేరమా ? లో విజం చెప్పడానికి భయమా ?

పానకాలరావు (రావు గోపాలరావు) వొంగి, నేలమీద ఏదో పరీక్షిస్తున్నాడు కారులో తన స్నేహితురాండ్రతో అటు వచ్చిన రజని (జయప్రద) తన మామయ్యను చూసి, కారు ఆపి దిగింది "గుడ్ మార్నింగ్, మామయ్యా !"

పానకాలరావు తృళ్ళి పడ్డాడు "అబ్బా ! ఈ దయ్యం ఇక్కడ కూడా తయారయింది !" అని లోలోన గొణుక్కుని, పైకి "ఏమిటమ్మా, ఇలా వచ్చావు ?" అన్నాడు

"ఏమిటి, మామయ్యా, వెతుకుతున్నావు ?" అని రజని అడక్కుండా ఉండలేక పోయింది

"నా ప్రాణం ఇక్కడ పడిపోయిందమ్మా !"

"ఆఁ ! ప్రాణం పడిపోవటమేమిటి ?"

"ఏమని చెప్పను ! ఇది మన సుబ్బులు దారుణంగా మర్డర్ చేయబడిన చోటు ఈ మట్టి వాడి రక్తంతో పునీతమైందమ్మా !"

"ఆహా ! ఒక నౌకరు కోసం ఇంత బాధ పడుతున్నావంటే నీదెంత జాలిగుండె మామయ్యా!"

ఇంతలో మరో యువతి "ఇంతకీ ఆ హంతకుడి ఆచూకి ఏమైనా దొరికిందాండీ ?" అని వేసిన ప్రశ్నకు "అది పోలీసులు చూసుకుంటారు," అన్నాడు పానకాలరావు

"మరి నువ్వేం చేస్తున్నావిక్కడ ?" రజని అడిగింది

"ఈ స్పాట్‌లో సుబ్బులు జ్ఞాపకార్థం ఒక చలువరాతి సమాధి కట్టిద్దామా అని "

"ఏమిటి ! నడిరోడ్డుమీదా ?"

"అదే ఆలోచిస్తున్నాను ట్రాఫిక్‌కి అడ్డం అవుతుందని నీకేమైనా ఐడియాలొస్తే వచ్చి చెప్పు !"

"సరే, మామయ్యా !" అని రజని వెళ్లబోతూ ఆగి, "ఇంతకీ, గుండె ఏమైనట్టు ?" అంది

పానకాలరావు గుండె వేగంగా కొట్టుకోసాగింది

షాట్ ఓ—కే అయ్యాక "డ్రయివర్ సుబ్బులు పాత్ర ధరించింది ప్రసాద్‌బాబు," అని తెలిపారు ఎం బాలయ్య ఈయన కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తూ సమర్పించే అమృతా ఫిలిమ్స్ "విజం చెబితే నేరమా ?" చిత్రంలో కృష్ణంరాజు, రావు గోపాలరావు, సుధాకర్, నూతన్ ప్రసాద్, సత్యేంద్రకుమార్, మిక్కిలినేని, వంకాయల, రాజ్యలక్ష్మి, మమత, అత్తిలి లక్ష్మి, నిర్మల ఇతర పాత్రధారులు డి వి నరసరాజు మాటలు, సి నారాయణ రెడ్డి గీతాలు రాశారు ఎం ఎస్ విశ్వనాథం సంగీతం, ఎం జి ఆర్ మణి ఛాయ, కె ఎల్ ధర్ శిల్పం, వీరప్ప కూర్పు, రవికుమార్ నిర్వహణ, ఎస్ పి రంగారావు సహకార దర్శకత్వంతో ఆలపర్తి సూర్యనారాయణ, వస్నవ వెంకట్రావు నిర్మాతలు.



'సవాల్'లో సుమలత, రాజ్యలక్ష్మి



'భక్త జ్ఞానదేవ'లో ప్రశాంతి

## ఆడదాని సవాల్‌లో ఆడదాని అదృష్టం

విజయ (విజయలలిత)ను చూడడానికి రాము (రామకృష్ణ) అనే వ్యక్తి వచ్చాడు

"మీరు విజయగారా ?"

"అవును నేనే విజయను కూర్చోండి "

"ఏమండీ ! మీరే విజయగారని నిన్నే ఎందుకు చెప్పలేదు ?"

"చెప్తే ఏం చేసేవారు ? కళ్ళకద్దుకునేవారా ? నా పాట మీకొక్కరికి మాత్రం వినిపించాలని కోరుకునేవారా ?"

రాము ముఖం వికసించింది "ఏమండీ ! ఆ అదృష్టం నాకుందంటారా ?" అన్నాడు

"నా పాట వినాలని ఇష్టపడేవాళ్ళు మాత్రమే కాదు అదృష్టవంతులు నా కిష్టమైనవాళ్ళ ముందు పాడగలిగే నేను అదృష్టవంతురాల్ని," అంది విజయ అరమోడ్పు కనులతో

కె ఎస్ ఆర్ దాస్ దర్శకత్వంలో విజయలలిత సమర్పించే రాజా ఆర్ట్స్ క్రియేషన్స్ "ఆడదాని సవాల్" చిత్రం త్వరలో విడుదలవబోతోంది డి రాజా నిర్మాణ నేతృత్వంలో వి ఆర్ రామమోహన రావు, త్రినాథ్ నిర్మాతలు

## నాగార్జున ప్రొడక్షన్స్ చిత్రం

"హైదరాబాద్‌లో జనవరిలో షూటింగ్ స్టార్టవుతుంది," అన్నారు కె వాసు ఈయన దర్శకత్వంలో లోగడ "గోపాలరావుగారమ్మాయి, పక్కింటి అమ్మాయి" నిర్మించిన నాగార్జున ప్రొడక్షన్స్ అధినేత కె వాసు ప్రారంభించే చిత్రంలో చంద్రమోహన్, నరేష్, విజయశాంతి ముఖ్య పాత్రధారులు సత్యానంద్ మాటలు, గోపి పాటలు రాస్తారు ఎం వి రఘు ఛాయాగ్రాహకుడు

# బూస్ట్‌తో జట్టు కలపండి. వన్యమృగాలను కాపాడటంలో తోడ్పడండి.

## ఉచితం
### అందమైన వన్యమృగాల స్టికర్‌లు, పోస్టర్‌లు.



**మనం వన్యమృగాల సంరక్షణ విషయంలో ఇక ఎంతమాత్రం ఉదాసీనంగా ఉండజాలం**
**అందువలన, మనం కలిసి కృషిచేసి' వన్యమృగ సంరక్షణలో సహాయపడదాం**
**మీరు, మేము ఇంకా ప్రపంచ వన్యమృగ సంరక్షణ నిధి.**

**మీరు ఈ విధంగా సహాయపడవచ్చును.**

బూస్ట్ 500 గ్రాల జార్‌గాని రీఫిల్ ప్యాక్‌గాని ఒకటి కొనండి. జార్ మూత అడుగున లేదా రీఫిల్ ప్యాక్ అయితే దాని సెల్లోఫేన్, అట్టపెట్టెల మధ్య అందమైన వన్యజీవుల స్టికర్ ఉంటుంది చూడండి

మీరు మీ [illegible] అందమైన మూడు చిన్న వన్య మృగ స్టికర్ల సెట్ ఒకటి సేకరించవచ్చును

మీ ఉచిత పోస్టర్ సంపాదించాలంటే జార్‌కు ఉండే స్పెషల్ ప్రొమోషన్ లేబుల్‌ని, సీల్‌ని తీసివేసుకుని, మీ దగ్గర భద్రపరుచుకోండి రీఫిల్ ప్యాక్ కొనుగోలు చేసినట్లయితే స్పెషల్ ప్రమోషన్ పేనల్‌ని కత్తిరించి దాచండి

మూడు ఉంటే ఒక సెట్ సంపాదించేందుకు వీటిని సేకరించండి

ఎ) బూస్ట్ 500 గ్రాల జార్‌కి ఉండే 3 సీళ్ళతోపాటు 3 స్పెషల్ ప్రమోషన్ లేబుళ్ళు

లేదా

బి) 500 గ్రాల రీఫిల్ ప్యాక్‌కి చెందిన 3 స్పెషల్ ప్రమోషన్ పేనెల్స్

లేదా

సి) మీరు బూస్ట్ 500 గ్రాల స్పెషల్ ప్రమోషన్ ప్యాక్‌లు కొనుగోలు చేసినట్టు తెలిపేందుకు పైన పేర్కొన్న వాటిలో ఏ రెంటింటి కాంబినేషన్లైనా సరే సేకరించవచ్చును

తరువాత ఆ పూర్తి సెట్‌ని నిర్దేశించిన బూస్ట్ డీలర్లలో ఎవరిదగ్గరకైనా సరే తీసుకువెళ్ళండి ఈ డీలర్ల ఎడ్రసులు అన్ని బూస్ట్ దుకాణాలలోను దొరుకుతాయి

ఈ సెట్ సమర్పించిన మీదట ప్రత్యేకంగా డిజైన్ చేయబడిన పూర్తి రంగుల వన్యమృగ పోస్టర్లలో ఏదో ఒకటి మీకు కావలసింది ఉచితంగా లభిస్తుంది దానిని మీ [illegible] ఇంటికి తీసుకువెళ్ళండి కాబట్టి [illegible] చేతనైనంత సహాయం చేద్దాం సేకరించడం ప్రారంభించండి ఈ విధంగా మీరు వన్యమృగాలను కాపాడటంలో తోడ్పడటమేగాక, వాటి సంరక్షణలో కూడా శ్రద్ధ వహిస్తారు

గమనిక

ఎ) సేకరించిన లేబుళ్ళు వగైరా ఇచ్చి పోస్టర్లు మార్పిడి చేసుకోడానికి చివరి గడువు జనవరి 15, 1983

బి) ఈ మార్పిడి సదుపాయం కేవలం ఎంపిక చేసిన పట్టణాలలోనే లభిస్తుంది

వన్యమృగాల గురించిన పత్రిక SANCTUARY సహకారంతో ఈ సదుపాయం లభిస్తుంది




HTD HMM 7557

**బూస్ట్** చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం

## మనిషికో చరిత్రలో మనిషికో బుద్ధి !

రాంబాబు (మురళీమోహన్) దగ్గరికి రాజా (రాంజీ) వచ్చి, "బావా, రేపు దీపావళి," అన్నాడు

"ఆఁ తెలుసు," అన్నాడు రాంబాబు తాపీగా

"ఇంకా మీకూ, అక్కకూ కొత్త బట్టలు తేలేదు "

"తెలుసు "

"ఇప్పుడు కుట్టించే టయిమ్ లేదు రెడీమేడ్లు కొనవలసిందే "

"తెలుసు "

"దీపావళి రేపే ఏం చేద్దామనుకుంటున్నారు ?"

"అదే తెలియడంలేదు "

"బావా, నా దగ్గర కాస్త డబ్బుంది తీసుకోండి "

"పెళ్ళయిన మొదటి దీపావళికి మాత్రమే మువ్విప్పటం, మేం పుచ్చుకోటం ఆనవాయితీ "

"ఆనవాయితీగా కాదు, అప్పుగా ఇస్తాను "

"అప్పు చెయ్యడం — తప్పు చెయ్యడమే "

"పట్టుదల మాత్రం బాగానే ఉంది "

"ఈ లేమిలో అదైనా ఉంది సంతోషించు "

"సరే ఊరికే ఇచ్చినా పుచ్చుకోరు అప్పుగా ఇస్తే అక్కర్లేదు ఓ—కే ఇప్పుడు నేను మీ బావమరిదిని కాను మీ అవసరమున్న ఒక విద్యార్థిని అయ్యా, సెప్టెంబర్ ఒకటవ తేదీన పబ్లిక్ సర్వీస్ కమీషన్ ఎగ్జామ్స్‌కి కూర్చుంటున్నాను నేను ఇంగ్లీషులో కొంచెం పూర్ నాకు కాస్త గ్రామరు నేర్పుతారా ?" అని రాజా అడుగుతూండగా అక్కడికొచ్చిన సీత (సుహాసిని) "అబ్బాయ్ ! మాస్టారికి ఈ రెండ్రోజులూ పండగ సెలవలయ్యా !

## సినిమా

దీపావళి గడిచాక రా! అడ్వాన్సు కూడా అప్పుడే ఇద్దువుగానిలే," అంది

రాంబాబు సంతృప్తిగా నవ్వి, "మీ అక్క నావైపు నిలబడి నీ డబ్బొద్దు పొమ్మంది — చూడు అంతకంటే దీపావళి ఏముంటుందయ్యా ! బతుకంతా దీపావళి పండగ జరుపుకున్నంత సంతోషం ఆ ఒక్క మాటలోనే కలిగిందయ్యా నాకు," అన్నాడు

రాజా అవాక్కయిపోయాడు

అక్టోబర్ చివరి వారంలో విడుదలయ్యే భార్గవా ఆర్ట్ ప్రొడక్షన్స్ "మనిషికో చరిత్ర" చిత్రాన్ని తాతినేని ప్రసాద్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో చింతపల్లి ప్రసాద్, టి నారాయణరెడ్డి నిర్మించారు నిర్మాణత ఎస్ గోపాలరెడ్డి



'ప్రళయ రుద్రుడు'లో కృష్ణంరాజు, పుష్పలత, నారాయణరావు

## అనంతరాగాలులో పగటి కలలు

కాలేజ్ కాంపౌండ్ చేతిలో పుస్తకాలతో వొయ్యారంగా నడుస్తూన్న రాజీ (రాజ్యలక్ష్మి)ని



'ఆడదాని సవాల్'లో విజయశాంతి

చూశాడు మురళి (ప్రభాకర్) ఒక గులాబీ పువ్వుతో ఆమెను సమీపించాడు "రాజీ !"

రాజీ ఆగింది "ఏమిటి ?"

"మన ప్రేమకు గుర్తు ఈ గులాబీ !" అంటూ ఇవ్వబోయాడు

రాజీ ఆశ్చర్యపడింది "ప్రేమకు గుర్తా ! ఏమిటి నీ ఉద్దేశం ? ఎందుకు పదే పదే నా వెంట పడతావ్ ? చూసేవాళ్ళంతా ఏమనుకుంటారు ?"

"ఎమైనా అనుకోనీ మనకేం ? మనసులు ఇచ్చి పుచ్చుకున్నాక ఇంకా భయమెందుకు, రాజీ !"

"ఏమిటీ ! మనసులు ఇచ్చి పుచ్చుకున్నామా ? ఎప్పుడు ? నా మనసు నా దగ్గరే భద్రంగా ఉంది "

"రాజీ ! నువ్వేనా ఇలా మాట్లాడుతున్నావ్ ? నేను ఒక్కరోజు కాలేజీకి రాకపోతే ఎందుకు రాలేదని అడిగావ్ "

"క్లాస్‌మేట్‌వి గనుక కాలేజ్‌కి రాకపోతే అడిగాను తప్పా ?"

"నేనంటే నీ కిష్టమని, నన్ను ప్రేమిస్తున్నావని, నాతోటిదే నీ లోకమని ఉత్తరం రాశావ్ ?"

"అబద్ధం ! నేను నీ కెప్పుడూ ఉత్తరం రాయలేదు "

మురళి చేతిలోని గు లా బీ పు వ్వు కింద పడిపోయింది "రాజీ !"

"మీకు ఏం ఉత్తరమొచ్చిందో తెలీదు కాని, అది నా దగ్గర్నుంచి మాత్రం రాలేదు "

"రాజీ ! అలా అనకు, రాజీ !"

"నువ్వేదో నా గురించి ఊహించుకొని పగటి కలలు కంటే, ఆ తప్పు నాదెలా అవుతుంది ? ఇంకెప్పుడూ నా వెంట పడకు నన్ను పరువుగా బ్రతకనీ " అంటూ విసురుగా వెళ్ళిపోతున్న రాజీ కాలికింద గులాబీపువ్వు నలిగిపోయింది

"రా . జీ !" మురళి మనసు చివుక్కుమంది

వి ఆర్ ఎస్ రెడ్డి, బి ఎస్ జి నాయుడు నిర్మించిన శ్రీ శంఖుచక్ర మూవీస్ "అనంత రాగాలు" చిత్రానికి కొంపెల్ల విశ్వం సంభాషణల కర్త కధ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం ప్రభాకర్ ★



# నీలాకాశం

సీరియల్

శ్యామల



ఇందిర నిర్ణయాన్ని అమ్మమ్మ, మామయ్యలు, పెదనాన్న— హర్షించలేదు మధు తల్లితండ్రులు సరేసరి— "ఎందుకురా, ఆ అమ్మాయే కావాలని పట్టుదల? మరొక సంబంధం చూసుకుందాం" అనసాగారు మధుతో

"నీ పెళ్ళి అయితే ఒక పిల్ల బాధ్యత అయినా తీరింది అనే తృప్తి ఉండేది ఇప్పుడు పెళ్ళి కాన్సిల్ చేసుకోవటం ఏమిటి?" అని ఇందిరను కోప్పడ్డారు పెద్దలు

ఇందిర వాదనలతో ఎవరికీ నచ్చజెప్పాలనుకో లేదు తను మధుకే నచ్చజెప్పలేకపోయింది— ఇంక వీళ్ళందరినీ ఒప్పించగలదా? అనుకొని ఊరుకుంది ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టింది

తన స్నేహితులకు ఉత్తరాలు రాసింది ఉద్యోగం విషయంలో సహాయం చేయమని చదువుకున్న కాలేజీలో లెక్చరర్లను కలుసుకొని పరిస్థితి వివరించింది నాన్నగారి మిత్రులతో వెళ్ళి మాట్లాడింది రోజూ లైబ్రరీకి వెళ్ళి న్యూస్ పేపర్లు చూడసాగింది బి ఎ చదువుతున్నప్పుడే టైపు లోయర్ పాసయింది ఇందిర ఇప్పుడు మళ్ళీ టైప్ ఇన్‌స్టిట్యూట్‌కి వెళ్ళి టైప్ ప్రాక్టీస్ చేయసాగింది

పేపర్‌లో అడ్వర్‌టైజ్‌మెంట్ చూసి ఒక ప్రైవేట్ కంపెనీలో క్లర్క్ ఉద్యోగానికి అప్లికేషన్ పంపించింది ఇంటర్‌వ్యూకి వెళ్ళింది

"మీరు ఏం చదువుకున్నారు? బి ఎ పాసయినారా? ఎం ఎ చదినవాళ్ళుకూడా వచ్చారు ఈ ఇంటర్‌వ్యూకి సారీ!"

"కాని మీరు పేపర్లో స్కూల్‌ఫైనల్ చదివి ఉంటే చాలని అన్నారు కదా?"

"అది నిజమే! కాని ఎం ఎ లు, బి ఎ బి ఎల్ లు వస్తుంటే వాళ్ళను వదిలిపెట్టి తక్కువ వాళ్ళను తీసుకోవలసిన అవసర మేమిటి చెప్పండి!"

నిరాశగా ఇల్లు చేరింది ఇందిర

* * *

అది పెద్ద బట్టలషాపు అక్కడ గల్లాపెట్టె వద్ద కూర్చున్న ఆయన వద్దకు వెళ్ళి తను వచ్చిన కారణం వివరించింది ఇందిర

"పేపర్‌లో అడ్వర్‌టయిజ్‌మెంట్ చూసి వచ్చారా? మేనేజర్‌గారి గదిలోకి వెళ్ళి మాట్లాడండి" గది చూపించాడు ఆయన

జంకుతూ లోపలికి వెళ్ళింది ఇందిర నడి వయస్కుడు ఒకాయన కుర్చీలో కూర్చొని ఏవో లెక్కల పుస్తకాలు చూస్తున్నాడు తను వచ్చిన కారణం చెప్పింది ఇందిర

"సేల్స్ గర్ల్ ఉద్యోగానికి వచ్చారా? అట్లా కూర్చోండి ఆఁ, మీ వివరాలు చెప్పండి"



(గత సంచిక తరువాయి)

"నా పేరు ఇందిర బి ఎ పాసయినాను"

"బి ఎ పాసయినారా?" ఆయన నవ్వాడు "మా షాపులో హైస్కూలు చదువు దాటిన వాళ్ళెవరూ లేరు! నేనూ బి ఎ ని కాదు మీ చదువుకి తగిన ఉద్యోగం కోసం ఎక్కడయినా ప్రయత్నించకపోయారా?"

"ఫర్వాలేదండీ! నాకు ఉద్యోగం చాలా అవసరం ఇప్పుడు —" ఏదో చెప్పబోతుంటే ఆపాడు అతను

"మేము ఇచ్చేవి కొద్దిపాటి జీతాలు మీకు మరొక మంచి ఉద్యోగం రాగానే ఇది వదిలేసి వెళ్ళిపోతారు, అవునా? అప్పుడు మేము మళ్ళీ వెతుక్కోవాలి అవసరంలో ఉన్నారు, నిజమే కాని నాలుగురోజులు ఓపిక పట్టండి మీకు తగిన జాబ్ దొరక్కపోదు" మంచి మాటలతో సాగనంపాడు ఆయన

ఉసూరుమంటూ వెనక్కు మళ్ళింది ఇందిర

* * *

ఎదురుగా ఉన్న యింటిని తేరిపార చూసింది ఇందిర ఆ యింటికి 'సుభాష్ ప్రైమరీ స్కూల్' అనే బోర్డు కట్టి ఉంది 'ఇదే సుబ్బారావుగారు చెప్పిన స్కూల్' అనుకుంటూ లోపలికి వెళ్ళింది

సుబ్బారావుగారు నాన్నకు స్నేహితులు తన ఉద్యోగ ప్రయత్నాల గురించి చెప్తే, "మా యింటి దగ్గరే ఒక చిన్న ప్రైవేటు స్కూలు ఉన్నదమ్మా! అక్కడ టీచర్లు కావాలని అనుకుంటుంటే విన్నాను ప్రయత్నం చేయి" అన్నారు

స్కూలు హెడ్ మిస్ట్రెస్‌ని కలుసుకుంది ఇందిర ఆవిడ ఎంతో మర్యాదగా మాట్లాడింది "మాది క్రొత్తగా పెట్టిన బడి టీచర్లు కావాలి బి ఎ చదువుకున్నావా, వెరీగుడ్! టీచర్ ట్రైనింగ్ అవలేదంటున్నావా? ఫర్వాలేదులే ఇదేమీ హైస్కూలు కాదుగా! నీకు తప్పకుండా జాబ్ ఇస్తాను కావాలంటే ఈ రోజే చేరిపోమ్మా—"

**జరిగిన కథ — 2** ఆ రోజు రామారావ్ సుభద్రల సిల్వర్‌జూబిలీ సెలబ్రేషన్స్‌కి అన్ని ఏర్పాట్లు చేస్తారు వారి సంతానం ఇందిర, రమేష్, సురేష్, ఉష దానిలో భాగంగా రామారావ్, సుభద్రలను సినిమాకి పంపుతారు పిల్లలు సినిమా చూసి స్కూటర్‌మీద వస్తూ యాక్సిడెంట్‌లో మరణిస్తారు ఆ దంపతులు మధుతో ఇందిర పెళ్లి గతంలోనే ఖాయం చేయడం జరుగుతుంది తన తమ్ముళ్ళ, చెల్లి భవిష్యత్తు తీర్చిదిద్దడానికి మధుకి యిష్టం లేక పోయినా ఉద్యోగంలో చేరాలనుకుంటుంది ఇందిర

ఆశ్చర్యంతో చూస్తూ ఉండిపోయింది ఇందిర సంతోషంతో నోట మాట రాలేదు

"పని ఎక్కువగానే ఉంటుంది ఫ్రీ పీరియడ్స్ అవీ ఏమీ ఉండవు ఎందుకంటే క్రొత్తగా పెట్టిన బడికదా! కష్టపడి పనిచేసి మనమంతా పైకి తీసుకురావాలి"

"కష్టపడటం గురించి నేను భయపడటం లేదండీ!" అంది ఇందిర ఓ నిముషం ఆవిడ ఏమయినా చెప్తుందేమోనని ఎదురు చూసి, తర్వాత "జీతం విషయం—" అని చిన్నగా అడిగింది

"చెప్తున్నాను కదమ్మా, ఇది క్రొత్త స్కూలు అని గవర్నమెంటు గ్రాంట్స్ వంటివి ఏమీ లేవు అందుకని నెలకి అరవై రూపాయలు మాత్రం ఇస్తున్నాం టీచర్లకి ఏమిటి ఆలోచిస్తున్నావు? చేస్తావు కదూ?"

నెలకు అరవై రూపాయలా— నీళ్ళుకారి పోయింది ఇందిర తన యింటికి, ఈ బడికి మధ్య ఆరుమైళ్ళ దూరం బస్ ఛార్జీలకి సరిపోతుంది ఆ జీతం, అంతే రోజంతా పనిచేస్తే ఇచ్చేది ఇదా— నిరుద్యోగ సమస్యని ఎంతగా ఉపయోగించుకుంటున్నారు వీళ్ళు

నీరసంగా బయటకు వచ్చింది ఇందిర

* * *

పేపర్లు చూడటం— ఇక్కడకు, అక్కడకు ఉద్యోగంకోసం పరుగెత్తటం—ట్రూ కాపీలు టైపు చేయటం— వాటిపై సంతకాల కోసం ఎవరెవరినో అడగటం— అప్లికేషన్స్‌తో పంపటానికి బాంకి చెలాన్స్ కట్టటం— పోస్టల్ ఆర్డర్లు కొనటం— ఎంత టైము, డబ్బు వృధా అయిపోతున్నాయో

బాంకి వడ్డీతో ఇల్లు గడవటం కష్టంగా వుంది ఇంటిలో ఒక భాగం అద్దెకి ఇచ్చారు పెద్ద దిక్కు అమ్మమ్మ కనిపెట్టుకొని ఉండటం వలన తను ఈ మాత్రం ప్రయత్నాలయినా చేయగలుగుతున్నది రమేష్‌కి, సురేష్‌కి ఇంకొక నాలుగు నెలల్లో ఇంటర్ పూర్తవుతుంది అప్పటికయినా తనకు జాబ్ వస్తుందా? రాకపోతే ఏం చేయాలి? ఆలోచిస్తూ డాబాపైన కూర్చుంది ఇందిర

సాయం సమయం అది. పక్షులు గూళ్ళు చేరుకుంటున్నాయి వాటి జీవితం నిజంగా ఎంత హాయి! ఏదో దొరికినది తింటాయి ఎగురుతూ ఉంటాయి మనుష్యులకు అలా ఉండటం సాధ్యం కాదేం? దూరాన చెట్టుమీద కూర్చున్న పక్షుల జంటను చూస్తుంటే, చటుక్కున మధు గుర్తు వచ్చాడు అసలు కనిపించటమే లేదు ఇప్పుడు ప్రతిరోజూ వచ్చేవాడు ఒకప్పుడు "అక్కా, మధు ఇవ్వాళ అటెండెన్స్ వేయించుకోలేదా?" అని నవ్వేవాళ్ళు తమ్ముళ్ళు 'అమ్మా, నాన్నా హఠాత్తుగా

వెళ్ళిపోయారు నీవూ దూరమయినట్లేనా మధూ? నన్ను అర్థం చేసుకోలేదెందుకని?'' బాధగా అనుకుంది

''ఇందూ, నీ కోసం ఎవరో స్నేహితురాలు వచ్చిందమ్మా'' క్రింది నించి అమ్మమ్మ పిలిచింది

ఇందిర లేచి వెళ్ళబోయేటంతలోనే ఆ స్నేహితురాలు పైకి వచ్చింది

''శారదా'' అంటూ సంతోషంగా ఎదురు వెళ్ళింది

''ఇందిరా, నువ్వేనా ? ఎంత మారిపోయావు?'' ఆశ్చర్యంగా అంది శారద ఇద్దరూ కూర్చున్నాక, ''ఎంత చిక్కిపోయావు ఇందిరా ఈ మధ్యాహ్నమే ఊరినించి వచ్చాను రాగానే మీ అమ్మ, నాన్నగార్ల గురించి విన్నాను వాళ్ళిద్దరూ అదృష్టవంతులేనే మీదే దురదృష్టం అంతా'' కళ్ళలో నీళ్ళు తిరుగుతూండగా అంది

ఇందిరకూ దుఃఖం ఆగలేదు. చేతుల్లో ముఖం దాచుకొని ఏడవసాగింది ''వద్దు ఇందిరా, ఏడవకు నేను వచ్చి నిన్ను ఏడిపిస్తున్నాను కదూ ''

''లేదు శారదా, దేవుడే ఏడిపించాడు ఏడుస్తుంటే ఏదో రిలీఫ్‌గా ఉంది .ఆపకు నన్ను'

ఇందిరను దగ్గరగా తీసుకొని కళ్ళు తుడిచింది శారద వాళ్ళిద్దరూ బి.ఎ.లో క్లాస్‌మేట్స్ బి.ఎ అవగానే శారద పెళ్ళి చేసుకొని భర్తతో ఒరిస్సా వెళ్ళిపోయింది. మళ్ళీ ఈ రోజే పుట్టింటికి వచ్చింది



స్నేహితురాలికి సంభవించిన విపత్తు వినగానే ఇక్కడికి వచ్చేసింది

ఆక్సిడెంట్ గురించి అంతా వివరంగా చెప్పింది ఇందిర

''అమ్మావాళ్ళు నీ పెళ్ళయినా చూడకుండా వెళ్ళిపోయారు కదే ఇందిరా! వెనక అనుకున్నట్లు గానే అయిపోతుందా పెళ్ళి ?'' అని అడిగింది శారద, అంతా విన్నాక

అప్పుడు, ఉద్యోగంచేసి తమ్ముళ్ళను పెద్ద చదువులలో చేర్పించాలని తను తీసుకున్న నిర్ణయం గురించి చెప్పింది ఇందిర పెళ్ళి వాయిదా వేయటం మధుకి ఇష్టం లేదని, కోపగించుకొని వెళ్ళి పోయాడనీ కూడా చెప్పింది ''నా డ్యూటీ నన్ను స్పష్టంగా పిలుస్తున్నది శారదా! మధుని ప్రేమిస్తున్నాను, అతను కావాలని ఎంతగానో కోరుకుంటున్నాను కాని చెల్లిని, తమ్ముళ్ళని వాళ్ళ ఖర్మానికి వదలలేను! అందరినీ ఇలాగే వదిలేసి పెళ్ళిచేసుకున్నా అందులో సుఖం ఉండదు! ఎప్పుడూ గిల్టీగా ఫీలవుతూ ఉంటాను!''

కాస్సేపు ఆలోచిస్తూ ఉండిపోయింది శారద తర్వాత ''నీవు తీసుకున్నదే సరైన నిర్ణయం ఇందిరా'' అని హర్షించింది ''మరి ఉద్యోగ ప్రయత్నాలు ఎంతవరకు వచ్చాయి ?'' అని అడిగింది

''ఎన్నిచోట్లకి వెళ్లానో, ఎన్ని ప్రయత్నాలు చేస్తున్నానో చెప్పలేను శారదా! ఏమీ కలిసి రావటం లేదు'' దిగులుగా అంది

''కాస్సేపు అలా బయట తిరిగి వద్దాం పద'' అంది శారద

ఉషని తీసుకొని ఇద్దరూ బయటకు వెళ్ళారు

ఇందిర వాళ్ళ ఇల్లు దాటి ఓ అరమైలు వెళ్తే బంజారా హిల్స్ వస్తాయి అక్కడ ప్రశాంతంగా, వాకింగ్ చేయటానికి అనువుగా వుంటాయి రోడ్లు తను, మధు కలిసి ఎన్నిమార్లు ఇక్కడికి షికారుగా వచ్చారో— అనుకుంది ఇందిర ఇప్పుడు ఒక్క సారయినా అతను తన యింటికి రావటం లేదు తనకయినా వాళ్ల యింటికి వెళ్లాలనిపిస్తుంది కాని తనపైన అతనికి అంత కోపంగా ఉన్నప్పుడు, వాళ్ల యింటికి వెళ్లాలంటే జంకుగా ఉంది అక్కడికీ రెండుసార్లు వెళ్లింది అతను రెండుసార్లూ ఇంట్లో లేడు

''ఈ హోటల్ క్రొత్తదిగా ఉన్నదే! వెనక ఇక్కడ లేదు'' అంది శారద 'హోటల్ బ్లూ బెల్స్' అన్న బోర్డుని చూస్తూ

''అవును'' అంటూ ఆ అయిదంతస్థుల బిల్డింగ్ వైపు చూసింది ఇందిర లైట్లతో మెరిసి పోతున్నది ఆ మేడ ముందర పెద్ద లోట ఉంది

''ఉషా, లోపలికి వెళ్లి ఏదయినా స్వీట్ తిందామా ?'' అంది శారద

అక్క అనుమతికోసం చూసింది ఉష

''వద్దు శారదా ఇది చాలా 'పాష్ హోటల్' ఊరికే కాఫీ త్రాగినా పది రూపాయలు వదుల్తాయి'' అంది ఇందిర

''నా పర్స్ బరువుగా ఉంది ఈ రోజు'' నవ్వి లోపలికి దారితీసింది శారద ఇందిర, ఉష అనుసరించారు

# నీలాకాశం

అందమైన గార్డెన్ దాటి, గాజు తలుపులు నెట్టుకొని లోపలికి వెళ్లారు లోపల చాలా అందంగా ఉంది విశాలమైన లాబీ దాటి 'రిఫ్రెష్‌మెంట్స్' అని రాసి ఉన్న గదిలోకి వెళ్లారు డిమ్ లైటింగ్‌లో, మృదువైన వాద్య సంగీతం వినవస్తుంటే, ఎర్రటి కార్పెట్‌పైన మెత్తగా అడుగులు వేస్తూ నడిచి, మూలనున్న టేబిల్‌వద్ద కూర్చున్నారు ఉషకి స్వీటు, తమకు కాఫీ ఆర్డర్ ఇచ్చింది శారద

సమస్యలన్నిటినీ మనసులో ఓ మూలకు నెట్టేసి కబుర్లాడుతూ కొంత సమయం హాయిగా గడిపారు

బయటకు వచ్చేస్తుంటే ప్రక్కనున్న ఓ గది లోనించి ఒక అమ్మాయి వీళ్లను చూసి పిలిచింది ''ఇందిరా! శారదా!''

ఆశ్చర్యంగా అటు చూశారు వాళ్ళు మబ్బు రంగు షిఫాన్ చీర, స్లీవ్‌లెస్ బ్లౌజు, బాబ్డ్ హెయిర్— అందంగా, ఫాషన్‌గా ఉన్న ఆ అమ్మాయిని ఇద్దరూ గుర్తుపట్టారు వీణాసిన్హా! తమ కాలేజీలోనే బి ఏ చదివింది తమకు ఏడాది సీనియర్

''హలో వీణా!'' పలకరించింది ఇందిర

''ఎన్నాళ్ళకెన్నాళ్ళకి!'' అంది శారద

''నా డ్యూటీ టైము అయిపోవస్తున్నది ఆ ప్రక్కనున్న రూమ్‌లోకి వెళ్ళి కూర్చోండి ఇప్పుడే వచ్చేస్తాను'' అంది వీణ

''మేము త్వరగా వెళ్ళిపోవాలి వీణా! మా ఇల్లు చాలా దూరం నువ్వు ఇక్కడ వర్క్ చేస్తున్నావని తెలిసింది కనక, ఇంకో రోజు తప్పకుండా వస్తాం'' అంది శారద

''ఇన్నాళ్ళ తర్వాత కలుసుకున్నాం, ఈ హడావిడి ఏమిటి ? త్వరగానే వెళ్దురుగాని'' అని ప్రక్క రూమ్‌లోకి వాళ్ళని పంపించింది వీణ

హోటల్ స్టాఫ్ డ్యూటీలేని టైమ్స్‌లో కూర్చొనే విశ్రాంతి గది అది చక్కని కార్పెట్, విలువయిన ఫర్నీచర్‌తో అందంగా ఉంది టేబుల్ పైన మాగ్‌జైన్స్ ఉన్నాయి

పది నిమిషాల్లో వచ్చింది వీణ దగ్గర కూర్చుంటూ, ''ఇప్పుడు చెప్పండి, మీరిద్దరూ కాలేజీ వదిలేశాక ఏం చేస్తున్నారు ?'' అంది

''నేనేమో పెళ్ళి చేసుకొని ఒరిస్సాలో ఉంటున్నాను'' నవ్వింది శారద ''ఈవిడ ఉద్యోగ ప్రయత్నంలో ఉంది''

కొంచెం ఆశ్చర్యంగా చూసింది వీణ ''ఇందిరా, త్వరలో నీ మ్యారేజ్ అని విన్నాను అప్పుడెప్పుడో మా క్లాస్‌మేట్ లలిత కనబడి నీకు, వాళ్ళ కజిన్ బ్రదర్‌తో పెళ్ళి ఫిక్స్ అయిందని చెప్పింది ?''

ఇందిర ముఖం మ్లానమయింది ''ఒకప్పుడు అనుకున్న మాట నిజమే వీణా! కాని ఇప్పుడు పరిస్థితులు మారాయి పెళ్ళి పోస్ట్‌పోన్ అయింది'' చిన్నగా అంది ఇందిర 'పెళ్ళి కాన్సిల్ అయింది' అనుకోవటానికి, అనటానికి మనసొప్పటంలేదు తనకి

''కొంత కాలం క్రితం ఓ ట్రాజెడీ జరిగింది ఇందిర పేరెంట్స్ ఇద్దరూ స్కూటర్ ఆక్సిడెంట్‌లో పోయారు'' చెప్పింది శారద

''ఓ, ఐయామ్ సారీ!'' అంది వీణ, ''ఈ అమ్మాయి మీ చెల్లెలా ఇందిరా ? నీ పేరేమిటి ?'' టాపిక్ మార్చింది

కాస్సేపు కబుర్లాడాక వెళ్లటానికి లేచారు శారద, ఇందిర, ఉష

తను జాబ్ కోసం ప్రయత్నిస్తున్నట్లు చెప్పింది ఇందిర ''ఏవైపు కూడా వచ్చును నీ ఎరికలో ఏమైనా ఉంటే తెలియచేయి'' అని చెప్పి అడ్రస్ రాసి ఇచ్చింది ఎవరు కనిపించినా, ఇదొక పాట అయిపోయింది— అనుకుంది మనసులో

మర్నాడే వీణ తమ ఇంటికి రావటం చూసి ఆశ్చర్యపోయింది ఇందిర ఏదో కొద్దిపాటి పరిచయం తప్ప, తామిద్దరి మధ్య పెద్దగా స్నేహం ఏమీలేదు అడ్రస్ వెతుక్కుంటూ ఈ రోజే వస్తున్నదేమిటి?

మర్యాదగా ఆహ్వానించి, కూర్చోబెట్టి కాఫీ ఇచ్చింది ఇందిర

''ఇందిరా, జాబ్ కోసం చూస్తున్నానన్నావు కదా, అందుకని వచ్చాను'' అన్నది వీణ

ఏమిటో చెప్పమన్నట్లు చూసింది ఇందిర

''నేను హోటల్ బ్లూబెల్స్‌లో ఏడాది పైగా టైపిస్టుగా పని చేస్తున్నాను నిన్న సాయంత్రం ఇంటికి వెళ్లేసరికి ఢిల్లీలో ఉన్న మా అన్నయ్య దగ్గర్నించి ఉత్తరం వచ్చి యున్నది అతను వచ్చే నెలలో ఫారిన్ వెళ్తున్నాడుట నన్ను వెంటనే బయల్దేరి వచ్చి ఈ నెల అతనితో కలిసి గడపమని రాశాడు నాకు, అన్నయ్యకి చాలా ఎటాచ్‌మెంట్ ఇందిరా! ఇవ్వాళ మేనేజర్‌ని వెళ్లి లీవ్ ఇవ్వమని అడిగితే, కుదరదన్నాడు ఇంత అకస్మాత్తుగా లీవు అడిగితే, నీపని చేసేందుకు నాకు మరొకరు ఎట్లా దొరుకుతారు? అన్నాడు ఆయన చెప్పిందీ నిజమే! చటుక్కున నీవు గుర్తు వచ్చావు టైపు వచ్చని చెప్పావు కదా! 'నా బదులు ఈ నెలా వర్క్ చేసేందుకు నేనే మరొక అమ్మాయిని ఏర్పాటు చేస్తాను అప్పుడు లీవు ఇస్తారా' అని అడిగాను 'ఆవిడను తీసుకురా, తృప్తికరంగా ఉంటే సరే' నన్నాడు అదీ విషయం ఇందిరా! టెంపరరీ పోస్ట్— నెలరోజుల కోసం — ఏమంటావు ?''

''థాంక్స్ అంటాను వీణా, ఇంకేమంటాను?'' సంతోషంగా అంది ఇందిర

''అయితే రేపు ప్రొద్దున్న తొమ్మిది గంటలకు వచ్చి నిన్ను తీసుకువెళ్తాను రెడీగా ఉండు'' అని వెళ్ళిపోయింది వీణ

ఈ విషయం ఇంట్లో ఎవరికీ చెప్పలేదు ఇందిర వస్తుందో, రాదో! తెలియని ఉద్యోగం గురించి ఎందుకు చెప్పటం ? వచ్చినప్పుడు చెప్పాలను కుంది మర్నాడు తమ్ముళ్ళు, ఉష వెళ్ళిపోగానే రెడీ అయింది గులాబి రంగు వెంకటగిరి జరీచీర కట్టుకొని, అదే రంగు బ్లౌజు వేసుకుంది నుదుట కుంకుమ, కళ్ళకు కాటుక దిద్దుకొని, వదులుగా జడ అల్లుకుంది అద్దంలోని ప్రతిరూపాన్ని చూస్తూ, 'ఫర్వాలేదు, బాగానే కనిపిస్తున్నాను ఇంటర్వ్యూలో నెగ్గవచ్చు' నవ్వుతూ అనుకుంది కాని పరిశీలనగా చూసేసరికి, బుగ్గలు కాస్త లోతుకు పోయినట్లు కనిపించాయి బ్లౌజు చేతులు కూడా వదులయినాయి వెనక తను కొంచెం బొద్దుగానే ఉండేది మధు వెక్కిరించేవాడు — ''ఇందిరా, రోజు రోజుకీ ఊరిపోతున్నావేమిటి? పెళ్ళినాటికి మాత్రం ఇలా ఉంటే నేను చేసుకోను కాస్త తగ్గు!''

తను మూతి త్రిప్పి మరీ జవాబిచ్చేది ''తమరు

చేసుకోకపోతే నాకేం భయంలేదు సార్! నాలాగే ఉన్న మరొక 'శాండో'ని వెతుక్కుంటాను''

''నేను ఊరుకుంటానా? లావుగా ఉన్నా, సన్నగా ఉన్నా, ఈ ఇందిర నాదే!''

తర్వాత మధు కోసం సన్నబడాలని నిశ్చయించుకుంది. ఆ రాత్రి అన్నం తగ్గించి తింటుంటే అమ్మ ఆశ్చర్యంగా అడిగింది.

''ఏమిటి ఇందూ, ఆకలిగా లేదా? ఒంట్లో బాగానే వుందా?''

అమ్మ! ఒక్కముద్ద తక్కువతిన్నా గమనించేది ''ఆ పొంగి పొరలే ప్రేమ అంతా ఏమయిందమ్మా, మమ్మల్ని వదిలి వెళ్లి పోయేటప్పుడు?''

''లేదమ్మా, డైటింగ్ చేస్తున్నాను'' అంటే అంతా ఫకాలున నవ్వారు

''సురేష్, మధు చెప్పే ఉంటాడురా ఈవిడకి!'' అన్నాడు రమేష్

''అతను చెప్పగానే వినేటంత పతివ్రతాశిరోమణి అని ఇన్నాళ్లూ తెలీదు!'' అన్నాడు సురేష్

''వీళ్లు చూడండి నాన్నా!'' అంది తను

''లేకపోతే డైటింగ్ ఏమిటమ్మా నీకు? నీవు అసలు లావుగా లేనేలేవు కాస్త బొద్దుగా ఉన్నావు అంతే!'' అన్నారు నాన్న

''అసలు బొద్దుగా ఉంటేనే బాగుంటుంది'' అంది అమ్మ

అయినా తను నెయ్యి మానివేసి, స్వీట్స్ తగ్గించి, ఏవో ప్రయత్నాలు చేస్తూనే ఉండేది లావు ఎక్కువ కా క పో యి నా, సన్నం మాత్రం అవలేదు

ఇప్పుడో? ఏ ప్రత్నాలూ చేయకపోయినా, అసలు ఆ విషయమే ఆలోచించక పోయినా తను సన్నబడింది ఛ, ఏమిటిది? సెల్ఫ్—పిటీ అంటే ఇదే! నన్ను చూసి నేనే జాలిపడుతున్నాను! ఈ విధంగా ఆలోచించకూడదు అద్దం ముందు నించి ఇవతలకు వచ్చింది

''ఎక్కడికో వెళ్తున్నట్టున్నావు?'' అడిగింది అమ్మమ్మ

''నా స్నేహితురాలు వస్తుంది అమ్మమ్మా, తనతో కలిసి బయటకు వెళ్తున్నాను'' అంది

అంతలోనే వీణ వచ్చింది ''నేను రెడీ!''

ఒకసారి ఇందిరను తేరిపార చూసింది వీణ ''ప్చ్, ఏం లాభంలేదు'' అంది పెదవి విరిచి

అర్థంకానట్లు చూసింది ఇందిర

''ఈ విధంగా డ్రెస్ అయితే మా మేనేజర్ మెచ్చడు అమ్మాయ్! అది చాలా హైక్లాస్ హోటల్ అక్కడికి ఎక్కువగా ఫారినర్స్ వస్తారు చలాకీగా కనిపించాలి పద లోపలికి, నీ చీరలన్నీ చూపించు'' అంది

అరగంటలో ఇందిరను మరొక విధంగా తయారుచేసింది వీణ క్రీమ్ కలర్ నైలెక్స్ చీర కట్టించింది కుంకుమ తీసి సన్నని తిలకం బొట్టు పెట్టింది జడ విప్పేసి వెంట్రుకలు అలాగే వదిలేసి పైన ఒక రబ్బరు బాండ్ పెట్టింది పర్స్ బదులు హేండ్ బ్యాగ్ పట్టుకోమంది ''ఇంక రా'' అని తీసుకువెళ్ళింది

ఇందిరకు వింతగా ఉంది వీణ చురుగ్గా పనులు చేసేస్తుంటే ఓ విధమైన నెర్వస్‌నెస్ అనిపించింది

## విద్యార్థిలోకం వ్యాస రచన పోటీలో ప్రత్యేక బహుమతి రు. 150/-లు పొందిన వ్యాసం

# మా విద్యార్థిలోకం ఆశయాలు

తమ మనోభావాలను ధైర్యంగా ప్రకటించి, వానినే తమ జీవిత లక్ష్యంగా పెట్టుకొన్నప్పుడు, ఆ భావాలు 'ఆశయాలు' అనే రూపం దాలుస్తాయి భావిపౌరులయిన విద్యార్థుల ఆశయాలలో భావి నవసమాజం ప్రతిఫలిస్తుంది

యువతరం ఆశయాలు అనేక విధాలుగా ఉంటాయి కొందరు డాక్టర్లయి, పేదప్రజల రోగ నివారణ చేయాలనే ఆశయంతో వుంటే, మరికొందరు ఇంజనీర్లయి ప్రాజెక్టులు నిర్మించి, దేశాన్ని సౌభాగ్యవంతం చేయాలను కొంటారు కొందరు న్యాయవాదులయి, న్యాయాన్ని నాలుగు పాదాలా నడిపించాలనే, దృఢ దీక్షతో వుంటారు ఇంకా కొంతమంది తాము ఉపాధ్యాయులయి, విద్యార్థులను క్రమశిక్షణ కలిగిన పౌరులుగా తీర్చి దిద్దాలనుకొంటారు కొందరు విద్యార్థులు నాగలిపట్టి దేశాన్ని సస్యశ్యామలం చేయాలనే ఆశయంతో వుంటారు కొంతమందికి తాము రాజకీయ నాయకులయి, దేశాన్ని అవినీతి అనే గోతిలోంచి వెలుపలికి తీయాలనే ఆకాంక్షతో వుంటారు గొప్ప కవులో, చిత్రకారులో, సంగీత విద్వాంసులో కావాలని వుంటుంది ముఖ్యంగా సినిమా నటులు కావాలని ఎందరికో అభిలాష కొందరి విద్యార్థులకు సైన్యంలో చేరి దేశరక్షణ చేయాలని వుంటుంది కొందరు విద్యార్థులు దేశంలోని పరిస్థితిని చూసి, తీవ్రవాదులయి, దేశాన్ని మార్చటానికి తాము నక్సలైట్ అవటమే దారి అనుకొంటారు కొందరు ఆర్థిక ఇబ్బందులు తట్టుకోలేక, తొందరలో తాము ధనవంతులు కావటానికి, ఏ గజదొంగగానో మారటమే శరణ్యమనుకొంటారు అక్రమంగా నైనాసరే డబ్బు సంపాదించితీరాలనుకొంటారు

విద్యార్థుల ఆశయాలు ఎన్నెన్ని వున్నా సహజంగా ఏ విద్యార్థికయినా ప్రధానాశయం విద్యను సంపాదించటంగా వుండాలి అయితే విద్యార్జనమీద అభిలాష లేనివారు కూడా 'విద్య ఉద్యోగ సాధనకు తప్పనిసరి' అన్న భావంతో, విద్యార్థులుగా వుంటారు అయితే ఎంత చదివినా ఉద్యోగం దొరుకుతుందన్న హామీలేక, విద్యార్థి దశలో అనాసక్తి, అది దాటగానే నిరాశ, నిస్పృహ వీరిలో ద్యోతకమౌతున్నాయి ఈ పరిస్థితి మారాలంటే విద్య స్వయం ఉపాధి కల్పనకు దోహదం చేసి వ్యక్తి తన కాళ్ళపై తాను నిలబడేటట్లు చేయాలి

భావిపౌరుల ఆశయ సాధనకు నేటి పౌరుల అండదండలు అవసరం కానీ నేడు ఆ ప్రోత్సాహం, సహకారం కరువయినాయి తమ చల్లని దీవెనలు అందించవలసిన పెద్దలు, రాజకీయ నాయకులు ఈ అభం శుభం తెలియని విద్యార్థులను ఆందోళనలు నిర్వహించడానికి, విధ్వంసకాండకు వాడుకొని, వారి వినాశనానికి కారకులవుతున్నారు ఇలాంటి పెద్దలు తమ ధోరణి మార్చుకొని విద్యార్థులకు తమ హృదయ పూర్వక సహకారం అందించాలి

వీరి ఆశయాలకు మరో ఆటంకం ఆర్థిక ఇబ్బందులు ప్రస్తుతం ప్రాథమిక విద్యనుండి, చదువులన్నీ ఖరీదయినవే ఇక తమ కనీసావసరాలకు కూడా నోచుకోని కోట్లాది అభాగ్యుల పిల్లల ఆశయాలు ఎలా నెరవేరుతాయి? దేశంలో నిజమయిన సామ్యవాదం నెలకొలిపితేనే వారి ఆశయాలు నిర్విఘ్నంగా నెరవేరుతాయి

ఇక రికమండేషన్లు, ఎంతో మెరిట్ వున్న విద్యార్థులకు ఉద్యోగం ఇవ్వకుండా, ఏ అర్హతా లేనివారికి రికమండేషన్‌తో ఇస్తున్నారు ఇది బాగా చదివి, వృద్ధిలోకి రావాలనుకొనేవారికి తీవ్రమయిన ఆశాభంగం

పోతే డొనేషన్లు విద్యాలయాలకు 'చందా మార్కులవారి' పీడ విరగడయ్యేట్లు చేయాలి విద్య కొందరు కలవారి సొత్తు కాకుండా చేయాలి

విద్యార్థులలో ఎవరి ఆశయాలు వారివే అయినా, అన్నింటి సారాంశం 'దేశసేవ' అని ఖచ్చితంగా చెప్పవచ్చు తమ ఆశయ సిద్ధికి విద్యార్థులు చిత్తశుద్ధితో కృషిచేస్తారని, వారికి పెద్దలు తగిన ప్రోత్సాహం ఇస్తారని ఆశిద్దాం *

### రచయిత్రి పరిచయం



"14-8-1967, విజయవాడలో జన్మించాను విజయవాడ, విశాఖపట్నం, కడపలలో, ప్రస్తుతం హైదరాబాదులోని స్టాన్లీ కళాశాలలో ఇంటర్ రెండవ సంవత్సరం (బై పి సి) చదువుతున్నాను అప్పుడప్పుడు వ్యాసాలు వ్రాయటం, పుస్తకాలు చదవటం హాబీలు

నా వ్యాసానికి ప్రత్యేక బహుమతి ఇచ్చి, నన్ను ప్రోత్సహిస్తున్న, ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంపాదకులకు నా కృతజ్ఞతలు"

— భండారు కృష్ణవేణి

## నీలాకాశం

"మీ మేనేజర్ నాకు ఉద్యోగం ఇస్తాడో, ఇవ్వడో ?" అంది

"నేనున్నానుగా, నీకెందుకు భయం ?" అంది వీణ

హోటల్ మేనేజర్‌కి ఏభై ఏళ్ళుంటాయి గ్రాండ్‌గా ఉన్న ఆఫీసు రూములో, సూట్ ధరించి టెబుల్‌వద్ద కూర్చొని ఉన్న ఆయనను చూస్తూనే ఇందిర జంకు, భయం మాయమయినాయి గౌరవ నీయంగా, పెద్దమనిషి తరహాగా ఉన్నాడు వీణ పరిచయం చేయగానే "నమస్తే" అంది ఇందిర మర్యాదగా

ఇద్దరినీ కూర్చోమన్నాడు ఆయన "ఇంగ్లీష్ బాగా మాట్లాడగలవు కదా ?" అని అడిగాడు ఇందిరని

"మాట్లాడగలనండీ! నేను చిన్నప్పటినించి కాన్వెంట్ స్కూలులో ఇంగ్లీష్ మీడియంలో చదువుకున్నాను" అని చెప్పింది

ఇందిర వైపు సర్టిఫికేట్స్ చూశాడాయన తర్వాత "ఈ ఉద్యోగం ఒక నెల రోజులకు మాత్రమే అన్నీ మిస్ వీణాసిన్హా చెప్పే ఉంటుంది" అన్నాడు "ఈ రోజుకి మిస్ సిన్హా ఇక్కడే ఉండి మీకు పని చూపిస్తుంది రేపట్నించి మీరు మొదలుపెట్టవచ్చును" అన్నాడు

"థాంక్యూ!" అంది ఇందిర ఆనందంగా

ఆ రోజంతా వీణ ప్రక్కనే ఉండి ఆమె చేసే పనంతా గమనించింది ఇందిర హోటల్ బిల్లులు, ఉత్తరాలు వగైరా టైప్ చేయటం ముఖ్యమైన పని అవసరమయితే, కస్టమర్స్‌కి ఏదయినా ఇన్‌ఫర్మేషన్ ఇవ్వటం, మాట్లాడటం మొదలైనవి చేయాలి ఫోన్ కాల్స్ అవీ అందుకోవటానికి రిసెప్షనిస్ట్‌లు ఉన్నా, ఒక్కోమారు వాటినీ తీసుకోవలసి ఉంటుంది మధ్యాహ్నం లంచ్ హోటల్‌వాళ్ళే సప్లై చేస్తారు హోటల్‌లోని ఇతర కొలీగ్స్‌కి ఇందిరని పరిచయం చేసింది వీణ అందరూ బాగా మాట్లాడారు

(ఇంకా వుంది)

# ప్రిస్టేజి

సోమిరెడ్డి జమున

"వదినా! నాకు కడుపులో నొప్పిగావుంది"

ఆడబిడ్డను డెలివరీకి మద్రాస్ తీసుకెళ్ళాలని ప్రయాణానికి అన్నీ సర్దుతున్న నిర్మల తలెత్తి సురేఖవైపు చూసింది.

కడుపుమీద చెయ్యివేసుకుని అలసటగా నిల్చునివుంది ఆడబిడ్డ సురేఖ

"వుండు మీ అన్నయ్యతో చెప్తాను" సర్దుతున్న సరంజామాను అక్కడే వదిలేసి సురేఖను పడుకోబెట్టి తనభర్త రామ్‌గోపాల్ దగ్గరకెళ్ళింది

"ఏమండీ! సురేఖ కడుపునొప్పంటోంది. త్వరగా కాన్పు అవుతుందో ఏమో లేడీడాక్టరు దగ్గరకు తీసుకెళ్దామా!" అతని మనస్తత్వం తెలిసిన నిర్మల నిదానంగా అడిగింది

"ఇంకా వారంరోజులు టైమ్ వుందన్నావుగా... సర్దేసి జస్ట్ అలా చూపించి మద్రాస్ తీసుకెళ్దాం"

* * *

కారునానుకుని నిల్చున్న రామ్‌గోపాల్ నిర్మల రావడంతో "సురేఖ ఏదీ" అని అడిగాడు

"సురేఖను హాస్పిటల్‌లో అడ్మిట్ చేయమంటుందండీ డాక్టర్ కరుణ"

"ఎందుకు?" ముఖం చిట్లిస్తూ అన్నాడు.

"ఇవి కాన్పు నొప్పులేనట కానీ ద్వారం ఏర్పడలేదట. సిసేరియన్ చేయాలంటున్నారు"

"ముందు నువ్వెళ్ళి సురేఖను తీసుకురా" ఆ గొంతులో విసుగు

"ఇప్పుడు సురేఖను తీసుకుని అంత దూరం ప్రయాణం ఏమిటండీ! అసలే కాన్పు కష్టమని, ఆపరేషన్ చేయాలని చెప్తుంటే"

"డాక్టర్లు అలాగే చెప్తుంటారులే! మరీ ఇంత పిరికితనమయితే ఎలా?"

"పిరికితనం కాదు! మధ్యలో ఏదైనా అయితే కష్టం గదా! ఏ హాస్పిటల్‌లో ఆపరేషన్ అయితే ఏమండీ! తల్లీ బిడ్డా క్షేమంగా వుంటే చాలు"

"చూడు నిర్మలా! అనవసరంగా టైమెందుకు వేస్ట్ చేస్తావు! సురేఖ ఎవరనుకున్నావు కోటీశ్వరుడు రాంగోపాల్ ఏకైక చెల్లెలు, అది నార్మల్ డెలివరీ కానీ, సిసేరియన్ గానీ మన స్టేటస్‌కు తగ్గట్టే సిటీలో కాన్పు చేయిస్తాను"

"మన స్టేటస్‌కు తగ్గట్లే చీరసారెలతో అత్తగారింటికి పంపుదాంగానీ ఇప్పుడీ ప్రయాణం మానేయండి"



"బి.ఎ. చదివి ఇంత అధైర్యమయితే ఎలా? ఎంత మూడు గంటల్లో మద్రాస్‌లో వుంటాం"

"డాక్టరు కరుణకు యీ వూర్లో మంచి నేమ్ వుంది. ఇక్కడే అడ్మిట్ చేద్దామండీ నెక్స్ట్ టైమ్ పదిరోజులముందే తీసుకెళ్ళి మన ప్రిస్టేజికి తగ్గట్టే సిటీకి తీసుకెళ్దాం" అతనికి ప్రిస్టేజి మీదున్న మమకారం తెల్సి ఆఖరి ఆశగా అడిగింది నిర్మల.

"నో...అలా వీల్లేదు ఏ విషయంలోనూ నా స్టేటస్‌కు భంగంగా ఏ పనీ చేయను... అయినా ప్రయాణానికి అన్నీ సర్దడం అయిపోయిందిగా! త్వరగా వెళ్ళిపోదాం. ఈ చిన్న హాస్పిటల్‌లో నా చెల్లెలుకు డెలివరీ చేయించను"

గట్టిగా నిట్టూర్చి సురేఖను తీసుకురావడానికి కదిలింది. ఆమెకు ఒకనాటి సంఘటన కళ్ళముందు పర్చుకుంది. తన భర్తకు తనమీదున్న ప్రేమ ఎక్కువా? ప్రిస్టేజి

మీదున్న ప్రేమ ఎక్కువా ? అని తేల్చుకోలేని స్థితి

ఒకరోజు విపరీతమైన తలనొప్పితో బాధ పడ్తూ తన తల్లి వేసుకునే ఇంగువ పట్టు గుర్తొచ్చి తనూ అదేపని చేసింది.

నిశ్శబ్దంగా కళ్ళు మూసుకుని పడుకున్న తన దగ్గరకు వచ్చి "అలా పడుకున్నావేం నిర్మలా" ఆప్యాయంగా అడిగాడు తన భర్త రామ్‌గోపాల్.

"తలనొప్పిగా వుంటే..."

తన మాట కూడా పూర్తి కాకముందే అతను ఆదుర్దాగా "డాక్టరును పిలిపించనా? నాకు ఫోన్ చెయలేకపోయావా? వుండు ఒక్క క్షణం" అంటూ ఇంటర్‌కమ్‌లో క్రిందకు మాట్లాడి డ్రైవర్‌ని డాక్టర్‌కోసం పంపాడు.

"వద్దండీ ఇంగువ పట్టు వేసాను తగ్గిపోతుంది"

"ఇంగువ పట్టా! సిల్లీ కబుర్లు చెప్పకు నిర్మలా ! ఇంగువపట్టేమిటి అసహ్యంగా" నుదుటిమీద ఇంగువచూసి చిరాగ్గా ముఖం పెట్టాడు కొన్ని సెకండ్ల తర్వాత—

"అసలు అదెలా చేస్తారు?"

"మట్టికుండ మీద ఇంగువ నూరితే వస్తుంది" ఆయన ముఖంలోకి చూస్తూ చాలా చిన్నగా అంది.

"ఓ మై గాడ్ ఎంత ఇన్‌ఫెక్షన్ అవుతుందో ఆ మట్టికుండమీద ఎంత మురికుంటుంది ? ఆ కుండ ఎక్కడిది నీకసలు?"

"మంగమ్మ తన గుడిసెలోనుండి నూరి తెచ్చిచ్చిందండీ"

"వాట్ ! మన పాచి పనిమనిషి ఇంట్లోనుండి తెప్పించుకున్నావా? ఎన్నిమార్లు చెప్పినా నీకు మన ప్రిస్టేజీని మెయిన్‌టెయిన్ చేయడం చాతకావడంలేదు! ఛీ! ఛీ!!" అతని ముఖంలో లాలన చోటులో విసుగు, కోపం, అవమానం జరిగిందనే భావన చోటుచేసుకున్నాయి. విసురుగా వెళ్ళి కిటికీదగ్గర నిల్చున్నాడు.

"అబ్బా!" కణత పట్టుకుంది తను.

చప్పున వెనుదిరిగి తన దగ్గరకు వచ్చి "చాలా నొప్పిగా వుందా నిర్మలా" అతని కంఠంలో ఆదుర్దా, ఆప్యాయత చోటు చేసుకున్నాయి మరలా నిర్మల నుదుటిమీద చేయి వేసాడు

అతని చేతికి తన నుదుటిమీద ఇంగువ తగలగానే లేచి వెళ్ళి డెట్టాల్ బాటిల్, కాటన్‌తో తిరిగొచ్చి శుభ్రంగా డెట్టాల్‌తో ఇంగువ పట్టునంతా తుడిచేసి ఆ స్మెల్ రాకుండా లవెండర్ సోప్ వాటర్‌తో మరలా తుడిచాడు.

'ప్రిస్టేజ్' అనే పదం నాలుక చివర నుండే రామ్‌గోపాల్ ఇంతపని చేయడమేమిటా ? అని ఆలోచిస్తున్న నిర్మల బుర్రకు ఇదీ ఒక ప్రిస్టేజ్ అని అర్థమయింది. మంగమ్మ సాది యిచ్చిన ఇంగువ తన భార్య వేసుకుందీ అనే సత్యం ఇంకో నౌకరుకు తెలియకూడదనుకున్నాడు. అందుకే పనిమనిషి చేయాల్సిన పని ( అతని దృష్టిలో ) తనే చేసాడు ప్రిస్టేజ్‌కు భంగం రాకుండా రహస్యంగా.

డాక్టరు వచ్చేలోపల యింకో అరడజను సార్లు రింగ్ చేసాడు. డాక్టరు వచ్చి తనను పరీక్షించి రామ్‌గోపాల్ భుజం తట్టి, 'వర్రీ

> **కాన్వెంటు ఏడుపు !**
>
> రోడ్డుమీద కాలుజారి
> అడ్డంగా క్రింద పడితే
> ఇంగ్లీషు చదువుల
> కాన్వెంటు బాబు
> ఏడ్చె 'అమ్మా' అని, 'మమ్మీ'మరచి
>
> —ఆచార్య శ్రీపతి నాయుడు

అవకండి. సింపుల్ అనాల్జిసిక్ ! టాబ్లెట్‌కు పదిహేను నిముషాల్లో రిలీఫ్ వస్తుంది' అని చెప్పి వెళ్తుంటే—

"డాక్టరుగారూ ! మా రంగడు ఎప్పుడూ అంటూ వుంటాడు యింగువ పట్టు వేసుకుంటే తలనెప్పి అట్టే మాయమవుతుందని. మరి ఆ కుండమీద యింగువ సాది వేసుకుంటే ఇన్‌ఫెక్షన్ రాదా ?"

"మీకెందుకొచ్చిందా డౌట్?"

"మా నమ్మకమైన సర్వెంటు వాడు. యీరోజు తలనొప్పిగా వుందని ఇంగువ సాది వేసుకున్నాడట. ఏదైనా ఇన్‌ఫెక్షన్ అయితే మిమ్మల్నడిగి మెడిసిన్ ఇప్పించాలని"

వెనుకనుండి వింటున్న నిర్మల ఆశ్చర్యపోయింది, డాక్టర్ దగ్గరకూడా ప్రిస్టేజ్ !

తలనొప్పి తగ్గే వరకు అలాగే నుదురు వత్తుతూ కూర్చున్న భర్త ప్రేమకు కరిగిపోయింది.

"ఇక్కడ నిల్చుండిపోయావేంటి వదినా ? అన్నయ్యేమన్నారు?" సురేఖ కుదుపడంతో తేరుకుని 'పద వెళ్దాం' అంది.

* * *

"వదినా ! కడుపులో నొప్పెక్కువగా వుంది"

డ్రైవర్‌ని త్వరగా పోనివ్వమంది నిర్మల.

సురేఖ కోటీశ్వరుడి చెల్లెలే కావచ్చు. పడవలాంటి కారులో ప్రయాణం చేస్తూ వుండొచ్చు కానీ యీ టైమ్‌లో నిస్సహాయంగా మునిపంటితో తన నొప్పిని బిగపట్టడానికి ప్రయత్నిస్తుంటే వాళ్ళన్నకు ప్రిస్టేజ్ మీదున్న మమకారానికి కోపమొచ్చింది నిర్మలకు.

ఆ అమ్మాయి వీపుమీద చేయివేసి నిమురుతూ మెల్లిగా అడిగింది.

"పోనీ వెనక్కు వెళ్ళిపోదామండీ గూడూరులో నర్సింగ్‌హోమ్‌లో చేర్పిద్దాం"

"నీకు అంతా కంగారే నిర్మలా. మా ఫ్రెండ్ భార్యకు సిసేరియన్ చేయాలంటూ భయపెట్టేసారు మరుసటి రోజు ఫోర్‌సిప్స్ వేసి డెలివరీ చేసేసారు అలాగే మన సురేఖకు కూడా ఈజీగా అయిపోతుంది. నీవేమీ భయపడకు" అంటూ నిద్రలోకి జారిపోయాడతను.

భర్త ధైర్యానికి విస్తుబోయింది— కారు ఒక్క కుదుపుతో ఆగిపోయింది.

"ఏమయింది డ్రైవర్ ! " అసహనంగా అంది సురేఖ.

"ట్రాఫిక్ బంద్ అయినట్లుందమ్మా!" ముందుకు వంగి పరిశీలిస్తూ జవాబుచెప్పాడు.

"నాకు మోషన్‌కెళ్ళాల్సినట్టు ంది వదినా" వినీ వినిపించకుండా అంది సురేఖ.

అటుఇటు చూసి 'కాస్త దూరం వెళ్ళాలి' ఆ చెట్టు ప్రక్కగా ఏదో చిన్న ఇల్లు వున్నట్లుంది. అక్కడివరకు నడవగలవా?'

నడవగలనన్నట్లు నీరసంగా తలూపింది సురేఖ

ఆ చిన్న ఇంట్లోకి అవసరానికెళ్ళడమూ ప్రిస్టేజికి భంగమంటాడేమోనని తన భర్తకు నిద్రాభంగం కాకుండా మెల్లిగా కారు దిగి సురేఖను నడిపించుకుంటూ ఆ చిన్న ఇంటి ముందుకెళ్ళింది నిర్మల.

"నిండు చూలాలు! ఇప్పుడే పురుడువచ్చేలా వుంది. ఎక్కడికెళ్తారు. ఇక్కడే పురుడు పోసుకోండి తల్లీ" రాబోతుంటే ఆ చిన్న

## ప్రిస్టేజ్

ఇంటిలోని పెద్ద ముత్తయిదువ ఆప్యాయంగా అంది

మనసులోనే నవ్వుకుంది తన భర్త ప్రిస్టేజ్‌కిచ్చే విలువకు ఒకరోజు—

"నీకు మన స్టేటస్‌ను మెయిన్‌టెయిన్ చేయడమే రాదు నిర్మలా! అసలు నీవిలా కూర్చుని జామకాయ కొరుకుతుంటే ఎవరైనా చూస్తే నా ప్రిస్టేజి ఏమవుతుంది?"

ఫ్రిజ్‌లో యాపిల్ కోయించి వెండి పళ్ళెంలో నౌకరుచేత తెప్పించి ఆ వెండిపళ్ళెనికి క్రింద వున్న చిన్న టవల్‌తో ఆమె కందించి, యిష్టంగా తింటున్న చవకయిన జామకాయను వేస్ట్ పేపర్ బాస్కెట్‌లో పడేయించేవరకు యిష్టపడని తన భర్తను 'అందరూ తినే వరి అన్నం మీరు తినడం ప్రిస్టేజ్‌కు భంగం కదా!' అని అడిగేయాలనిపించినా అడగలేకపోయింది ఆరోజు—

* * *

"వెళ్ళొస్తాం పద వదినా!"

ఆ ముసలమ్మకు కృతజ్ఞతలు తెల్పుకుని బయటపడ్డారు!

* * *

కారులో కూర్చున్న సురేఖ అలసటగా, బాధగా వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది. ఒక్క గంట గడిచినా ట్రాఫిక్ బంద్ అలాగే వుంది.

"నీవెళ్ళి విషయమేమిటో కనుక్కో" డ్రైవర్‌ని పంపింది నిర్మల

అతను పదినిముషాల తర్వాత వచ్చి చెప్పిన న్యూస్ ఇది—

"ఒక సన్న బ్రిడ్జిమీదకు అటువైపునుండి లారీ, ఇటువైపునుండి బస్ వెళ్ళాయట లారీ డ్రైవర్ నేను లైట్లేసాను, నువ్వెందుకొచ్చావు కళ్ళు కన్పించడంలేదా? అన్నాడట— అంతే. బస్‌డ్రైవర్ బస్ ఆపేసి కళ్ళు కన్పించడంలేదని నన్నంటావా? అంటూ పేచీకి దిగాడట ఇద్దరూ రెచ్చిపోయున్నారట"

"అయితే మనం ఇప్పుడువెళ్ళే మార్గం ఏలా?" సురేఖ బాధ చూస్తుంటే ఆమెలో అసహనం పెరిగిపోతోంది.

"లారీ డ్రైవర్‌ని లారీ డ్రైవర్లంతా కలిసి నీవే ఎందుకు వెనక్కురావాలి— ఆ బస్ డ్రైవర్ వెళ్ళాడులే అని ఆపేసారంట— బస్

డ్రైవర్సు అంతా మనమేనా అంత చచ్చు వెధవలం నీవు వెనక్కు రావద్దంటూ బస్సు కదలనీయడం లేదంట వాళ్లు పట్టుదలలు వదలేవరకు ట్రాఫిక్ అలాగే వుంటుందంటున్నారమ్మా అటు, ఇటు రెండు ఫర్లాంగులు నిలబడిపోయిందమ్మా ట్రాఫిక్''

* * *

"నా వల్ల కాదొదినా యీ నొప్పి భరించలేకున్నాను యీ నొప్పితో నేను చచ్చిపోతానేమో అన్పిస్తోంది" ఎంతో గంట ఓపిక పట్టి ఇక భరించే శక్తి లేక అనేసింది సురేఖ.

సురేఖ మాటలతో ఉలిక్కిపడి లేచిన రామ్‌గోపాల్‌కు పరిస్థితి వివరించింది నిర్మల.

"చూడండి! మీరయినా వెళ్లి సురేఖ పరిస్థితి వివరించి వాళ్ళను కన్విన్స్ చేయండి"

రామ్‌గోపాల్ కారు దిగి వెళ్ళగానే సురేఖ బాధతో మెలికలు తిరిగిపోసాగింది సురేఖను చూస్తుంటే నిర్మలకు విపరీతమైన భయం కల్గుతోంది. ఎంతటి క్లిష్టతరమయిన కాన్పయినా ఒక డాక్టరు చేతిలో వుంచినపుడు నిశ్చింతగా వుండగలదేమోగాని నిస్సహాయ స్థితిలో నిర్మల, కళ్లల్లో నీళ్లు తిరుగుతున్నాయి.

"డ్రైవర్ నీ వెళ్లి ఎక్కడేదైనా చిన్న హాస్పిటల్ వుందేమో చూసిరా"

అతను పరుగులాటి నడకతో వెళ్లి పోయాడు.

* * *

కోటీశ్వరుడు రామ్‌గోపాల్ డబ్బు, ఇన్‌ఫ్లుయెన్స్ ఏవీ ఆ ఆవేశంలో వున్న యిద్దరి డ్రైవర్ల మూర్ఖత్వాన్ని సడలించలేకపోయాయి.

తను పరిస్థితి వివరించినా, డబ్బు ఇస్తానన్నా వాళ్ళ ఆవేశాలు, మూర్ఖత్వం వదలని, మానవత్వం లేనివాళ్ళను చూస్తుంటే 'ఇంత వివేకహీనులా వీళ్లు? చిన్న సర్దుబాటు అనే పదానికి అర్థం తెలియకుండా ప్రవర్తిస్తున్నా'రని అనుకున్న మరుక్షణం అతనికై అతను ఆత్మపరిశీలన చేసుకున్నాడు— అతనికి సురేఖ మెలికలు తిరిగిపోవడం, బాధతో మూలగడం చూశాక తను చేసింది పొరపాటే అని మొదటిసారిగా అన్పించింది.

'తను చేసిందేమిటి? డబ్బు వుందనే గర్వంతో ప్రెస్టేజ్ పేరిట తన చెల్లెల్ని తీసుక రాకూడని పరిస్థితుల్లో తన భార్య ఎంత వారిస్తున్నా వినకుండా సురేఖను సిటీలో డెలివరీ చేయించాలనే గొప్పతో తను వివేకాన్ని కోల్పోలేదూ!' అలా అనుకుంటూ నిస్సహాయంగా మౌనంగా వచ్చిన భర్తను చూడగానే నిర్మలకు ఆ చిన్న ఇంటిలో పెద్ద ముత్తయిదువ ఆహ్వానం గుర్తొచ్చింది.

"పోనీ ఆ చిన్న ఇంటి దగ్గరకయినా వెళ్దామండి! సురేఖకు కాన్పు నొప్పులొస్తున్నాయి"

"ఎక్కడేదైనా హాస్పిటల్ వుందేమో చూసొస్తాను" చెల్లెలి బాధ అతని ప్రెస్టేజ్‌ను మింగేసింది

"ఉహు ఎక్కడా లేదంట" డ్రైవర్ వెళ్లి తిరిగొచ్చాడు

"ఏమ్మా సురేఖా నడవగలవా? లేక నే నెత్తుకెళ్లనా?"

అంత విచారంలోనూ నిర్మలకు ఆశ్చర్యమేసింది యీ నడి వీధిలో చెల్లెల్ని ఎత్తుకుని ఆ చిన్న ఇంటికి తీసుకెళ్తానంటున్న భర్త మాటలకు విస్తుబోయింది.

"నేను నడుస్తానులే" అని మూలిగిన సురేఖ నాలుగడుగులయినా వేయలేక ఆ నడి రోడ్డులో కూలబడి పోయింది.

అమాంతంగా చెల్లెల్ని రెండుచేతులమధ్య ఎత్తుకుని ఆ వాహనాలను తప్పించుకుంటూ వడివడిగా ఆ చిన్న ఇంటికేసి వెళ్ళి బయట వేసివున్న నులక మంచం మీద సురేఖను పడుకోబెట్టాడు. అతని వెనకనే వచ్చిన నిర్మల లోపలికెళ్ళి ఆ ముసలమ్మను వెంటబెట్టుకుని వచ్చింది.

సురేఖను లోపలికి తీసుకెళ్ళిన పది నిముషాల్లో రామ్‌గోపాల్ ముఖంనిండా చిరు చెమటలు పోసాయి. అతనికిప్పుడు అదిచిన్న ఇల్లని గానీ, తన చెల్లెల్ని నులక మంచంమీద పడుకోబెట్టానని కానీ, అన్పించడంలేదు మంచి పేరున్నలేడీ డాక్టరు దగ్గర కాన్పు చేయించని మనిషి ఇప్పుడు ఆ ముసలమ్మ కాన్పు చేస్తే బాగుణ్నని కోరు కుంటున్నాడు.

నిర్మల బయట కొచ్చింది. ఆమె కళ్ళ నిండుగా నీరుచూసిన రామ్‌గోపాల్‌కు అంతా అర్థమయిపోయింది

"బిడ్డ శిరస్సు ఎక్కడో వుందట. ద్వారం అసలేర్పడలేదట. ఇవి మాత్రం కాన్పునొప్పులేనంటుందామె కళ్ళలో వున్న నీళ్ళు టప, టప క్రింద రాలాయి.

* * *

కారులో పడుకున్న సురేఖ బాధతో కేకలు పెట్ట సాగింది. సీటుమీద నిలవకుండా అటూ ఇటూ దొర్లుతోంది. సురేఖను ఆస్థితిలో చూసిన కోటీశ్వరుడు రామ్‌గోపాల్ కొన్ని క్షణాలు చలనం లేకుండా నిర్వీర్యుడైపోయి వెంటలే కర్తవ్యం వెన్ను తట్టగా మరలా ఆ ఇద్దరి డ్రైవర్ల దగ్గరకు పరుగెట్టాడు—

లారీ డ్రైవరు — బస్ డ్రైవర్ ఇద్దరూ కునుకు తీస్తున్నారు. వాళ్ళనులేపి "చూడండి మిస్టర్ ఇప్పుడు మీ రిలాగే పంతాలకు, పట్టింపులకు పోతే ఒక నిండు ప్రాణం మీ పట్టుదలకు బలయిపోతుంది. నా చెల్లెలు



ప్రసవ వేదనతో బాధ పడుతోంది మీ చెల్లెలే ఆపదలో వుందనుకుని మాకు దారివ్వండి' దీనత్వం అతని గొంతులో, కళ్ళల్లో వుంది ప్రిస్టేజి అనే పదం మర్చిపోయి ప్రాధేయ పడ్డాడు

అప్పటికే ప్రయాణీకులు చేసే హంగామాకు విసిగిపోయి బద్ధకంగా పడుకున్న ఆ డ్రైవరు రామ్‌గోపాల్ వెంట నడిచాడు సురేఖను చూడగానే అతని కాళ్ళిక అక్కడ ఆగలేదు అతను వెళ్ళిన పది నిముషాలకు వాహనాల్లో చలనం వచ్చింది

కారు కదిలే స్పీడ్‌కు చిత్రంగా సురేఖకు నొప్పులు ఆగి పోయాయి ఆ అమ్మాయి బాధతో మెలికలు తిరిగిపోవడం ఆగిపోయింది కానీ ఒళ్ళంతా చెమటతో తడిసిపోయింది.

అప్పటి వరకు మౌనంగా మనస్సు లోనే దుఃఖిస్తున్న నిర్మల కొంత స్థిమితపడింది. రామ్‌గోపాల్ తన చెల్లెలుకు సుఖంగా ప్రసవమయితే చాలని కోరుకున్నాడు. అతని మనస్సు అస్థిమితంగా వుంది

కారు సూళ్ళూరు పేటకు రాగానే ఎద్దైనా హాస్పిటల్‌కు తీసుకెళ్ళమన్నాడు—హాస్పిటల్‌లో డాక్టరు దగ్గరకు తనే స్వయంగావెళ్ళి చెల్లెల్ని చూపించాడు

అప్పటికే సురేఖ చాలా నీరసంగా వుంది. కళ్ళు మూసుకుని నిస్తేజంగా ఎగ్జామినేషన్ బోర్డు మీద పడుకుంది.

## ప్రిస్టేజ్

సురేఖపల్స్ చూడగానే డాక్టర్ ముఖం మలినమయింది ఆమె హిస్టరీ వినగానే ఆమెకంతా అర్థమయిపోయింది సురేఖను ఎగ్జామిన్ చేసి హడావుడిగా నర్సులను థియేటర్ రెడీ చేసుకోమని రామ్‌గోపాల్-నిర్మల వున్న చోటు కొచ్చింది

"ఆ అమ్మాయిని హాస్పిటల్‌కు తీసుకరావడం చాలా ఆలస్యం చేసారు, ఆ పేషెంటుకు గర్భకోశం పగిలిపోయి లోపలే విపరీతంగా రక్తస్రావం జరిగింది మా థియేటర్ రెడీ అయేలోపల ఆ అమ్మాయి కండిషన్ బాగుంటే ఆపరేషన్ చేస్తాను కానీ నాకే హోప్స్ లేవు . ఇంతకూ పేషెంటుని ఈ కండిషన్‌లో తీసుకరావడానికి కారణమేమిటి ? ఎవరో చదువు లేని వాళ్ళయితే సరే—మీరు ఎడ్యుకేట్సు అయి వుండీ ఇలా ఎందుకు చేసారు ?' వాళ్ళ జవాబుకు ఎదురు చూడకుండానే హడావుడిగా వెళ్ళిపోయిందామె

నిర్మల కళ్ళెత్తి భర్త వైపు చూసింది అతను దీర్ఘంగా శూన్యంలోకి చూస్తూ ఆలోచిస్తున్నాడు

ఆ దంపతులిద్దరూ అసహనంగా, అస్థిమితంగా, అసహాయంగా, ఆర్తిగా, ఆవేదనగా మూగవాళ్ళులాగ అక్కడేవున్న బెంచి మీద కూలబడిపోయారు పదినిముషాలకు నిర్మలే తేరుకుని సురేఖ దగ్గరకు నడిచింది.

థియేటర్ రెడీ చేసుకునే వ్యవధిలోనే సురేఖ నిర్జీవురాలైంది బాధలకు, గొప్పలకు, కోరికలకు అతీతంగా, ప్రశాంతంగా పడుకుని వుంది -తన వాళ్ళకు శాంతి మిగిల్చి

నిర్మల నిర్లిప్తంగా కూర్చుండిపోయింది ఆమె గొంతులో బాధ సుడులు తిరుగుతోంది ఆమె చేతులతో పెంచిన 'సురేఖ ఇకలేదు'అనుకుంటే ఆమె భరించలేకపోతోంది ఆమె కళ్ళ నుండి ధారాపాతంగా కన్నీళ్ళు కారిపోతున్నాయి — మోకాళ్ళ మీద తల ఆన్చి రోదిస్తోంది

రామ్‌గోపాల్ అంతరాత్మ అతన్ని నిలదీస్తోంది — 'దీనికి కారకులెవరు ? ప్రిస్టేజ్ వివేక శూన్యమైన ప్రిస్టేజ్ పట్టుదల తను కోట్లకధిపతి అనే గర్వంతో విచక్షణా జ్ఞానం నశించి తన భార్య ఎంతగా చెప్తున్నా వినకుండా తన చెల్లెలు సిటీలో తమ స్టేటస్‌కు సరిపడే కాస్ట్లీ హాస్పిటల్‌లో పురుడు పోసుకోవాలనే పట్టుదల, నలుగురూ 'రామ్‌గోపాల్ తన చెల్లెల్ని ఎంత కాస్ట్లీ హాస్పిటల్లో చేర్పించాడు' అని అనుకునే స్టేటస్ అతనికి కావాలి

పురుష మగతనంతో అతని కళ్ళకున్న ప్రిస్టేజి పొరలు కరిగిపోయి ఒక్కొక్క కన్నీటిబొట్టుగా జారిపోతున్నాయి.

సురేఖ మృత శరీరాన్ని కారులో పడుకోబెట్టారు. ఆ పిల్ల మరణం డ్రైవర్‌ని కూడా చలింపజేసింది సురేఖమ్మ మరణానికి కారణం ఎవరు ? ఆ డ్రైవర్ మనసులోనే ఆలోచిస్తున్నాడు

సురేఖమ్మ మరణానికి కారణం అయ్యగారి ప్రిస్టేజా ? లేక చిన్న పర్పాటుని అంగీకరించలేని డ్రైవర్లదా ? లారీ డ్రైవర్ లైటేసిన మాట వాస్తవమే— బస్ డ్రైవర్ తొందరలోనైతేనేమి లేదా పొగరు వల్లే అయితేనేమి ఆ చిన్న బ్రిడ్జి మీదకు వచ్చేసిన మాట వాస్తవం. పోనీ అతను వచ్చేసాడు ఎంత క్షణంలో ఆ బ్రిడ్జి దాటిపోతాడు లారీ డ్రైవర్ వెళ్ళిపోతాడు. కానీ జరిగిందేమిటి ? ఆ చిన్న విషయానికి పట్టుదలలు పెరిగిపోయాయి ఒక్కక్షణం ఆలస్యాన్ని భరించలేని లారీ డ్రైవర్ మూడుగంటలసేపు ట్రాఫిక్‌ను ఆపేసాడు. ఆ పట్టుదలకు ప్రాణం పోసిన ఆ లారీ డ్రైవర్లు అతన్ని మన ప్రిస్టేజ్ పోతుంది బస్సే ఎందుకు వెనక్కు వెళ కూడదు - అనే



CHAITRA-G-120 TEL

# త్రివిధచర్యగల ట్రిలో నీలి డిటర్జెంట్ బిళ్ళ

## మరే ఇతర పేరెన్నికగన్న డిటర్జెంట్ బిళ్ళలకన్న 25% ధర తక్కువ




ట్రిలో వలన ఎంతో బాగుగా నురుగు—గనక మీరు మరెన్నో బట్టలను ఉతికేవీలు మరే ఇతర డిటర్జెంట్ బిళ్ళ కన్న ఎక్కువగా!

ట్రిలో మరెంతో బాగా ఉతుకుతుంది—బాగా మురికి పట్టిపిన మీ బట్టల్ని కూడా ఉతికే శక్తి గలది. మీ బట్టలు తెల్లగా, తాజాదనం చిందేలా చేసేందుకుగాను మీకిది ముందు ఇవ్వబడింది.



ట్రిలో ఎంతోకాలం అది వస్తుంది— అది ముద్దగా అయిపోదు గనక పూర్తిగా అరిగిపోయేదాకా వాడే వీలు.

త్రివిధ చర్యగల కొత్త ట్రిలో మరెంత మేలైనదో చూడండి!

గోద్రెజ్ ఉత్పాదన

# ప్రిస్టేజ్

మూర్ఖత్వం – పోనీ ఎవరో ఒకరు సర్దుకో వచ్చు కదా! ఆ బస్ డ్రైవర్, మిగతా బస్ డ్రైవర్లంతా అదే పదం కోసం అతన్ని వెనక్కు రానీయలేదు ఇందులో ఎవరిది తప్పు? ఏది ఏమైనా సురేఖమ్మ ప్రాణాన్ని వీళ్ల ప్రిస్టేజ్ బలికొంది.

సురేఖ మరణానికి చలించిపోయి ఆలోచిస్తున్న ఆ ధనవంతుల కారు డ్రైవరు తేరుకొని కారు స్టార్ట్ చేసాడు

రావ్ గోపాల్ మనసునిండా పశ్చాత్తాపం– ఆ పశ్చాత్తాపం అతన్ని కాల్చేస్తోంది తన ముద్దుల చెల్లెలి మరణం అతడ్ని, అతని అజ్ఞానాన్ని వెన్నుతట్టి హెచ్చరిస్తోంది. అతనికి తన మనస్తత్వం మీదే అసహ్యమేస్తోంది. అతను ఆలోచిస్తూ రోదిస్తున్నాడు. డబ్బుందనే అహంకారం, సామాన్యులు చేసే పనులు తను చేయకూడదనే అభిజాత్యం 'ప్రిస్టేజ్' అనే పదం నరనరాల్లో జీర్ణించుకుపోయాయి. ఆ ప్రిస్టేజ్ పేరిట తన చెల్లెల్ని దూరం చేసుకున్నాననే సత్యం అతన్ని పిచ్చివాణ్ని చేస్తోంది. యింకొక ప్రాణి యీ భూమ్మీద పడాల్సిన తరుణంలోవున్న ప్రాణినే బలిచేశాడు. అతను పిల్లాడిలా ఏడుస్తున్నాడు.

భర్త చెల్లెలుగా గాక తన స్వంత చెల్లెలుగా చూసుకున్న సురేఖ మృత శరీరాన్ని చూస్తూ – డాక్టరు "సకాలంలో ఆమెకు ఆపరేషన్ జరుగుంటే తల్లీ బిడ్డా క్షేమంగా వుండేవాళ్ళు" అని అన్నమాటే ఆమె చెవుల్లో గింగుర మంటోంది – సకాలంలో ఆపరేషన్ జరగకపోవడానికి కారణం తన భర్త. ఎప్పుడూ ప్రిస్టేజి నభిమానించే తన భర్తే సురేఖ మరణానికి కారకుడు

తన ఆనందాలు, తన ఇష్టాలు ప్రిస్టేజ్ పేరిట సమాధి అయినా భర్త పరిధిలో తనూ మెలగడం నేర్చుకుంది. దానికి కారణం అతని ప్రేమలో ఆమె కరిగిపోవడమే.

కానీ...కానీ ఇప్పుడు ప్రిస్టేజ్ పేరిట ఒక నిండు ప్రాణం పోవడంతో తను భర్తను క్షమించలేకపోతోంది భర్తను 'మీ ప్రిస్టేజ్ సురేఖను చంపింది" అని కసిగా, క్రోధంగా విసురుగా తలెత్తి అడగాలనుకున్న మాటలన్నీ అతను కార్చే కన్నీటిని చూసిన పెదవి దాటి బయటకు రాలేదు. 

## అవీ ఇవీ అన్నీ

### నాగార్జున విశ్వవిద్యాలయం
### నవలల పోటి

నాగార్జున విశ్వవిద్యాలయం వారిచే 1981—1982వ సంవత్సరానికి నిర్వహింపబడే "శ్రీ శే ఉన్నవ లక్ష్మీనారాయణ స్మారక బహుమతి" సాంఘిక నవలా రచనా పోటీకి ఈ క్రింద ఉదహరింబడిన నిబంధనల మేరకు 1981లో రచించబడిన నవలలు 15 1 1983 తేదీలోగా, రిజిస్ట్రారు, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జున నగర్ — 522 510, వారి కార్యాలయానికి చేరునట్లు పంపాలని ఒక ప్రకటనలోవారు తెలియజేస్తున్నారు.

నవలా రచనకు ప్రవేశరుసుంలేదు. వ్రాత పూర్వకంగా ఉన్నవి లేక ముద్రింపబడిన నవలలు పోటీకి పంపవచ్చు

ఈ పోటీకి పంపు నవలలు మరి ఏ ఇతరసంస్థ నిర్వహించిన పోటీలో బహుమతి పొందివుండరాదు

ఎన్నిక చేయబడిన ఉత్తమ నవలకు — 1000రు. బహుమతి ఇవ్వబడును ఇతరవివరాలకి నాగార్జున విశ్వవిద్యాలయం రిజిస్ట్రారు పేర నాగార్జుననగర్—522 510 కి వ్రాయాలి.

### డిస్కో నైట్

'కళాసాగర్' వారు మద్రాసులోని కలైవాణర్ అరంగం (ఏసి) లో 'డిస్కో నైట్' ఏర్పాటు చేశారు ఈ కార్యక్రమంలో సినీతార పూర్ణిమ వ్యాఖ్యానం చెప్పడం, అప్పటికప్పుడు ఒక పాట పాడటం విశేషం సింగర్స్‌గా జి ఆనంద్, ఎస్ పి శైలజ, వేణుగోపాలరావు, వి ఆనందరావు, వి వరప్రసాదరావు, మొహ్మద్, జి సుజాత,ఎం. సుశీలారాణి, వి రాధాదేవి పాల్గొనగా డిస్కో డాన్సర్స్‌గా డిస్కో క్వీన్ స్వర్ణలత, 'మిస్టర్ డిస్కో' ప్రకాష్ పాల్గొన్నారు. శ్రీ డి వీరభద్రరావు సారధ్యంలో డిస్కో మ్యూజిక్ వినిపించారు ముఖ్య అతిధిగా ఇన్‌కంటాక్సు కమీషనరు శ్రీ గోపాలకృష్ణమూర్తి విచ్చేశారు

### గణపతి రామాయణ సుధ

బాలకాండ రచన శ్రీ చర్ల గణపతిశాస్త్రి. 225 పేజీలు. వెల 15 రూపాయలు ప్రతులకు రచయిత పేర, 33 కిర్లంపూడించ్‌క్వార్టర్స్, ఆంధ్రా యూనివర్సిటి. వాల్తేరు—3 అన్న చిరునామాకు వ్రాయాలి.

### తాండవం

కవితా సంకలనం. రచన కె. రాజశర్మ 80 పేజీలు. వెల 5 రూపాయలు. ప్రతులకు రచయిత పేర ఆకాశవాణి కళాకారులు, వేములవాడ, కరీంనగర్ జిల్లా అన్న చిరునామాకు వ్రాయాలి. ★

# ఎంగిలాకు

## డి. లక్ష్మణాచార్య




ప్రొదు పొడిచింది !

మహానగరంలో భళ్ళున తెల్లవారింది. అందమైన ఆ నగరం తన కసహ్యమంటూ దూరంగా విసిరేసిన మురికివాడలో—ఒక దినం గడిచిపోయింది జీవన్మరణాల మధ్య కొట్టుకులాడుతున్న రోగిష్టికి గడచిన దినంలా.

సూర్యుడు రోజూ వస్తున్నాడు, అస్తమిస్తున్నాడు. కాలం, వేసవిలో హిమాలయాల్లా కరిగిపోతోంది కాని ఆ వాడలోని మురికి [illegible], పెనవేసుకున్న ఆ వాడని వదలడం లేదు, శీతాకాలంలోని నూతన దంపతుల కౌగిలిలా.

ఉదయించిన ఆ విరటిసూర్యుడు, వాడ ప్రజలకు పగతో తమ ఆకలి ప్రాణాలపై దండెత్తడానికి వచ్చిన శత్రువులా కన్పించాడు. నిద్ర దేవుడు వారికిచ్చిన ఒక్కగానొక్క వరం !

ఎంకటేశం నిద్రలేచాడు. సూర్యుడి వేడి వాడిని తట్టి మరీలేపింది దానికి తోడు—మూడురోజులక్రితం ప్రారంభమై తారాస్థాయికి చేరిన ఆకలి మంట !

లేచికూర్చున్నాడు కళ్ళునులుముకొన్నాడు. వాడికి ఎదురుగా—ప్రవహించే మురికి కాలువ నల్లనాగులా ! ప్రక్కగా—కూలడానికి సిద్ధంగా వున్న పాత గుడిసెలు ! అందులో పేదరికానికి పెద్దసంతానంగా పుట్టి పెరుగుతున్న చీకటి జీవితాలు !

వాటికి దూరంగా—అందమైన నగరంలోని ఎత్తైన అంతస్తులు. పడుచు కన్నె అందమైన మొఖాన్ని వికృతంగా మార్చాలని పయత్నించే నల్లని మచ్చలా—ఆ నగరం ప్రక్కన, ఈ వాడ !

కాలువలోని మురికి కంపు గుప్పున కొట్టింది ఎంకటేశానికి అదివాడికి క్రొత్త గాదు. సుగంధానికీ వాడికీ భూమ్యాకాశాలకున్నంత దూరం.

కాలువలోని మురికి జీవాలు ఆత్రంగా ఏదో తింటూంటే వాటిపై వాడికి ఈర్ష్య కలిగింది.

"ఎదవ బతుకు ... ఈ పంది నయం నాకంటే..." ఎంకటేశం పసిమనస్సు అసహ్యించుకుంది తనను తానే.

ఎంకటేశానికి ఎనిమిదేళ్ళుంటాయేమో !

చింపిరి జుత్తు, ఎండిపోయిన గరకలా !

లోతుకుపోయిన జీవం లేనికళ్ళు— ఇంకిపోయిన గుంటలా ! వెన్నుతోకలవడానికి ఉరకలేసే కడుపు ! ఏ ఆచ్ఛాదనాలేని ఎదుర్రొమ్ము! దాని క్రింద తమ ఉనికిని తెలియజేసే బొమికల గూడు !— ఇది వాడి ఆకారం.

ఏ భావకవైనా వాడిని చూస్తే, భావ కవిత్వానికి బదులుగా సంఘంపైని కోపం, ఆ అనామకుడిపై దయ- రెండూ కలగలుపుగా అతడి కలంలోంచి రాలడం ఖాయం.

ఎంకటేశంపుట్టిందెక్కడో తెలియదు !

ఒక ఆడది క్షణికమైన కామ వాంఛకు లోబడటం, ఆ మత్తులో భవిష్యత్తును మరిచిపోవడం, తీరా తెలిశాక తన చుట్టూ వున్న సంఘానికి భయపడటం, తనముందు జీవితం సాఫీగా కొనసాగడం కొరకు పసివాడి జీవితం అంధకారం చేయడం ...

ఇది మహానగరాల్లో జరగడం మామూలే! అదే ఎంకటేశాన్నీ మురికి వాడ కప్పగించింది. మురికిలోనే పెరగమని, చీకటిలోనే చావమని తీర్పు నిచ్చింది.

తనకా పేరు ఎవరు పెట్టారో కూడా వాడికి తెలియదు. ఆ వాడలోని వారంతా తనను 'ఎంకటేశం' అని పిలిచారు. అదే తన పేరనుకున్నాడు.

వాడికి ప్రపంచమంటేనే కాదు ఈ మనుషులంటే ఎవరోకూడా అర్థంకాదు. బాధేస్తే 'అమ్మా' అనాలని గూడా తెలియదంటే వాడు పెరిగిన పరిస్థితుల కన్నా ఒక దట్టమైన అడవి నయమనిపిస్తుంది. అయినాఎంకటేశం కొరకని కాలగమనం ఆగుతుందా? దాని పరుగులో వాడు ఎనిమిదేళ్ళ వాడయ్యాడు.

ప్రతిరోజూ నగరం రోడ్డుమీదకెక్కడం, ఏ పెద్దహోటల్ వద్దనో కాసుక్కూర్చొని చెత్తకుండీలో పడబోయే ఎంగిలాకులకై ఎదురుచూడటం, అవికుండీలో పడగానే తన లాగే వానిపై లంఘించే శునక నేస్తాలతో పోటీ పడటం, నాలుగెత్తుదింటిని చే జిక్కించుకొని దూరంగా వెళ్ళి తినెయ్యడం, ఏ చెట్టు నీడనో నిద్ర పోవడం.

ఇది వాడి దినచర్య!

మళ్ళీ మెలుకువ రాగానే మరో హోటలు! కుక్కలతో పోరాటం, ఎంగిలి విస్తర్ల హస్తగతం... ఆ తర్వాత నిద...

'ఆకలేస్తే తినాలి' అనే వ్యూహ తెల్సిం దగ్గర్నుండీ వాడికి తట్టిన ఉపాయం ఇదొక్కటే.

ఎంకటేశం లేచి నుంచున్నాడు.

తనను వెన్ను చరిచి లేపిన పొద్దు తొందరగా పరుగెత్తాలని ప్రయత్నిస్తుంటే వాడికి కోపం వచ్చింది.

వాడు నడుస్తుంటే చిరిగి పీలికల్లా ఊగులాడే నల్లటి పాత నిక్కరు, చీకటి జీవితాల జాతీయ పతాకంలా వుంది.

ఎప్పటి మాదిరే రోడ్డు ఎక్కి చెత్తకుండీ వైపు నడిచాడు వాడి కడుపులో ఆకలి — శ్మశానంలోని మంటలా!

హోటల్ ప్రక్కకు చేరాడు ఎంకటేశం.

అక్కడ అతనేగాక తన లాగే మరో ఇద్దరు పిల్లలు!!

దేశమాత నుదుటన వున్న వంకర గీతలకు ప్రతినిధుల్లా.

"ఈళ్ళందరి కన్న కుండీ కాడికి నేనే ముందురకాల."

పసివాడి మనస్సు నిర్ణయించుకుంది. ఆ నిర్ణయం అందరి మెదళ్ళలో మెదిలేదే అని వాడికి తెలియదు అది వాడి అమాయకత్వంగాదు- పసితనం!

చెత్తకుండీలో ఎంగిలాకులు పడ్డాయి.

'విజిల్' ఊదగానే పరుగు పందెంలో పరుగెత్తే ఆటగాళ్ళలా —పోటీ ప్రారంభమైంది — చెత్తకుండీవద్ద — ఆకలి జీవాల మధ్య—ఎంగిలి విస్తర్లకై.

అనుకున్న విధంగా ముందు ఎంకటేశం పడ్డాడు.

శునక నేస్తాలు వికృతంగా ఘర్జించాయి.

ఎంకటేశం పట్టుకున్న ఎంగిలాకులపై పడ్డాయి.

ఎంకటేశం వానిని వదలేదు.

కుక్కల గొంతులో 'గుర్రు' ఎక్కువైంది. తత్ఫలితంగా పసిచేతులురక్తసిక్తాలయ్యాయి కుక్కల కోర దంతాలు వాడి చేతుల్లోకి దిగాయి చిరిగిన నిక్కరును మరింత చించాయి. ఎంకటేశం చేతుల్లోని ఎంగిలాకులు వాటి నోట్లోకి పోయాయి

పేదవాడికి దొరికిన పెన్నిధి చెయిజారిపోయినప్పుడు కలిగే బాధ — ఎంకటేశం కళ్ళలో!

నడి సముద్రంలో మునిగిపోయే వాడికి ఆధారం దొరికి వెను వెంటనే జారిపోయినప్పుడు కలిగే భయం ఎంకటేశం మొగంలో!

తను గాయపడ్డాననే బాధ లేదు వాడికి చేతికందిన నాలుగు మెతుకులు నోటివరకూ రాలేదనే బాధ!

ఎంకటేశం వెనుదిరిగాడు- నగరం రోడ్డు మీది నుండి మురికివాడలోకి!

* * *

కళ్ళు తెరిచాడు ఎంకటేశం భూమి తిరుగుతూన్నట్లుగా అనిపించింది వాడికి

సూర్యుడు ఆ ప్రదేశాన్ని తనివితీరా కాలుస్తున్నాడు

కాలుతున్న పెనంలా వుంది వాడి వొళ్ళు

తలమీద సుత్తెతో ఎవ్వరో కొడుతున్నట్లు ..

శరీరంపై పదునైన సూదులతో గుచ్చుతూన్నట్లు...

కాళ్ళను విడదీసి ఎవ్వరో లాక్కుపోతున్నట్లు ...

కుక్కలు చేసిన గాయాలకు జ్వరం వచ్చింది. ప్రొద్దు నడినెత్తిమీది కెక్కుతున్నా వాడికి మెలుకువ రాకుండా చేసింది.

అయినా ఆకలి మంట ముందు ఇవన్నీ వాడికి తక్కువే అనిపించాయి. ఎక్కడికి పోవాలో అంతుచిక్కలేదు.

'కుండీ' గుర్తొచ్చినా వెనువెంటనే కుక్కలూ గుర్తొచ్చాయి

పసిహృదయం భయపడింది.

శరీరానికి, తలకూ మట్టి అంటుకున్నా దులుపుకోవాలన్న ధ్యాస లేదు వాడికి

నడుస్తున్నాడు అగమ్యంగా .. వాడిని ఆకలి నడిపిస్తోంది

మురికివాడ నుండి బస్సు రోడ్డుమీదికి... అక్కడనుండి బస్స్టాండుకు .. ఆయాసంతో రైల్వేస్టేషన్‌కు .

స్టేషన్‌లో ప్రయాణీకుల కోలాహలం! ఎవరి సందడి వారిది ఏదీ పటించుకునే స్థితిలో లేడు ఎంకటేశం

ఆకలి ఆకలి . ఆకలి ..

వాడి కళ్ళలో అదే .. వాడి చూపుల్లో అదే . వాడి అడుగుల్లో అదే .. నాలుగు చక్రాల బండిపై అరటిపండ్లు కన్పించాయి. ఎర్రటి కమలాలూ, మెరిసే దాక్షలూ కనిపించాయి

ఆకలి వీపు చరిచింది— అడుగు ముందుకు వేసాడు. బండి పక్కనే చేతిలో చాకుతో, మీసాలతో 'మనిషి' కన్పించాడు 'కుండీ' దగ్గరి కుక్కలు గోచరించాయి అతడిలో

భయం వెంప చరిచింది — వేసిన అడుగు వెనక్కువేసాడు

అంతా రణగొణధ్వని ! 'మైక్' లో ఏదో చెపుతున్నారు అయోమయంగా వుంది

మైకు విన్న ప్రయాణీకుల్లో సందడి మరీ ఎక్కువైంది.



ప్లాట్‌ఫాం మీదకు నడిచాడు ఎంకటేశం.

ఇంతలో వాడి దృష్టి పట్టాల మీదికి మళ్ళింది.

కళ్ళు మెరిశాయి! లోతుకు పోయినాగాని ఆ కళ్ళలో ఆ క్షణం ఆనందం తొణికిసలాడింది

లాటరీలో లక్షరూపాయలు పొందిన వ్యక్తి అనుభవించే అనుభూతి కంటే ఎక్కువే ఆ ఆనందం!

దారిన పోయే పేదవాడికి పెన్నిధి కన్పించినప్పుడు కలిగే సంతోషం కంటే కూడా ఎక్కువే ఆ ఆనందం!

పట్టాల మధ్య మెతుకులు చాలా అతుక్కొని వున్న ఎంగిలాకు!

దాన్ని చూసిన వాడి కడుపులోని ఆకలి, కాళ్ళలోకి దిగింది.

నడవమని శాసించింది!

వాడి అడుగుల్లో ఉత్సాహం!

ప్లాట్‌ఫాం నుండి... పట్టాల పైకి దూకాడు. "దూక గలనా లేదా" అనే

## ఎంగిలాకు

ఆలోచనను ఆకలి అడుగుకు నొక్కేసింది.

దూకేముందు దాదాపు దగ్గర వరకూ వచ్చిన ఎక్స్‌ప్రెస్ రైలును వాడు చూడలేదు

రైలును చూసిన ఎంకటేశం, పిల్లిని చూసిన ఎలుకయ్యాడు

వెంటనే ప్లాట్‌ఫాం ఎక్కలేదు

ఆకలి వాడిని ఎక్కనివ్వలేదు

అదిచూసిన ప్రయాణీకుల్లో కోలాహలం!

ఎంగిలాకును అందుకొని ఎక్కాలని వాడి తాప్రతయం.

### అంకితం

— సమాజానికి దూరంగా విసిరివేయబడ్డ అమాయకులంతా "ఎంగిలాకు" ల్లాంటి వారు. వారికి సానుభూతితో ఈ కథ అంకితం.

—రచయిత

రైలు దగ్గరి వరకూ వచ్చింది.

ఎంకటేశం ఎంగిలాకు పైకి వంగాడు.

ఎంగిలాకును అందుకున్నాడు

రాక్షసిలా వచ్చిన రైలు – ఎంకటేశం రక్తాన్ని త్రాగి, కిర్రుమంటూ అరుస్తూ కొద్దిదూరంలో ఆగింది

మునుల రక్తాన్ని త్రాగిన మారీచుని మూతిలా వున్నాయి–రైలు చక్రాలు!

రైలును వెనక్కుపోనిచ్చారు.

అనంత వాయువుల్లో ఎంకటేశం విడిచిన ఆఖరి శ్వాస!

చేతులతో గుండెకు హత్తుకున్న ఎంగిలాకు మాత్రం గాలికి రెప రెప లాడుతూ కన్పించింది

అందులోని తెల్లని మెతుకులు రక్తంలో తడిసి ఎరుపెక్కాయి!

స్టేషన్ బయట జవహర్ విగ్రహం!

ఆయన కళ్ళల్లో అనామకుడి ఆఖరి శ్వాస చిలికించిన వెచ్చటి కన్నీళ్ళు!!

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

నటరాజా రామకృష్ణ :

కేవలం పాండిత్యం— అది ఏ రంగానిదైనా బొమ్మరాట వంటిది. దానిని చూచి మనం విస్తుపోతాము. కనుబొమలెగరేస్తాము, కళ్ళు పెద్దవి చేసుకుంటాము. అంతే. దాని ప్రభావం కేవలం కుతూహలదఘ్నమే. హృదయ దఘ్నం, మనోనిష్ఠం కాదు. నేను నా అవారా జీవితంలో ఎందరినో పేరుమోసినవారిని చూచాను. నోహో అనుకున్నాను. కాని నన్ను వినమ్రుని చేసిన మహామహోపాధ్యాయ మాధవ శాస్త్రి భండారీ వంటివారు కొందరే ఉన్నారు. వారిది బొమ్మరాట కాదు. వారు అపారపారావారం. అంతటినీ అంతరంగంలో ఇముడ్చుకుని, చల్లని చేతులతో ఎదుటి వారిని ఆత్మీయులను చేసుకునే మనస్తత్వం వారిది. సుగృహీత నామధేయులు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులను గురించి చెప్పేవారు. ఆ కవి తార్కిక సింహుడు, కవి గండభేరుండుడు పసిపాపల చేతి చిలుకై, వారిలో ఒకరయి వారిలాగే నవ్వులపువ్వు, కురిపించే వారట. ఏ రంగంలోనైనా పాండిత్య పాథోనిధుల స్వభావం అలాటిది. భారత కళా ప్రపూర్ణులు. మిత్రులు నటరాజ రామకృష్ణ కూడ ఆ కోవకు చెందినవారే. ఆ కళాసాగరుని ఎదుట ఉన్నప్పుడు ఆశ్చర్యం కల్గుతుంది. కాని ఆ ఆశ్చర్యంలో అదురు బెదురులు లేవు. అనంతమైన ఆదరం ఆవిర్భవిస్తుంది. ప్రపంచ నాట్య రీతులను బానిసలుగా ఏలిన ఆ నటరాజు సాహచర్యం మనకు భయం కలిగించదు. మనమూ కొంత నేర్చుకుందాం. కొన్ని రత్నాలు ఏరుకుందాం అనే వినీతత్వంవిరబూయిస్తుంది. రామకృష్ణ వినయ సంపద ఆయన కళా సంపదతో పోటీపడుతుంది. ఈ రెండింటినీ మించేది ఆయన నిరాడంబరత. ఆయన నృత్య నికేతన్‌లో అడుగు పెట్టగానే డ్రాయింగు రూములో మనకు కనిపించేది గుమ్మానికి ఎదుట కొంచెం ఐమూలగా మామూలు బల్ల, కుర్చీ, ఆగంతులకూ అలాటివే కొన్ని కుర్చీలు. ఆయన బల్ల ఎదుట గోడకు శృంగార రస నాట్యాధి దేవతలయిన రాధాకృష్ణుల వర్ణ చిత్రం. లోపల వినిపించే మృదంగ నాదాన్ని, తాళ తాడనాన్ని బట్టి నృత్య నికేతనం అనుకోవలసి ఉంటుంది. అతి నిరాడంబరం. రామకృష్ణ ఇండొనీసియాలో కళకు కాణాచి అయిన బలి ద్వీపంలో 1933 న జన్మించారు. నాయనగారిది తూర్పు గోదావరి జిల్లా. తల్లి గారిది వరంగల్ దగ్గర కొలనుపాక. తండ్రిగారు ఆగ్నేయాసియా దేశాలతో వ్యాపారంతో ఇండొనీసియాలో ఉండగా రామకృష్ణ జన్మించారు. రామకృష్ణ అన్నగారు కూడా మహా నర్తకులు. ఆయన 12వ ఏటనే గొప్ప ప్రదర్శనలిచ్చేవారుట. ఆయన ప్రోత్సాహంకూడా ఉంది రామకృష్ణకు. రామకృష్ణ తల్లిగారు సంస్కృత, పారశీక భాషలలో విదుషి. రామకృష్ణ 1941లో భారతదేశానికి వచ్చారు. తల్లి గారిది పెద్ద ఆస్తి. ఏవో తగాదాలు వచ్చాయి. రెండు మూడేళ్ళపాటు రాజోలులో, వరంగల్లులో గడిపారు. నాగపూర్ వెళ్ళారు. రామకృష్ణ మిషన్ వారి ప్రాపులో పెరిగారు. ఎదిగే మంచి మొక్కకు మంచి దోహదం. చిన్ననాడు మనఃఫలకంపై ముద్రవేసిన 'బలి' ద్వీప సుందర శిల్పాల భంగిమలు కాలేజి చదువుతోపాటే ఆయనలో తరంగితమయ్యాయి. వివిధ నృత్య రీతులూ నేర్చుకొన్నారు. ఎం. ఏ. చదువుతుండగా, చదువు మాని నృత్యానికే జీవితం అంకితం చేద్దామనే సంకల్పం బలపడింది. ఎం.ఏ. పరీక్ష ఉండగా, దానికి స్వస్తి చెప్పి సకల నృత్యాలను శాస్త్రీయంగా నేర్చుకోవాలని బయలుదేరారు. భండారా సంస్థానం ఆస్థాన నర్తకులు గణపత్‌రావు పాండ్యా వద్ద



డా. నటరాజ రామకృష్ణ

మూడు సంవత్సరాలు కథక్ మణిపురి నృత్యాలు నేర్చారు. అంతటితో తనివి తీరలేదు. దాక్షిణాత్య గీతులలోను దక్షత సంపాదించాలనుకున్నారు. పందనల్లూరు మీనాక్షి సుందరంపిళ్లె వద్ద భరత నాట్యం నేర్చారు. మన నాట్య పద్ధతిలో మూడు ప్రధాన విభాగాలున్నాయి. 1. ఆగమాలకు సంబంధించిన దేవాలయ నృత్యాలు, 2. విద్వాంసులను మెప్పించే ప్రదర్శనలు, 3. సామాన్యులకు యక్షగానాలు మొదలయినవి. ఆగమ నాట్యాలు అతి ప్రాచీనమైనవి. ఆ సంప్రదాయం లుప్తమయి పోతున్నది. దానిని నేర్వనిదే సంపూర్ణత్వం కలుగదనిపించింది. వెదుక్కుంటూ వెళ్ళి, కాళహస్తిలో సుప్రసిద్ధ నర్తకి నాయుడుపేట రాజమ్మ వద్ద శైవాగమ, పాంచరాత్ర వైఖానసాగమ నృత్యములలో శిక్షణ పొందారు. నవ జనార్దనంవంటి అపూర్వ భామాకలాపాన్ని తదితర సంప్రదాయాలను రక్షించిన పెండేల సత్యభామ (పిఠాపురం) వద్ద వివిధ ప్రాచీన రీతులను అభ్యసించారు. సుప్రసిద్ధ కూచిపూడి నాట్యాచార్యులు వేదాంతం లక్ష్మీనారాయణ శాస్త్రి వద్ద కూచిపూడిలో శిక్షణ పొందారు. ఈ ప్రాచీన కళా సంప్రదాయాలతో పాటు కర్నాటక, హిందూస్తానీ సంగీతాన్ని, నృత్యానికి అవసరమయినంత వరకు నేర్చుకున్నారు. పాశ్చాత్య నృత్య సంప్రదాయాలను తులనాత్మక దృష్టితో ఆకళించుకొన్నారు. నాట్యం పట్ల పై అంతస్తు వారికున్న అపోహను పోగొట్టడానికి పెద్ద కుటుంబాలలో నాట్య ప్రచారం చేయాలనే సంకల్పం కలిగింది. నెల్లూరులో పొణకా కనకమ్మ గారి కస్తూరిబాయి విద్యాలయంలో కొంతకాలం కుటుంబ స్త్రీలకు నృత్యం నేర్పుతూ తమ సిద్ధాంతం నెరవేర్చుకొన్నారు. గుంటూరులో ఒక ఏడు, విశాఖలో రెండు సంవత్సరాలు ఉండి, హైదరాబాద్ వచ్చారు. ఢిల్లీనుంచి గొప్ప పదవికి ఆహ్వానం వచ్చింది. సంప్రదాయ నాట్య రీతుల పునరుద్ధరణ కోసం, ఆ పదవిని తిరస్కరించి, 1959 నృత్య నికేతన్‌ను స్థాపించారు. నేడు దేశం ఎంతో ప్రసిద్ధి పొంది స్వయంగా నృత్య పాఠశాలలు నిర్వహిస్తున్న పలువురు నర్తకీమణులు రామకృష్ణ శిష్యులు. జర్మనీ, ఫ్రాన్స్, అమెరికా, రష్యా, ఇంగ్లాండు వారూ శిష్య వర్గములో ఉన్నారు. ఆంధ్రదేశంలో ఉన్నన్ని నాట్య నృత్య రీతులు మరే జాతికి లేవని, వాటిలో దేవాలయ నృత్యాలు తలమానికమని ఆయన డంకా బజాయించి చెబుతారు. దేవాలయ నృత్యాలు ఉన్నంత మాత్రాన నేను వెనక్కు వెళ్ళుతున్నానని భ్రమపడవద్దు. ఆనాటి నాట్య సంప్రదాయాల పునరుద్ధరనే నా లక్ష్యం. అప్పటి అపూర్వ జతులు హంసనాద, తురంగ లీల, రాజవిద్యాధర, విద్యాధర, గరుడ తాళ వంటివి లుప్తమయి పోరాదనే నా బాధంతా. అందుకే ఆగమ శ్రద్ధ. కార్వేటినగరం విద్వాంసులు గోవింద స్వామయ్య అష్టగతిలో రౌర, ఆరడిగా, వడిగా, వరాళి, మరువరాళి అని గమకాలు గుప్పించేవారు. బేరీపూజ అనేది 36 రాగాల, 56 తాళాల తంతు.

# హైదరాబాద్ నోట్ బుక్

అగమాలలో ఉన్నన్ని అడుగులు మరెక్కడా లేవు. పేరిణిలోని వీరరసం మరొక దానిలో లేదు. అది వీర రసైక నాట్యం. ప్రాచీన ధ్రుపద సంప్రదాయం పేరిణిలో ఉంది. దీని గతిని చూచి జతులు విని ఫ్రాన్స్, రష్యా విద్వాంసులు ఆశ్చర్యపడ్డారు. ఆగమ పద్ధతి నాలుగైదేళ్ళు కష్టపడితే నిలుస్తుంది. వీటిలోని వైవిధ్యం మరే దానిలోను లేదు. సంస్కారవంతులు కళాత్మకంగా ఉండేట్టు ప్రదర్శించడం మా లక్ష్యం. పురుషుడు పురుషుడుగా సోలో డ్యాన్సు చేయడం ఒక్క పేరిణిలోనే ఉంది—అని రామకృష్ణ అంటూ భామా కలాపంలోనే 16 విధాలుండన్నారు. శ్రీకాకుళం, విశాఖలలో పురుషులే వేస్తారు. ఇది ధ్రువ పద్ధతి. గోదావరి జిల్లాల భామాకలాపంలో స్త్రీలే. మార్దవం, లాలిత్యం ఉంటాయి. కృష్ణ, గుంటూరు జిల్లాలలో మగవారే. గుంటూరు జిల్లాలోనే నర్సారావుపేట కలాపం స్త్రీలే వేస్తారు. తూర్పు కలాపం కన్నా సున్నితంగా ఉంటుంది. అనంతపురం జిల్లాలో పారిజాతమని ఆడేవారు. అది లుప్తమయిపోయింది. చిత్తూరులో వీధి నాటకం. కొత్త ఇండ్లు గ్రామంలో రామాయణ భాగవతాలను, భారతాన్ని 18 రాత్రులూ ఆడుతారు. వరంగల్, నిజామాబాద్‌లలో యక్షగానం చిందులు. కరీంనగర్‌లో వీధి భాగవతం. మెదక్‌లో యక్షగానం ఆదిలాబాదులో గిరిజన నృత్యాలు, మహబూబ్ నగర్‌లో కన్నేరి ఆటలు. కాళహస్తి, పుంగనూరు కార్వేటి నగరం, వేంకటగిరి వంటి సంస్థానాలలో కన్నేరి నాట్యాలు. దేవాలయాలలో కేళికలు. వీటిని రాజులయినా, దేవాలయాలకు వచ్చే చూచే వారు. మరచాను, నెల్లూరు జిల్లాలో ఏనాది భాగవతాలు— వీటన్నింటినీ మనం రక్షించాలి. 23 జిల్లాల ప్రాచీన నాట్య రీతులను మనం పునరుద్ధరించాలి. తమిళనాడులో తెలుగువారే నాట్య ప్రవర్తకులయినా, కాపాడిన, కాపాడబడుతున్నవారు తమిళులు అన్నారు రామకృష్ణ. భరతునిది ప్రధానంగా నాటకీయత. సోలో డ్యాన్సులకు అభినయ దర్పణ ప్రమాణం గనుక తెలుగుదేశంలో అభినయదర్పణ మనకే ప్రాచుర్యం ఏర్పడింది అన్నారు. తాళ, గతుల విభేదాలను ఆయన వింగడిస్తూ తాళం మొదట్లో లేదు. గతి ప్రస్తారమే ఉంది. పాశ్చాత్యులు 2, 3, 4 మీటర్ల పైనే కొనసాగిస్తారు. ఆంధ్రదేశంలో జానపద నృత్యంతా 2, 3 5 గతులపై నడుస్తుంది. చంగోరీతే మగాన ముఖ్యం. దీనికి గొండ్లి ఉదాహరణ. సమగతితో సమాప్తం కావాలి. ఇదంతా మేధకు సంబంధించింది. మొత్తం 360 డిగ్రీలు వాటిపైనే భంగిమలన్నీ ఆధారపడ్డాయి. మూల సూత్రాలన్నీ ఒకటే. ప్రాంతీయ భేదాలతో వైవిధ్యం ఏర్పడింది. ఆగమనృత్యములన్నీ ధ్వని శాస్త్రానుగుణమైనవి. ఇంద్రుణ్ణి దేవ గాంధారితో ఆహ్వానించాలి. అంటే ఆ ధ్వని తరంగ కంపనం వల్ల కలిగే రాగస్వరూపోపాసనం— అన్నారు. రామకృష్ణ తన సిద్ధాంతాల ప్రచారం కోసం, తెలుగు వారికి స్వనాట్య రీతుల జ్ఞానం కోసం దాదాపు 40 పుస్తకాలు రచించారు. వాటిలో నర్తనసేను, నర్తన భూమి, నర్తనబాల, డ్యాన్సింగ్ బెల్స్ (ఆంగ్లం), నర్తన కథ కేంద్ర ప్రభుత్వం ప్రథమ బహుమతిని పొందాయి. ఆయన నిరంతరాన్వేషణ పరిశోధన, ప్రయోగ ఫలితం ఆంధ్రాస్ అండ్ ది ఆర్ట్ ఆఫ్ డ్యాన్స్ (ఆంధ్రులు — నాట్య కళ) అనే నాలుగు భాగాల ఉద్గ్రంథం. నాట్య విజ్ఞాన సర్వస్వమనదగిన ఇది త్వరలో ప్రచురణ కానున్నది.

రామకృష్ణ సొంత బాణీలో ఐదు నృత్య నాటికలను రచించారు. వాటిలో వేంకటేశ్వర కల్యాణం, చాల ప్రాచుర్యం పొందింది. కుమార సంభవం ఉజ్జయినిలో స్వర్ణ కలశం పొందింది. సంగీత నాటక అకాడమీ 1970లో ఆయనను భారత కళాప్రపూర్ణ బిరుదంతోను, ఆంధ్ర విశ్వవిద్యాలయం 1980లో కళాప్రపూర్ణ బిరుదంతోను గౌరవించాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆయనను శ్రీశైల దేవస్థానం నాట్యాచార్యుడుగాను, రాష్ట్ర ప్రభుత్వ ఆస్థాన నాట్యాచార్యులుగాను నియమించడమే గాక, రాష్ట్ర నృత్య అకాడమీకి అధ్యక్షుని గాను చేసింది. కొన్ని నెలల క్రిందట కాకినాడలోని ఆంధ్ర నాట్య కళాభిమానులు రామకృష్ణను "స్వర్ణ కిరీటం"తో సత్కరించారు. రామకృష్ణకు ప్రభుత్వ సహకారం, అర్థ బలం, శిష్యుల అభిమానుల అంగబలం పూర్తిగా ఇప్పుడు ఏర్పడ్డాయి. గనుక తమసంకల్పాలు సిద్ధింపడంలో అంతరాలేవీ ఉండవు కనుక తెలుగుదేశంలోని దేవాలయాగమ నృత్య రీతులను, పేరిణితోపాటు విపుల ప్రచారం పొందిస్తారని, కళాకృష్ణ, పేరిణి రమేష్, సుచేతాజోషి, సునంద, గిడుగు విశాలాక్షి, రామకృష్ణ (ఉడిపి) ఉపాదాతార్, ఉమ రెక్సోనా (న్యూయార్క్) వంటి శిష్యులకు తోడు సహాసాధిక శిష్య ప్రశిష్యులను తీర్చిదిద్ది ఆంధ్రప్రదేశ్ ప్రాచీన నృత్య రీతులను అజరామరం చేస్తారని విశ్వసిస్తున్నాను. నేనే కాదు. ఆయనతో పరిచయం, ఆయన కృషి పరిచయమున్నవారెవరైనా విశ్వసిస్తారు. గాంధర్వవేద స్వరూపుడయిన నటరాజ రామకృష్ణ వేదోక్త, జ్యోతిశ్శాస్త్రోక్తాయుస్సుతో తన నాట్యోద్ధరణ యజ్ఞాన్ని కొనసాగించాలి. సెంచరీలాగూ కొడతారు. నేను ఎక్కువగా కోరింది నూటిపై 20ఏళ్లే మరి.




ఇటీవల విజయవాడలో ఆంధ్ర నాటక కళాసమితి వారు రాష్ట్రస్థాయిలో నిర్వహించిన వీణా వాదన పోటీలలో మొదటి బహుమతి పొందిన శ్రీమతి కాశీ విశాలాక్షి, రెండవ బహుమతి పొందిన శ్రీమతి కాశీ పద్మబాల, మూడవ బహుమతి పొందిన కుమారి మాధవీలత, సంస్థ కార్యదర్శి శ్రీ కర్నాటి లక్ష్మీనరసయ్యలను చిత్రంలో చూడవచ్చు.

**ఉపశ్రుతి :**

అయ్యా మా ఇంటి పేరు వీరుభట్లవారు. నన్ను జలతరంగం రామశర్మ అన్నారు మీరు— అన్నారు సాంస్కృతిక కార్యక్రమాల వ్యాఖ్యాత. మిత్రులు శ్రీ రామశర్మ. మీ వంశంలో ఎవరో వీరుభట్టుగారనే వారు జన్మించి మీ అందరికీ ఇంటి పేరు సమకూర్చారు. మీలో ఒక శాఖ జలతరంగం వారని ఏర్పడితే తప్పేముంది ? అని ప్రశ్నించారు మా మాటలు వింటున్న ఒకరు మీరెప్పుడో జలతరంగం వాయించారు. బాగుంది. ఆ పేరుతో పిలిచారు మీ అభిమానులు. ఆ పేరు పోదు. పోదు సుమీ కీర్తికాంతపొందిన పిదపన్ అనలేదా సుమతీ శతకకారుడు. అన్నారు వివేకవర్ధని బోధనాభ్యాసన కళాశాల ప్రిన్సిపాల్, మిత్రులు శ్రీ మద్దిపట్ల వెంకటరావు. కీర్తికాంత మాత్రమే కాదు సార్, ఏకాంతయినా పోదు పొందిన పిదపన్— అన్నారు ఎవరో గుంపులో నుంచి.

# వంటలు

## బటాకపూవా

కావలసిన వస్తువులు - అటుకులు — 250 గ్రా, పచ్చిమిరపకాయలు - అయిదు, వేరుశనగపప్పు- కొదిగా, బంగాళదుంపలు— రెండు, కొత్తిమీర కొదిగా, ఉప్పు, పసుపు తగినంత, నిమ్మకాయ—1

తయారుచేయు విధానము — ముందు అటుకులు బాగా శుభ్రముచేసి వీటిలో కడిగి వార్చి పెట్టుకోవాలి బంగాళ దుంపలు పై తొక్కుతీసి చిన్న చిన్న ముక్కలుచేసి పెట్టుకోవాలి పచ్చిమిరపకాయలు, కొత్తిమీర కూడ సన్నాగా తరిగి ఉంచుకోవాలి ఒక బాణలిలో కొద్దిగా నూనెపోసి నూనె కాగాక అందులో కొద్దిగా ఆవాలు, వేరుశనగపప్పు, బంగాళ దుంపలు వేయాలి పచ్చిమిరపకాయలు గూడా తరిగివేయాలి ఇవి అన్నియు కొంచెము ఎర్రగా అయినాక అంటే బంగాళదుంపలు నూనెలోనే ఉడుకులాయి అవి మెత్తగా అయినాక కడిగిపెట్టిన అటుకులు వేయాలి తాలింపులోనే తగినంత ఉప్పు, పసుపు వేయాలి ఆ మిశ్రమాన్ని అంత బాగా కలిపి మూతపెట్టాలి రెండు నిమిషాల తరువాత దించే ముందు తరిగిపెట్టిన కొత్తిమీరు, నిమ్మకాయ రసంచేసి బాగాకలిపి దింపేయాలి ఇది గుజరాతి వాళ్ళు చాలా ఇష్టంగా తింటారు ఇది తయారు చేయడము కూడ చాలా శులభము

— యాస్మిన్

## మిల్క్ కేక్

కావలసిన వస్తువులు పాలపొడి—1 కప్పు (100 గ్రాములు), శెనగపిండి —అరకప్పు, పంచదార —1న్నర కప్పులు, నీళ్ళు — 2 కప్పులు, డాల్డా — పావుకప్పు

చేయువిధానము శెనగపిండిని సన్నని సెగమీద దోరగా వేయించి చల్లార పోయవలెను బాగా చల్లారిన తర్వాత దానిలో పాలపొడినివేసి బాగా కలియబెట్టవలెను వుండలు వుండలుగా వుండరాదు శుభ్రమైన బాణలిని పొయ్యిమీద పెట్టి దానిలో 2 కప్పుల నీళ్ళు, ఒకటిన్నర కప్పుల పంచదారవేసి బాగా కలియబెట్టి తీగపాకం పట్టవలెను పాకం వచ్చిన తర్వాత బాణలిని పొయ్యిమీద నుండి దించి



దానిలో ఈ శెనగపిండి, పాలపిండి మిశ్రమమును పోసి బాగాకలియబెట్టవలెను యిక్కడ ముఖ్యముగా గమనించవలసినదేమంటే పాకం పొయ్యమీద నుండి దించన తర్వాతనే పిండిని కలపవలయును తర్వాత పావుకప్పు డాల్డా ను కూడా పోసి మొత్తం మిశ్రమంను బాగా కలియబెట్టి, డాల్డా తడిమి వుంచిన వెడల్పాటి పళ్ళెంలో ఈ మిశ్రమాన్ని పోసి చల్లార్చవలయును ఆ తర్వాత మీకు నచ్చిన సైజులో, ఆకారంలో కేకులను కోసుకొనవచ్చును ఇవి ఒక వారం రోజులు నిల్వవుంటాయి చౌకగా త్వరగా చేసుకోగలిగిన స్వీటు మిల్క్ కేక్ రుచిగా వుండి నోట్లో వేస్తే కరిగిపోయేలాగ వుంటాయి

— యం. కె. బేగ్

## [illegible]

కావలసిన పదార్[illegible] 1 కప్పు, కొబ్బరిపాలు 1 [illegible], పంచదార 2 కప్పులు, [illegible], కొంచెం కొంచెం [illegible], జీడిపప్పు, కేసరి రంగు 1 [illegible]

తయారుచేయు విధానము - [illegible] నీటితో గట్టిగా కలిపి ఒక గంటసేపు [illegible] నివ్వాలి [illegible] రవ్వలో నీరు [illegible] రవ్వ నుండి పాలు [illegible] కొబ్బరిపాలను [illegible] ఉండేలా [illegible] మామూలు పాలగా [illegible] ఈ [illegible] పాలి [illegible] అడుగు మందం పాత్రలో పోసి, [illegible] గట్టి పడగలగా [illegible] నేతిని కలుపుతూ [illegible] గరిటెతో కలుపుతు [illegible] పొయ్యమీద [illegible] కంటే కెంపుగ [illegible] చిటికెడు [illegible] నెయ్యిపూసి [illegible] పొయ్యాలి [illegible] కిస్మిస్ [illegible] పళ్ళెంలో పోసి [illegible] కల [illegible] మీకు కావల[illegible] ముక్కలు కోసుకోవచ్చు

— [illegible]



# ఉత్తరాలు

(4 వ పేజీ తరువాయి)

## వంటలు

వంటలు శీర్షికలో 8—10—82 మీ పత్రిక నందు పూర్ణా కళ్యాణగారు వ్రాసిన 'కేరట్ పాయసము' చేసి తింటిమి పాయసం చాలా రుచిగా వుండెను పిల్లలు, పెద్దలు చాలా బాగుందని అన్నారు చేసేందుకు కూడా సులభంగానే వున్నది

జి రెడ్డమ్మ (రామరాజుపల్లె)

## అరేబియా నుండి

మాకు నచ్చిన కథలు "అప్పుకు ఇవ్వబడును" 'తెల్లబోయిన తెలుగు పాండిత్యము ''సీరియల్స్‌లో "కాలంకరిచాక", "దాంపత్యసంగీతం"

సిహెచ్ పి క్రిష్ణమూర్తి, అప్పర్, కె ఎస్ ఏ హాపర్ అల్ బాటెన్, (సౌదీఅరేబియా)

## భట్రాజు పొగడ్త!

తిరుమల రామచంద్రగారు వ్రాసిన (హైదరాబాద్ నోట్ బుక్) ఉపశ్రుతి మాజీ ముఖ్యమంత్రి వెంకటరామ్‌కు చేస్తున్న "భట్రాజు పొగడ్త"లా వుంది చీటికి మాటికి ఢిల్లీ పెత్తందార్లు ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గంలో చేస్తున్న విచిత్ర గారడీ విన్యాసాలను దృష్టిలో పెట్టుకొని, అవగాహనతో వ్రాసి యుంటే బాగుండేది

సూరాడ నారాయణరావు (డొంకలూరు—బారువ)

## అవివేకం

15 10 82 సంచికలో ఉత్తరాల శీర్షిక " ఒక ఉత్తరం చూచి వ్రాస్తున్నాను

హాస్యపు కార్టూన్లు వేయడానికి హిందూ మత దేవుళ్లే కావలసి వచ్చిందా అన్నారు నిజమే కాని హిందూమతంలో ఉన్న దేవుళ్ల సంఖ్య చెప్పలేం క్రైస్తవులకి "ఏసు" ఒక్కడే అలాగే ముస్లింలకు అల్లా ఒక్కడే దేవుడు "ఏసు", "అల్లా"ల మీద ఎన్ని కార్టూన్లు వేస్తాం? ఒకవేళకొన్నైనా వేయవచ్చుగా అని మీరంటే వేం వేస్తున్నాం కాని ఎడిటర్లు తెలుగు దేవుళ్లపై వేసే కార్టూన్లకు అంకితమయిపోయినట్లు మిగతా మతవాంలపై వేసిన కార్టూన్లు త్రిప్పికొడుతున్నారు

ఏది ఏమైనప్పటికి కార్టూను అనేది సరదాగా నవ్వుకోవడానికే తప్ప, అది కించపరుస్తున్నాం అనుకోవడం అవివేకం ఒక్కసారి ఆలోచించండి

శ్రీవల్లి (కార్టూనిస్ట్, అమలాపురం)

## సంప్రదాయ విరుద్ధమే!

8 10 82 పత్రికలో 'సంప్రదాయ విరుద్ధం కాద'ని శ్రీ చెరకువాడ వెంకట రామారావుగారు వ్రాసిరి నాకు తెలిసిన దానిని విన్నవించుచున్నాను ఒక కుటుంబంలో ముగ్గురు బ్రహ్మచారి సోదరులు సాధారణంగా ఉండరు అనగా మూడవవానికి ఉపనయనమయేటప్పటకి పెద్దవానికి వివాహం జరుగుతూ ఉంటుంది అంతేగాని ముగ్గురు బ్రహ్మచారులు ఉండకూడదని ఎక్కడైనా నిషేధం ఉంటే శ్రీ రామారావుగారు చూపగలరని ఆశించెదను ఇక వివాహమయిన సంవత్సరము లేదా 6నెలల వరకు ఆ యింట కేశఖండనం, వెల్ల వేయుట, ఇల్లు తిరగ వేయుట ఎవరూ చెయ్యరు "ముండ నాన్మండనం కార్యం మండనాన్నతు ముండనం" అంగా ఉపనయనానంతరము వివాహము జరిగించవలెను కాని వివాహానంతరము ఉపనయనం చెయ్యరాదు అని వివాహానంతరము ఆయింట ఉపనయనం చేయవచ్చునని శ్రీ రామారావుగారు ఏదైనా ప్రమాణం చూపించినచో సంతోషము నాకు తెలిసినంతవరకు ఇది శిష్టాచారం కాదు

ఎస్ వి యస్ సుబ్రహ్మణ్యం (బొబ్బిలి)

## గమనిక

గతవారం (5-11-82) సంచికలో 63 వ పేజీలో పడిన "ఆక్సిజను!" గేయం రాసినవారు శ్రీ కె అశోకుబాబు & శ్రీ కె కిశోరుబాబు అని గమనించ కోరుతున్నాము — సం



Printed and Published by S Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar. Vijayawada-3 Editor S Radhakrishna